

సంపాదకులు.

నడింపల్లి వెంకట లక్ష్మీనరసింహారావు. ఎం. ఏ. ఎల్. ఎల్. బి. బారిష్టరు.

[illegible] జగన్నాధరావు. ఎం. ఏ. బారిష్టరు.

3 వత్సరము. { జ్యేష్ఠము, క్రోధన. మచిలీపట్టణము, 15 జూను ౧౯౨౫ } సంపుటము ౧ సంఖ్య ౨

# ఎఱ్ఱగన్నేరు. *



(అబ్బూరి రామకృష్ణారావుగారు.)



[ ఇందలి కథా సందర్భమునకాశ్రయమైన పట్టణముపేరు యక్షపురి. 'ఇచ్చటి పౌరకార్మికులు' లోద అను భూగర్భమునుండి బంగారము త్రవ్వి పోయు పనియందు నియుక్తులు. వీరి ప్రభువు అత్యంత జటిలమగు జాలావరణమునందు నివసించు చుండును. ఈయావరణ మొక్కటిమాత్రమే రంగస్థలమున కాన్పించు చుండును. సమస్త నాట్య వ్యాపారము ఈ యావరణ బహిర్భాగమందే జరుగును. ]

* మహాకవి రవీంద్రనాథ టాగూరుగారు వంగభాషయందు రచించిన "రక్తకరవీర్" అను నేకాంక నాటకమున కనువాదము.

నందిని, కిశోరుఁడు (భూమియందలి సురంగము త్రవ్వు బాలకుఁడు)

కిశో:— నందినీ, నందినీ, నందినీ!

నం:— ఎందుకోయి నన్నింతగా పిలుచుచున్నావు! నాకు వినబడదనియా!

కిశో:— నీవు వినలేవని కాదు. పిలుచుటయందె నాకు సంతోషము. నీకింకను పూలు కావలయునా! అట్లైన పోయి తెచ్చెదను.

నం:— సరిలే. ఆలస్యము చేయక నీ పనిలోనికి పో.

కిశో:— దినమంతయు సువర్ణఖండములు త్రవ్వి తెచ్చుచుందును. ఎట్లో తీరిక చేసుకొని నీకు కొన్ని పూలు తెచ్చినయెడల బ్రతికిపోదును.

నం:— కిశోరా! నీకు తగిన శాస్తి చేయుదురని యెఱుగుదువా?

కిశో:— ఎఱ్ఱ గన్నేరు పూవులు తప్పక కావలెనని నీ వని యుంటివి. అపూర్వ నీ ప్రాంతమునందు సులభముగా దొరకవు. అందుకని నాకానందము. ఎన్నాళ్ళో వెదకి వెదకి తుదకొక పెంటప్రోవుపై నొక చెట్టును చూచితిని.

నం:— నాకది చూపుము. నేనే స్వయముగా పూలు కోసికొని వత్తును.

కిశో:— నందినీ! అట్టి నిష్ఠురాలాపము లాడకుము. నాకాప్తమైన యీ ఒక్క రహస్యమును తెలిసికొనగోరకుము. విశ్వేశు డప్పు డప్పుడు నీకు పాటలు పాడి వినిపించుచుండును గదా? అవి యతని సొంత పాటలు. నేటినుండి నేను నీకొఱకు పూలు సేకరించి తెచ్చెదను. ఇవి నా సొంత పూలు.

నం:— అయితే, ఇచ్చటి ముఖ్యకారులు పశుప్రాయులు. వారు నిన్ను శిక్షించినచో నా హృదయము తఱుగుకొని పోవును.

కిశో:— ఆ బాధచే నా పూవులు మఱింతయెక్కువగా నావేయైపోవును. అవియే నా సుఖ ధనము.

నం:— కాని యీ దుఃఖము నే నెట్లు లోర్చుకొనగలను.

కిశో:— దుఃఖమెందుకని? నందినీ! నీకై యొకనాడీ ప్రాణములకూడ నర్పింతును, అనియెన్నిసార్లు మనసా భావించియుంటిని.

నం:— ఇంతగా నన్ను గ్రహించితివిగదా! కిశోరా దీనికి బదులుగ నే నేమి యీయగలను.

కిశో:— అనుదినమును నా యొద్దనుండియే ప్రాతఃకాలమున పూవులు గ్రహింతునని మాత్రము చేతిలో చెయివేసి చెప్పుము.

నం:— సరి, ఒప్పుకొన్నాను. నీవుకూడ కొంచెము జాగరూకుడవై ప్రవర్తింపుము.

కిశో:— నేను మాత్రి మట్లుండను. ఆ పాపిష్టి ముఖములు చూచుచుండగనే ప్రతిదినమును నీకు పూలు తెచ్చియిత్తును.

(నిష్క్రమించును.)

(అధ్యాపకుడు ప్రవేశించును.)

అధ్యా:— నందినీ! వెళ్ళకుము. ఇటు చూడు.

నం:— అధ్యాపకులా!

అధ్యా:— క్షణక్షణమును మమ్ముల నీవిట్లు మోఱపించి పోయెదవెందుకని? మామనస్సులు నీవే కలత పెట్టితివి. నీవు లేకున్న నాకలత తీయుట యెట్లని కొంత తడవాగుము. రెండు మాటలాడి పోవుదువుగాని.

నం:— నాతో నేమి ప్రయోజనము?

అధ్యా:— ప్రయోజనముకై వచ్చుట గాదు. అటు చూడుము, సురంగము త్రవ్వువారందరు పృథివీ హృదయమును చీల్చి ప్రయోజన భారమును తలలపైనిడుకొని యెట్లు కీటములవలె భూగర్భము నుండి బయల్వెడలుచున్నారో! ఈ యక్షపురి యందు మాకున్న భాగ్యమంతయు ధూళీపరాగములందు గుప్తమైనధనము—సువర్ణము. నీవును సువర్ణమవే. కాని సుందరీ నీసువర్ణము ధూళి గూఢరసము కాదు. మహా తేజస్సంజాతము. ఏ ప్రయోజనము దానిని బంధింపగలదు.

సం:— ఎంతపనికును ఒకటే మాట! అధ్యాపకా నన్ను చూచిన మీకే విస్మయమెందులకు?

అధ్యా:— ఈ దయానుపుష్ప నిశాంతరాశముల నుండి ప్రసరించు కాంతి విస్మయ జనకము కాదు. శీర్ణ కుడ్యము నందలి పగుళ్ళనుండి వచ్చు వెలుతురు సంగతి వేరు. యక్షపురియందుండు విచిత్రమైనట్టి యపూర్వకాంతివి. అవును గాని యీ ప్రదేశ మెట్లున్నదో చెప్పుము.

సం:— ఈ మహానగరమునందలి యీబాల గోపాలము భూగర్భములోని నిగూఢదేశములందు తలలుదూర్చి యంధకారమునందు దారితెలియక సంచరించుచుండుటను చూచి నిశ్చేష్టురాల నైతిని. పాతాళమునందలి సొరంగములనుండి త్రవ్వి త్రవ్వి యతడు ధనమంతయు తీసుకొని వచ్చుచున్నారు. అదియంతయు చిరయుగములకు పూర్వము మరణించినధనము. దానిపై భూదేవి గోరీకట్టియుంచినది.

అధ్యా:— మేమెల్లరము సామ్రాజ్య ధనమునకు శవసాధన యొనర్తుము. దాని ప్రేతము వశపడునట్లొనర్చుటకే మా ప్రయత్నము. ఆసువర్ణ రాశియందలి బేతాళుని బంధింపగలిగిన యెడల ఈ భూమండలమంతయు మా గుప్పిటలో నుంచుకొనగలము.

సం:— అదియట్లుండ మీప్రభువు నొక యస్థిజాలమునకు చాటుగా దాచియుంచితిరి; అతడును ఒక మనుష్యుడని తెలిసిపోవునని యా? మీపాతాళమార్గమునందలి చీకటితెరను తెరచివైచి యచట ప్రవేశించుటకు వెలుతురెట్లు ప్రయత్నించుచున్నదో యట్లేయీ మహాజాలము నంతయు చిందర వందరయొనర్చి యాలోపలనున్న మానవుని యుద్ధరింప వలయునని నాకు బుద్ధిపుట్టినది.

అధ్యా:— మా మృతధనముయొక్క ప్రేతకెటువంటి భయంకర శక్తియున్నదో మనుష్యమాత్రుడగు మా ప్రభువునకు కూడ నట్టిదే భయంకర ప్రతాపమున్నది.

సం:— ఇవన్నియు కోమటి బజారు మాటలు.

అధ్యా:— నిజమే. దిగంబరుని పరిచయము నిస్పష్టము కాదు; కోమటిబజారులోని గుడ్డలే యితడు రాజా యితడు బికారియని తెలుపగలవు. నాయింటికొకసారి రమ్ము. నీతో తత్వ ప్రసంగ మొనర్చుట మహానందముగా నున్నది.

సం:— మీపనివాండ్రెల్లు భూభాగములు త్రవ్వుకొని దూరిపోవుచుందురో నీవు కూడ నదేవిధముగ (గండశిలయగు రాధా) న్వేషణ మొనర్చుచు నధోముఖుడవై యేగుచుందువు. నాకోసము నీవేల వృథాకాలహరణ మొనర్చుకొందువు.

అధ్యా:— మేము నిరవకాశములగు గర్తములయందు సంచరించు పురుషులము. నీవో సావకాశమగు నాకాశమున ప్రకాశించు సంధ్యాతారవు. నీదర్శన భాగ్యమున మాకు [illegible] వచ్చినట్లుండును. నాగృహమునకు రమ్ము. ఒకింత వృథాకాలహరణ మొనర్పనిమ్ము.

సం:— కాదు, కాదు. నేనిప్పుడు రాను. మీప్రభువు తన స్వగృహమునందే సాక్షాత్కరించుటకై నేనిచ్చటికి వచ్చితిని.

అధ్యా:— ఆతడెల్లప్పుడును చాల మధ్యమునందే యుండును. లోనికెవ్వరిని రానీయడు.

సం:— నాకీ జాల మనుల్లంఘ్యము కాదు; ఆతని మందిరాభ్యంతరము ప్రవేశించుటకే నేను వచ్చితిని.

అధ్యా:— నందినీ! ఎఱుగుదువా? నేనును ఒక మహాజాలము నందే వసించుచుంటినని!

మా భయంకర ప్రభువు వలెనె నేనును భయంకర పండితుడను.

సం:— నాతో పరిహాసమాడుచున్నావు. నీయెడల నాకు భయము లేదు. నన్నొక సంశయము బాధించుచున్నది. నీవు నన్నిచటికిగొని

వచ్చినప్పుడు నాప్రియసఖుడగు రంజనునికూడ తీసికొని రాలేదేమి?

అధ్యా— అన్ని పదార్థములను ముక్కలుచేసి తెచ్చుట వీరి పద్ధతి. సరిగాని, యీమృతధనము యొక్క సన్నిధానమునకు నీప్రాణధనము నెల తీసికొని రాలేకపోదవు?

వం— నా రంజనుడే యిచ్చటికి వేంచేసిన యెడల మరణపంజరమున ప్రాణవాయువులు సంచరింప నారంభించును.

అధ్యా— ఒక నందినితోనె మాయక్షపురి యందలి సర్దారులందరును మతిబుద్ధులై పోయిరి. ఇక రంజనుడుకూడ వచ్చినచో వారిగతి యేమి?

వం— తా మెట్టి విచి త్రమానవులో వారెఱుగరు. ఒక సారి విధాతవారి యెదుట సాక్షాత్కరించి, కడుపు చెక్కలగునట్లొక్క నవ్వునవ్విన యెడల వారి నిద్దుర మత్తుభగ్నమై పోగలదు. ఆవిధాత్ర తరళ హాసమువంటిదే నారంజనుని రాక.

అధ్యా— కేవలమనవ్వు సూర్యకాంతివంటిది. దానివలన మంచుకఅగిపోవును గాని పాషాణములు చెక్కు చెదరవు. మనసర్దారులను కదల్చుటకు కావల యునది కేవల బలప్రయోగము.

వం— నారంజనునిశక్తి మీకంఖునివది శక్తివంటిది. ఎంత నవ్వగలదో అంతగా భగ్నమొనర్పను గూడ గలదు. అధ్యాపకా నేను నీకొక రహస్యము చెప్పెదను. ఈదినమె నేను రంజనుని దర్శింతును.

అధ్యా— నీకట్లు తెలిసినది.—

వం— నేడే, నేడే అతని సందర్శన భాగ్యము. నాకు వార్తవచ్చినది.

అధ్యా— సర్దారుల దృష్టిపాతమును తప్పించుకొని వార్తలేమార్గమున రాగలవు?

వం— వసంతాగమున వార్త లేమార్గమున వచ్చునో ఆమార్గముననె.

అధ్యా— ఆకాశమునందలి రంగునందును వాయువు యొక్క కేళియందును వచ్చెడిగాలికబురా?

వం— రంజనుడు వచ్చినతోడనె గాలివార్త లేవిధముగవచ్చి నెలకై త్రాలునో చూపించెదను—

అధ్యా— రంజనునిమాటవచ్చిన యెడల నందిని నోరు మూయవడదు. ఇక ఊరకొనుము. నేనె తిగినది వస్తుతత్వవిద్య; దానిలో మునిగి చమువుకొను చుంగును. ఇక నీతో మాట్లాడ సాహసము లేదు. (కొంతదూర మేగి మరల తిరిగివచ్చి) నందినీ నిన్నొక సంగతి యడిగెదను. యక్షపురియన్న నీకు భయము వేయుటలేదా?

వం— భయమెందుకని?

అధ్యా— జంతుకోటి గ్రహణసూర్యుడనిన భయ విహ్వలమగును. పూర్ణసూర్యుడనిన నిర్భయము. యక్షపురి గ్రహణము పట్టిన పట్టణము. సువర్ణగుండమునందలి రాహువుచే నది కబళింప బడినది అయ్యది తాను పూర్ణము కాదు; అన్య వస్తువునెద్దానిని పూర్ణముగా నుండనీయదు. అందుకే నీవిచ్చట నుండవలదని చెప్పు చున్నాను. నీవు వెడలిపోయినయెడల నీగుండ ములు మతింతగా నోళ్ళుతెరచి మమ్ము కబళింప నెంచుననుట నిజమే. అయినను పరువెత్తి పొమ్మనియె నీకు చెప్పెదను. ఏ ప్రదేశమున వసుంధరా జనయిత్రి చేలాంచలములను ఖండ ఖండములుగా నొనర్చి చింపివేయదో ఆ ప్రాంతమున కేగి నీరంజనుడు నీవును సుఖముగా కాలము గడపికొనుడు. (కొంతదూర మేగి మరలతిరిగి వచ్చి)నందినీ! నీకుడి చేతికి కట్టుకొన్న యెఱ్ఱగన్నేరుపూలతోరమునుండి యొక పూవు తీసియిచ్చెదవా?

వం— ఎందుకు? ఏమిచేసెదవు.?

అధ్యా— నీ హస్తాభరణమగు రక్తకరవీరమునకేదియో నిగూఢార్థమున్నదని యెన్నిసారులో భావించి యుంటిని,

నం— అయర్థమేదియో నాకు తెలియదే.

అధ్యా— అది నిర్భాగ్యపురుషుడెఱుగును. ఈయెరుపు రంగునందు భయజనకమగు రహస్యమేదియో యున్నది; కేవలమాధుర్యమే కాదు.

నం— నాయందు భయజనకత్వమా?

అధ్యా— రమణీ! నా హస్తమునందు విధాత రక్తతూలిక నుంచినాడు. దానితో రక్తరక్తముగా నేమి వ్రాతలు వ్రాయునో నే నెఱుగను. మాలతీ పూవు లున్నవి. మల్లెలు జాజు లున్నవి. ఇవన్నియు త్రోసిపుచ్చి యీపూవు నేల యేరుకొంటివి? ఎఱుగుదువా మానవులు తమలో తామెఱుగకయే తమ భాగ్యమును నిర్ణయించుకొనుచుందురని?

నం— రంజను డప్పుడప్పుడు నన్ను ఎఱ్ఱగన్నేరు పూవని పిలుచుచుండును. ఎందుకో యెఱుగను గాని రంజనుని ప్రేమ రక్తవర్ణమనియాను కొంటిని. అరంగును నాకంఠసీమయందు దాల్చితిని; నావక్షస్థలమందు ధరించితిని; నాపాణి యుగ్మమునందు బంధించితిని.

అధ్యా— అయిన నాకొక పూవునిమ్ము. కేవలతుణమాత్రదానము. అరంగు యొక్క తత్వమేదియో అర్థము చేసికొందును.

నం— ఇదిగో తీసికొనుము. రంజనుడీనాడు రానున్నాడు. ఆయానందముచే నీకీపూవు నిచ్చుచున్నాను.

(అధ్యాపకుడు నిష్క్రమించును)

(సారంగములు త్రప్పుగోకులుడు ప్రవేశించును)

గో— ఓకమాటిటు ముఖము త్రిప్పిచూడుము. నీసంగతి నాకర్థముకాలేదు. నీవెవరవు?

నం— నన్నెవరిని చూచుచున్నావో అంతకుమించి నేనెవరను గాను. నాసంగతి నీకెందులకర్థము కావలయును?

గో— అర్థముకానివస్తువునందు నాకు నమ్మకము లేదు. మాపరిభ్రష్టు నిన్నే ప్రయోజనమునకై గొనివచ్చినాడు?

నం— కేవలము నిష్ప్రయోజనముగా.

గో— నీయొద్ద నేదైన మంత్రమున్నదా! అందఱను వలలో వేసికొనుచున్నావు. సర్వనాశకురాలా, నిన్నుగాంచి మోహితులైన వారందఱు తప్పక మృతినొందుదురు.

నం— గ్యాగపడకుము, నీవును మరణింతువు—నాసౌందర్యమనవనములలనాగు—సుఖఖననమునలన.

గో— నీసిగయందు వ్రేలాడునవి యేమి? ఏవీ చూడనిమ్ము.

నం— రక్తకరవీరమంజరి.

గో— అనగా నేమి?

నం— అనగా నేమియును లేదు.

గో— నిన్ను కొంచెమైనను నమ్మజాలను. నీవు మాయలాడివి. నేటి సూర్యుడస్తమింపక పూర్వమే యేదో విపత్తు తప్పక సంఘటిల్లును. అందుకే యింతచక్కగా దిద్దుకొంటివి. ఓసి భయంకరీ! భయంకరీ!

నం— నన్ను జూచి నీకింత భయమెందుకు?

గో— నిన్ను జూడ రక్త కాంతులతో ప్రజ్వరిల్లు కాగడాను చూచినట్లున్నది. అజ్ఞానులయొద్దకేగి "జాగ్రత! జాగ్రత! జాగ్రత." యనిపరాకు చెప్పివచ్చెదను.

(నిష్క్రమించును)

నం— (జాలము బహిర్భాగమున దలుపుదట్టి) వినబడుచున్నదా?

నేపథ్యమున— నందా! వినబడుచున్నది. కాని మాటిమాటికి పిలువవద్దు. నాకు తీరిక లేదు. ఒక్కరవ్వయును లేదు.

నం— నేడు నామనస్సు బలె ఖులాసాగానున్నది. ఆ సంతోషముతో నీయింటిలోనికి రానలెననియున్నది.

నేప— ఇంటిలో ప్రవేశింపవీలులేదు. చెప్పదలచినదంతయు బయటనుండియే చెప్పుము.

నం— మల్లెపూలదండ గ్రుచ్చి పద్మపత్రమునందు తెచ్చినాను.

నేప— నీవే ధరింపుము.

నం— అది నాకు సరిపడదు. నాదండ యెఱ్ఱగన్నేరు పూలతో గ్రుచ్చుకొందును.

నేప:— నేను పర్వతశృంగమువంటివాడను. శూన్య త్వమే నాశోభ.

వం:— ఆశృంగాగ్రములందును జలపాతములుండును. నీకంఠసీమయందీపూలదండ నావేశింపనిమ్ము. జాలమును తెఱచివేయుము. లోపలికి వచ్చెదను!

నేప:— రానీయను. చెప్పదలచినది త్వరగా చెప్పుము తీరిక లేదు.

వం:— దూరమునుండి యీపాట వినవచ్చుచున్నదా!

నేప— దేనిగూర్చినపాట?

వం:— పుష్యగానము. పంటలు పండినవి. కోతకాలము వచ్చినది. అదుగో ఆపాట.

దక్షిణానిలసాధు దర్శనములు కడుపార
గోరిలిదిగ్వధువులు తేలియాడె
హ్మారమణీమణీ శయ్యాంచలమ్ముల
నపరంజి కిరణమ్ములవతరించె,
ధూళిపరాగావళీలాస్యకేళికి
నాకాశలక్ష్మి రసార్ద్రమయ్యె
పాన్యలక్ష్మి ప్రోత్సవదనలావణ్యమ్ము
లాధాన్యరాసులందడగిపోయె

రండు! గృహములలో నెవరుండగలరు!
తలుపు మూసికొనియీ సలకురాదు
పాన్యలక్ష్మి సమాహ్వానభరితములయి
భూనభోంతరాళమ్ములు పులకరించె.

నేప:— నన్ను పొలములలోనికి రమ్మందువా? అచట నేమి పనియుండును?

వం:— అచ్చటిపని నీయక్షపురియందలి పనులకన్న చాల సహజము.

నేప:— సహజ కార్యములె నాశక్తికి మించినవి. ఫేన నూపురములతో నృత్యము సేయుచు ప్రవహించు సెలయేటివలె సరోవరమెల్లు నా ట్యము సేయగలదు? పో. ఇక మాట్లాడకుము. తీరిక లేదు.

వం:— నీశక్తి మహాద్భుతము. నేను ప్రథమమున నీభాండారమును ప్రవేశించిన నాడు నీ సువర్ణ ఖండములను గాంచి నీసాశ్వర్యమునొం దలేదు. వాని సన్నిటి ననాయాసముగ పగుల గొట్టి కొనికొని వచ్చి తీరుగా నమర్చిన మీ విపులశక్తిని గాంచి విస్మయము నొందితిని— కాని, యీసువర్ణఖండములు ధాన్యపు కం కులవలె మీచేదోయి యందుయ్యాలలూగ గలవా? సరిగాని, పృథివియందలి యీమృత ధనమును అహోరాత్రములు కలతపెట్టుట భయకారణము కాదు!

నేప:— దేనివలన భయము!

వం:— భూదేవి తన ప్రాణపదములగు వస్తువులను ఉత్సాహముతో మనలకు ప్రసాదించును. కాని యీ హృదయమును భేదించి యచ్చటి యీమూకల నైశ్వర్యమని భ్రమించి తెచ్చినచో, నా నా మహాంధకారమధ్యమున నున్న కరాళ రాక్షసి యొక్క సమ్మరశాపమునకు గుఱియయ్యెదరు. చూచుట లేదు! ఇచ్చటి వారందఱు, కుపితులో సంశయగ్రస్తులో భయ కంపితులో యయియున్నారు.

నేప:— శాపమా?

వం:— ఒకరి నోట కొకరు మన్నుచల్లుకొని, యొకరి గొంతు నొకరు కోసికొను శాపము.

నేప:— శాపము మాట నాకు తెలియదు. మేము శక్తిని సంగ్రహించి తెచ్చెదము. అదిమా త్రము నేనెఱుగుదును. నాశక్తిని జూచి నీవా నందింతువా, నందినీ!

వం:— బలే; సంతోషము. అందులకే చెప్పుచున్నాను. వెలుపలికి రమ్ము నీభూభాగము పై నీయడుగు మోపి యీపృథివిని సంతోష పెట్టుము.

నేప:—నందినీ! నిన్నుగూడ విధాతరూపమాయామధ్య మున నపరూప మొనర్చినాడనులాగు అగుదువా? ఆమధ్యమునుండి నిన్ను విడదీసికొని పోగుప్పిటలో

నుంచుకొనవలెనని నాయూహ. కాని,యేవిధమునను గూడ నిన్ను స్పృశించుటకే శక్యము గాకున్నది. నిన్నొక మారిటు పట్టితెప్పి, యన్నివైపులను పరీక్షించి, అట్లు చేతగాని యెడల నిన్ను తునకలు తునకలుగా ఖండించి యవలపారవేయవలెనని నాయూహ.

సం:— ఏమంటివి?

సేవ:— నీ యీ యెఱ్ఱ గన్నేరు పూవుల కాంతిని పిండిపడియబోసి, నాకన్నుల కంజనముగా చేలజేసి కొనజాలకున్నానో? అదుగో ఆకులు మారదళములె తమయంచలముల నద్దుపెట్టుచు నన్ను బాధించుచున్నవి. నీయందుకూడ నదే చిక్కు. నీశీలమెంత కోమలమో యంత కఠినము నందిసి, నన్నుగూర్చి నీమనస్సు ఏమనుచున్నదో చెప్పుము.

సం:— అవృత్తాంత మింకొకదినము చెప్పెదను. నేడునీకు తీరికలేదు. ఇంటికి వెళ్ళెదను.

సేవ:— వద్దు, వద్దు. వెళ్లవద్దు. నన్నుగూర్చి యేమనుకొందువో చెప్పిపొమ్ము.

సం:— ఎన్ని సారులని చెప్పను. నీవస్పృశ్యమూర్తివి. నీకరయుగ్మమునందు, ఝుంఝూమారుతము నందలి సంచరించు మేఘములవలె బలము పొంగి పొంగి వచ్చుటను చూచి నా మనస్సు మయూరమువలె నృత్యము సేయును.

సేవ:— రంజనుని చూచినప్పుడుకూడ నీమనస్సు నృత్యముసేయునుగదా. అట్లే

సం:— ఆవిషయము పటుండనిమ్ము నీకు తీరిక లేదు.

సేవ:— తీరిక లేకేమి ఈమాటయొక్కటి చెప్పిపొమ్ము.

సం:— ఆనృత్యముయొక్క తాళము, రాగము వేఱు. అదినీకవగాహము కాదు.

సేవ:— కాకేమి ప్రయత్నించెదను.

సం:— అన్ని సంగతులు నీకు తెలియునట్లు నేను చెప్పజాలను.

సేవ:— అప్పుడే పోవద్దు. నందినీ నాపై నీకిష్టమున్నదా!

సం:— అ ఉన్నది?

సేవ:— రంజనుని పైగూడ నట్లేనా

సం:— ఎటుతిరిగి అదేమాట ఈవిషయము నీకుచెప్పన క్కఱదు.

సేవ:— కొద్దికొద్దిగా బోధపడుచున్నది. నాకునురంజనునికినిగల భేదము నాకు తెలిసినది. నాయందు కేవలబల దర్పమే, రంజనుని యందింద్ర జాలమున్నది.

సం:— ఆ ఇంద్ర జాలమెట్టిది?

సేవ:— తెలియ చెప్పెదను వినుము. భూమిక్రింద ఘనీభూతమైన రాయి, ఇనుము, బంగారము— ఇవన్నియు ప్రబలములగు శక్తి రూపములు. పైనపచ్చ పచ్చగా తృణాంకురములు మొలచి పూలు పూయును. అదిఇంద్రజాలము. దుర్గమభూగర్భము నుండి హీరములను, మాణిక్యములను సులభముగ తేగలుగుచున్నాము. సహజముగ నంకురించుతృణాదుల నుండి ప్రాణవస్తువగు నింద్రజాలమును లాగికొనగలమా?

సం:— నీకింత బాహుళ్య మున్నది. కేవలలోభివలె నేలమాట్లాడెదవు?

సేవ:— మాకున్న దంతయు వృథాభారము.

ఎంతబంగారము ప్రోగుచేసినను ఒక్క స్పర్శమణి కానేరదు. శక్తియెంత పెంచినను యౌవనమనిపించుకొనదు. అందువలననే నిన్ను నాబంధనమునుంచుకొనుట కింతకావలి కాయవలసి వచ్చినది. రంజనునికి వలె నాకును యౌవనముండిన యెడల నిన్ను స్వేచ్ఛగా సంచరింప నిచ్చియును గూడ బంధింపగలిగి యుందును. ఈబంధన రజ్జువునకు ముడివైచుటతోనే, నాకాలమంతయు గడచి పోయినది. అహా! అన్నిటిని కట్టివేయ వచ్చును, ఒక్క ఆనందము మాత్రము కట్టుపడదు.

నం:— నిన్ను నీవే యొక మహాజాలమున బంధించు కొంటివి. ఇంక నీకలవర మెందుకో నాకు తెలియుట లేదు.

నేప:— నేను విశాలమైన యెడారిని. నీవంటి యొక చిన్న ప్రాణమునకు చేయిచాపి "నేను తప్తుడను. క్షుద్రుడను, క్లాంతుడను," అని యాక్రోశించు చున్నాను. తృష్ణదాహముచే నీ యెడారి యెన్ని ఫలవంతములగు ప్రదేశముల నాక్రమించినను, తన వైశాల్యముచే పెంపొందించు కొనును గాని, యొక్క దుర్బల బాలతృణాంకురమునందైన ప్రాణమునైనను మేల్కొల్ప జాలను.

నం:— నిన్ను చూచినవారు నీవింత గుప్తుడవని యనుకొనరు. నేనును నీ ప్రతాపమునే చూడ గలిగితిని.

నేప:— నందినీ! ఒకనాడొక దూరదేశమున నావంటిదే యొక శుష్కమైన మైదానమును చూచి యుంటివి. బయటనుండి చూడగా నా మైదానములోని సమస్త పాషాణములును లోలోపల బాధచే మూల్గుచున్నవని కనుగొనలేక పోతివి. ఒకనాటి గభీరనిశీథమున ఎవరో రాక్షసుని దుస్స్వప్నము హఠాత్తుగ భగ్నమైపోయి నట్లు భీషణధ్వని వినవాయెను. ప్రాతఃకాల మగునప్పటికి ఆ మైదానమంతయు భూకంపముచే క్రిందికి క్రుంగిపోయెను. చేతనాచేతనమగు ప్రతివస్తువు నందలి శక్తియును అసహ్యమగు తన భారముచే తానే క్రుంగిపోవును. రహస్యము నా మైదానమును చూచి తెలిసికొంటివి— నీలోపల గూడనొక యపూర్వశక్తి యున్నది. కానియది దీనికి వ్యతిరేకమైనది.

నం:— నాలో నేమున్నది?

నేప:— విశ్వవీణయందు తాండవించు ఛందోగతి నీయందున్నది.

నం:— ఏమియు నర్థము కాలేదు.

నేప:— ఆ ఛందోలీలచే విశ్వము నందలి సకలపదార్థముల భారమును తేలికయగుచున్నది. ఆ ఛందోలీలచే గ్రహనక్షత్ర గణము భిక్షుక బాలకులవలె నృత్యము సేయుచు నభోవీథులందు సంచరించుచున్నది. ఆ నాట్య ఛందమువలననే నీవింత సహజముగ, సుందరముగనున్నావు. నందినీ! నీవు నా లెక్కలో నింతచిన్నదాన వైనను నీపై నాకీర్ష్య.

నం:— అందఱిలోనుండి త్రెంచుకొనిపోయి ప్రత్యేకముగ నుండుటవలన వంచితుడవైతివి. ఎల్లరతో కలిసిమెలసి యేల వర్తింపరాదు?

నేప:— నాయంత నేనగుప్తము గానుండి విశ్వము నందలి పెద్దపెద్ద ధనాగారముల నుండి గొప్ప గొప్ప వస్తువులను దొంగిలించుటకే ప్రయత్నించు చున్నాను. కాని, విధాత గుప్పిటనుండి స్వయముగా స్వీకరింప వలసిన దానము, సంపంగి మొగ్గలవంటి నీ వ్రేళ్లందుకొనగలుగును గాని, నా ప్రతాపమంతయు ప్రయోగించినను చాలదు. ఆ విధాతృ బద్ధముష్టి బలవంతముగ తెఱువలేదని నా ప్రయత్నము.

నం:— ఈ మాటలేమో నాకర్థమగుటలేదు. నేపోయి వచ్చెదను.

నేప:— సరేపొమ్ము. ఈయల్లిక కావలగా నాచేయి జాపుచున్నాను. నీ కరపల్లవ మొకసారి దానిని స్పృశింప నిమ్ము.

నం:— అంతయు వదలి పెట్టి హఠాత్తుగా నీచేయి మాత్ర మొక్కటి బైటికి వచ్చిన నాకు భయము వేయును.

నేప:— ఒక్క చేయి మాత్రమిచ్చితి నవికదా వదలి పెట్టి వెళ్లుచున్నావు. అంతయు నిచ్చిన యెడల నన్ను గ్రహింతువా, నందినీ!

వం:— అసలు నన్ను ఇంటిలోనికే రానీయ వైతివి. నాతో నీమాట లెందుకు?

నిప;— ఏనాడు తెరచాపలలో గాలిపోసుకొని యనాయాసముగా నా యొద్దకు రాగల్గుదువో అదే నిరాకరు శుభముహూర్తము. ఆగాలి ఈశ్వరేచ్ఛచే తుఫానుగాలి యైనను మంచిదే. అయితే ఆసమయ మింకను రాలేదు.

వం:— అతఁడెచ్చటికివచ్చిన నచ్చటికి శాంతిప్రదమగు విరామము తనంత తానే వచ్చును.

నిప— నిరంజనుడు తన విరామపాత్రికను ఎఱ్ఱగన్నేరు పూలతేనెతో నింపి కొనుచుండునని నేనెఱుగనా! వందిసి నాకునూత్రి మీరిక్త పాత్రమునిచ్చినచో మధురసోక్కడమండినచ్చును.

వం:— ఇక నేన పోయివచ్చెదను.

నిప:— నేనడిగిన ప్రశ్నకు సమాధానమిచ్చి వెళ్లుము.

వం;— విరామము మధువుచే నెట్లు మధుర మగునో రంజనుని కన్నులార గాంచిన తెలియగలదు. అతడతిలోక సుందరుడు.

నిప;— సుందరుని సమాధానము సుందరునికే సుబోధమగును. ఆసుందరుడనగు నేను సమాధానము నొకవేళ బలవంతముగ సంపాదించినయెడల వీణ మ్రోగదు. తీగలు మాత్రము తెగిపోవును. ఇక సంగతు లెవ్వియును లేక వెడలిపొమ్ము లేకున్న విపత్తు సంఘటిల్లును.

వం— పోయెదను. ఈమాటయొక్కటి చెప్పిపోయెదను. నిరంజను డీనాడు వచ్చును, మునుమాటికి వచ్చును, అతని నాపుటకెవ్వరికిని తరముకాదు.

(నిష్క్రమించును)





# స్వార్థపరునితో.



(తెలికిచెర్ల కృష్ణమూర్తిగారు బి. యే.)

స్వార్థమునె నమ్మి మూర్ఖుడ వగు మనుజుల
పాపసమ్మగ్న దుర్భాగ్య భావహీన
తాపమున కోర్వలేక సంతతము గుంది
జీవనమె కష్టమంచు దూషింతువేల?
ఓ విమోహాంధ! యిక చెలివొంది విమల
శాంతజీవన మొంది నాసంతు వేని
స్వార్థకల్పిత భారంబు పారవైచి
పులకింపుము నారహాస్యముల నెల్ల
దుఃఖమెఱుగని పరమ సంతోషమునను
గాన మొనరింతు జీవన గాథ లెల్ల;
దాస్య శృంఖల కలుష బంధములు వడక
స్వేచ్ఛ జరియింతు భావనాక్షీణశక్తి.
ప్రకృతియే నాదు ప్రియ బాంధవంబు, సర్వ
జీవ సంఘంబులే నాదు చెలిమి కాండ్రు;
ప్రేమబంధనమే మహా స్వేచ్ఛ నాకు,
[illegible]షంత తానంద దాయి.

విహగ మట్టుల నాకాశ వీధియందు
నొంటిగా బోయి పాడుదు నొక్కమారు;
కుసుమ కిసలయముల తోడ గోర్కి మీర
బాసలాసరింప దిరుగుదు బవనమట్లు
జీవన ప్రపంచ మోహన శృతికి మేళ
గించి పాడుదు ప్రేమ సంగీతములను;
ఒడుపులిడు నలలపై లేచిపడుచు శీక
రంపు ముత్తెపుసరుల హారముగ దాల్తు.
స్వేచ్ఛమై పర్వులిడు భావ వీచికలను
దేలియాడెను గవనంపు పూలతెప్ప
నధివసించి దిగంత విహారములను
సల్పుదును మాధురీ రసాస్వాది నగుచు.
పావన ప్రేమ పూర్ణమౌ జీవితంపు
సౌఖ్యము లెఱింగి, నావలె సహజమధుర
గాన లహరిని నెమ్మను లీవమంద
బాడుకొనుమోయి! నిర్మల ప్రణయగీతి!



# "అవ్వాఁడే నన్నుఁ జల్లగాన పుడరయున్"

(కవికొండల వెంకట రావుగారు బి.ఏ. బియల్.)

నేరేడుపండు కంటెను కాటుకనలుపు మేనఁ బాడఁగల ధాతగిరి
ద్వారఫుబూజారి యనఁ జెల్వారెడు తలవెంట్రుకలగుమి గౌదల మెఱయన్.

నూఱేండ్లముదుక యొత్తుక కారాకుంబోలి చితికి కాళ్లాడక్కైదై
కూరిమి కొడుకు బుజాలన్ దీరుగఁ గూర్చుండి తీర్థదృష్టిని జనుచున్.

అన్నా! అంతర్వేదికి- తెన్నది ? వేది వీధి తిరుగుచు జనముల్
గన్నుల బండువ బోవుచు నున్నా రావైపుననుచు నూఱక వానిన్

తొందఱ పెట్టుచు సంద్రముసంగమ సన్నిధిని నుంచి యంతర్వేది
స్యందన మహోత్సవంబులఁ గన్నెగన బెఱుతో ఆలయమందున్

సుందర నృసింహ విగ్రహముం దగఁ జూపింతో యనుచు మొగమును నెత్తెన్
కందగ [illegible] ఎ సుద్దుడు టికయి ముసలతలేయగు పించెన్

"అవ్వా! తొక్కిళ్ళు పడెదటు ఇవ్వేళను జూతువేమొ ఎల్లిన్నృతపుగా
నెవ్విధిసామిని గనె"దన "అవ్వాఁడేన్ను జల్లగానపుడరయున్"

అనుచున్ దనదను చూపుల కొనలను గోదావరి పయికొండొక దవ్వై
చనుతొట్టి పడవచావలఁ దనికెడు తెలికాంతిఁ బఱపె తన్మయురాలై.



# మతపిచ్చి.



( కే. రామచంద్రారెడ్డిగారు. )

---

దేవుడు వచ్చుచున్నాడను వార్తపుర మందంతటను వ్యాపించెను. ఇక హడావుడి కేమితక్కువ? దేవుని దలచుకొనిన కాని పనియేమున్నది? ఎక్కడ చూచిన దేవుని విషయమగు ప్రసంగమే; పూజించు ప్రయత్నమే. దరిద్రులు తమదారిద్ర్యము తొలగు ననియు ధనికులు తమపెట్టెలు పూర్తిగ నిండుననియు సంతసింపుచుండిరి. దొంగలిక జైలుబాధ దప్పునను కొనుచుండిరి. ఇంతయేల? ఆనగర వాసులెల్లరు వివిధ కల్పనల స్వప్న రాజ్యమున తాండవంబాడు చుండిరనుట యతిశయోక్తి కాదు.

పానశములో పుడకినులోలి యొక్క విషయమునుగూర్చి తర్కవితర్కములు ప్రారంభమాయెను. "సాగరము మీద నుండి దేవుడువచ్చును." కావునసాగరమందిరమందే పూజింప వలయునని కొందరను చుండిరి.

మరి కొందరు. "కాదు– కాదు– దేవుడు సాగరము మీదనుండి రాడు– భూభాగము నుండియే వచ్చును. కావున పురమందిర మందు పూజింప వలయును" అని పట్టు పట్టిరి.

తర్కము మిన్నుముట్టెను. పరుష వాక్యములు పెచ్చు పెరిగెను. సాగరికులకును నాగరికులకును ముష్టియుద్ధము ప్రారంభమాయెను. సాగరమందిర పురోహితునకును నగర మందిర పురోహితునకును దెబ్బలాట జరిగెను.

* * * *

పట్టణమందంతట భీషణవిప్లవము ప్రారంభమాయెను. నగరమందిర పురోహితుడు పురవాసుల బిలచి యిట్లనియె. సాగరికదళము దేవుని పారద్రోల వలయునని ప్రయత్నింపుచున్నారు. సాగరముమీద నుండి దేవుడు వచ్చునను మాట కల్ల; భ్రమ. కావున సాగరికులను పారద్రోల వలయును. ముమ్ముందు సాగరమందిర నాయకుని కడ తేర్చవలయును.

ఒకడు:— మీరు చెప్పినమాట బాగున్నది. కాని యాపురోహితుడు బలశాలి. ఉపాయశాలి. వానిదళమున మంచి బలవంతులగు వస్తాదులున్నారు. మార్గమేమి? వారితో పోట్లాడుటకు మాకుశక్తి చాలదు.

పురోహితుడు:— పిచ్చి మాటలు. మనలో మాత్రము సామాన్యులున్నారా? ఒక్కపట్టున వారిని ముట్టడించిన నలిపి పారవేయవచ్చును.

ఒకడు= ఒక్కపట్టున పనిచేయుటకు కొంత కాలము బట్టును. కాని దేవుని సుముహూర్తముననే బూజింప వలయునుగదా! లగ్నము మించిన తర్వాత ప్రయోజనమేమి?

పురోహితుడు= నీకేందుకా గొడవ. అన్నియు సంసిద్ధముగ నున్నవి. కాబట్టి యొక్కపట్టున మీరు వారి నాక్రమించని యెడల మా ప్రయత్న మంతయు భంగమగును. వారు మనను దేవుని పూజింప నీయరు. మన ప్రయత్న మంతయు బూడిదలో బోసిన పన్నీరు తుల్యమగును. ఆలోచన యెందుకు? నడవండి. నాగరికులను బంధించి పురోహితుని కడతేర్చుట తప్ప గత్యంతరము లేదు.

పురోహితుని యజ్ఞానుసారము నాగరికులు బయలుదేరిరి. కేకలు బొబ్బలతోడ సాగరమందిరము నాక్రమించిరి.

సాగరమందిర పురోహితుడు దేవునకు పూజాద్రవ్యముల సంసిద్ధ మొనర్చుచుండెను. ఆకస్మికముగ మందిరము నశత్రువులాక్రమించుటవలన నడుము బిగించి కత్తులు కటార్లు గైకొని రెండువేల మంది వస్తాదులతో యుద్ధమున కుపక్రమించెను. యుద్ధము తీవ్రమాయెను. రక్తము ప్రవహింప జొచ్చెను. అప్పుడు సాగరికులు వెనుకకు మరలి మందిరములోని కేగి తలుపు బిగించి కొనిరి.

* * * *

నగర పురోహితుడు దూరమందుండి యిట్లనియె, "ఏమిది? మహాపాతకము? మహాపరాధము? చూచితిరా? గోమాంసమును సిద్ధముచేయు చున్నారు- దేవునకు నైవేద్యము బెట్టుటకు గోమాంస మా? కలికాల మహిమ? నైవేద్యము పెట్టుటకు గోమాంసమా? ఇంత కంటె యన్యాయమేమున్నది?— మహాపాతకమేముండును!

ఈమాటల వలన నాగరికులు మైమరచెను మండిపడెను. సాగరమందిర ప్రహారీల నెక్కిరి. కొందరు తలుపులు బద్దలు కొట్టుచుండిరి.

సాగరమందిర పురోహితుడు స్వసైనికుల చూచి యిట్లనియె. జాగ్రత. వెనుదీయరాదు. మీరు వెనుదీసిన యెడల దేవునకు పూజ జరుగదు. దేవుడురాడు. నగరదళము చేయుపనిని గమనించితిరా! వీరి ముఖము చూచిన దేవుడురాడు. వెనుకకు మరలును పూజ జరుగదు. జాగ్రత్త.

ఈ మాటలవలన సాగరులకు పిచ్చియెక్కినటులాయెను. ప్రహారీల నెక్కిరి. దానిమీద కెక్కుటకు బ్రయత్నించు నాగరికుల నెట్టిరి. గోడలమీదనుండి పెద్ద పెద్ద నాప బండల విసరి నాగరికుల మీదవేయుచుండిరి. సాగరిక నియోజ్యపతిపత్యమున నొక పాఠశాలయుండెను. నాగరికుల పిల్లలు దానిని బహిష్కరించిరి. నాగరికుల కొక వస్త్రములు నేయు కారఖానా యుండెను. దానియందు పనిచేయు సాగరికులు కలాయున మొనర్చిరి. సాగరికుల కార్ఖానాలకు నాగరికులు నిప్పుపెట్టి తగులబెట్టిరి. నాగరికుల పంట భూములను సాగరులు ధ్వంసము జేసిరి. అందువలన వ్యవసాయమాగిపోయెను. కార్ఖానాలు కట్టుబడెను. పాఠశాలలు పాడుపడెను.

యుద్ధము తీవ్రముగ జరుగుచునే యుండెను. నాగరికులు సాగరికుల మందిర శిఖరముల బడగొట్టిరి. అప్పుడు నాగరికులకు గలిగిన సంతోషమునకు మేర యెక్కడ? మహోత్సవముల సల్పి తమతమ వేలుపుల నగరమందిరమున జేరి భుజించి యానందింపుచు పాటలు పాడ జొచ్చిరి; నృత్యము సల్పిరి.

* * * *

దేవుడేడి? లగ్నము మించెను — దేవుడు రాలేదు. లగ్నము మించెను విఘ్నము గూర్చుచున్నవాడెవ్వడు? యుద్ధము నడచుచుండెను

నగరపురోహితు డొకదినమున "నాకు జయము గలిగినది. సాగరమందిరము వశము కాలేదు. అయినను? జయము గలిగినది", అని దలంపుచు మందిరమున గిరుగుచుండెను. కాని సాగరమందిరము చాలవరకు భగ్నమై పోయెను.

పురోహితుడు దిట్టనియె విజయోత్సవ కార్యక్రమమును.

కాని దానికి ప్రత్యుత్తర మిచ్చువారెవ్వరు?

కొంత వడికి పురోహితుడు నక్కడ యెవ్వరులేరని తెలిసికొనెను.

అప్పుడాతడు బయలుదేరి గబగబ నగరమును బ్రవేశించెను. విజయోత్సవ మొనర్చుటకు పురమంతయు దిరిగెను. ప్రతిగడప ద్రొక్కి చూచెను. కాని విజయోత్సవ మొనర్చుటకు మనుష్యులెక్కడ? కొందరికి కాళ్లు చేతులు విరిగి మూలపడి యుండిరి. మరి కొందరు తిండిలేక మాడుచుండిరి. కొన్ని గృహములు పాడుబడి యుండెను. మరికొన్ని నేల మట్టమాయెను.

అతడు తిరిగి నగరమందిరమును బ్రవేశించెను బ్రతికి యున్నవారి కన్నవస్త్రముల నీయదలంచెను. భాండారము తలుపులు దీసిచూచెను. కాని దాని యందేమి మున్నది? శూన్యము.

పూజయొనర్ప మందిరమున కేగెను. అచ్చట పూజాపరి యగ్నము లేమున్నవి? అప్పుడాతనికి హఠాత్తుగ దేవుని విషయము దలంపునకు వచ్చెను. కానిపూజాద్రవ్యములేవి? పుష్పహారము లెచ్చట?

కాని దేవుడు వచ్చు లగ్నము దాటెనని యప్పుడాతడు గ్రహించెను.

అతడు నిరుత్సాహమున మునిగి కొంత వడికి తెప్పిరిల్లి హతాశుడై యరణ్యమున కేగెను. సాగరమందిరమును ముట్టడించిన నాగరికులెల్లను పోయినంతనే వారిలో మిగిలిన వారెల్లరు సాగరమార్గమున బయలుదేరి తమతమ దేశములకేగిరి. పురోహితుడు బిలిచిన పలుకు వారెవ్వరు? దేవుని యర్చించుటకు సిద్ధపడిన నరుడులేడు? పూజ్యము. అందువలన పురోహితుడు నెత్తిన చేయిపెట్టుకొని కూలబడెను. అప్పుడాతని కాకస్మికముగ దేవుడు వచ్చువేళ మించెనని స్మరణకు వచ్చెను. వెంటనే యాతడు సిగ్గున దలవంచుకొని యరణ్యముల కేగెను.

* * * *

నగరమునకు వెలుపల పడిపోవుచున్న కుటీరమం దాతని నివాసము. అతడు దరిద్రుడు. దీనుడు. రెండుపూటల నగరమున కేగి బిచ్చమెత్తుకొని జీవింపుచుండెను. ఆతని పేరు దీనదాసు.

బిచ్చము పెట్టువారెవ్వరు? దీనుని మోముచూచుటకే యసహ్యముగదా! ఈతడు పట్టణమునకు ప్రక్కనుండు గజాలక నోపనము చేయుచు "నా కడుపు మంట చల్లార్చుము- మీ గృహములు రత్నములతో నిండు" ననుచుండెను. ఈమాటలకు కొందరు నవ్వుచుండిరి. మరియు నాతడిట్లనుచుండెను. "నా కన్నీరు కట్టుబడునట్లు చూడుము. అప్పుడు నేను నవ్వుదును. నా నవ్వుతోడ ముత్యముల వర్షము గురియును."

కాని యా బీదవాని కడుపు మంటను చల్లార్చువారెవ్వరు? కన్నీరు కట్టుబడు టెట్లు?

ఈతడుండునది జీర్ణకుటీరము. సూర్య చంద్రులందు తొంగిచూచుచుండిరి. దానికి తలుపులేదు- అందు పెట్టెలు లేవు- తాళము చెవులెందుకు? ఆ కుటీరము ధనికుల సౌధములకు- దేవమందిరములకు- నృత్యశాలలకు పరిమోదోద్యానవనములకు దూరము- మిక్కిలి దూరమున చింపిరియై యున్నది. అతడందు నిరంతరము ముకుళితపుఖ భగవానుని దలంచుచు కాలము గడుపుచుండె.

* * * *

గొప్ప ముసురుపట్టెను. ఆ ముసురున దగుల్కొని నాగగిరి పురోహితుండు ఆశ్రయము కొరకు తిరుగుచు దీనదాసుని కుటీరమున జొచ్చెను. దీనదాసు కృతార్థుడనని దలచుచు నాతని కాశ్రయమిచ్చి, చినిగిన కంబళిని పరచి కూర్చుండబెట్టెను. దాని మీద కూర్చుని పురోహితుడు కొంతసేపటికి మోము నుగ్రపడ పండ్లు కొరుకుచు నిట్లనియె. 'దొంగా! కంబళి మీదనా నన్ను గూర్చుండపెట్టుట-' అనుచుండ దీనదాసు తలవంచుకొనెను.

పురోహితుడు:- వెళ్లు - ఇటనుండి వెళ్లు. నేను జపము నర్చుకొనవలయును. నీ వేగిన యెడల నా మంత్రములకు మైలతగులును.

దీనదాసు కుటీరమును వీడి వెలుపలకు వచ్చి నిశ్శబ్దముగ నిలుచుండి వర్షములో తడియుచుండెను.

సాగరక పురోహితుడు కూడ తిరిగి తిరిగి యా కుటీరమునకే వచ్చెను. దీనదాసు నపరిచితభావమున వానిని కుటీరములోని కాహ్వానింపగా నాత డిట్లనియె! "అరే- నీప్రక్కనుండి నేనెట్లు కుటీరములోనికి బోదును? నీగాలి సోకిన నాకు సోతసోపఘ్నమగును. కొంచెము దూరమేగుము. నేను కుటీరమును బ్రవేశింతును.

దీనదాసు తలవంచుకొని కుటీరమునకు కొంతదూరమేగి చెట్టుక్రింద నిలచెను. గాలి వాన విపరీతముగ నుండెను. అందు వలన చెట్టు విరిగి పడునేమోయను భయము వలన చెట్టులేనిచోట గాలివాన దెబ్బకు తలక్రిందులై నిలుచుండి యుండెను- సాగరపురోహితుడు కుటీరమును బ్రవేశించెను.

* * * *

కుటీరమందు పురోహితుల కిరువురకు మల్లయుద్ధము ప్రారంభమాయెను. ఇంతలో దీనదాసు ద్వారము కడకువచ్చి తొంగిచూడ ఇద్వరు పురోహితులు నేత్రముల నగ్నికణములుగురియునట్లనిరి. "అరే-పాతకీ-దుర్మార్గుడా! నీవలన మాధర్మమునకు హాని గలిగినది. నీపైనుండి వచ్చినగాలి మమ్ము సోకుట వలన మేము పాపులమైతిమి. ఇంత మదమా? అహంకారమా?" అని యనుచు ఘో

గదండముల వానిని చావమోదిరి. దీనదాసుని రక్తము గ్రక్కబడిపోయెను. ప్రాణమును విడచునప్పుడు దీనదాసు డుదాత్తస్వరమున "పురోహితుడా!" అనియరచెను.

పురోహితులశరీరము గగుర్పొడిచెను. చూచుచుండగనే దివ్యదేహమున దీనదాసు వారికెదుట నిలచెను. ఇరువురు సాష్టాంగపడి యేసుని 'దేవా' అని యరచిరి.

దేవుడిట్లనియె. "నాకు సంసిద్ధపరచినపూజాద్రవ్యములేవి? పుష్పహారము లెచ్చట?" ఇరువురు తలవంచుకొని నిలుచుండిరి. కొంతవడికి సాగరపురోహితుడిట్లనియె. "ప్రభో మీరు సాగర పథమున వచ్చెదరని దలంచి యెదురు చూచుచుంటిని." నగర పురోహితు డిట్లనియె. నగరమందిరమున మీకొరకు వేచియుంటిని.

దేవుడు నవ్వుచు నిట్లనియె. నేను సాగరమందిరమునకు వెళ్ళితిని గరమందిరమును ప్రవేశించితి. నన్ను చూచినవారలే లేరు.

సాగ:— లగ్నము దాటినను గూడ మీకొరకు నిరీక్షించుచుంటిని.

నాగ:— మీకభివందన మొనర్చుటకు వేచియుంటిని.

నవ్వుచు దేవుడంతర్ధాన మాయెను. పురోహితులిరువురు పరస్పర ముఖరమోము కదు చూచుకొనుచు తెల్లబోయిరి.



# కోకిలా కాకము.

(చిర్రావూరి కామేశ్వరరావుగారు.)

## ద్వితీయ వీచిక.

తనకూఁతుఁ గుంతలేశునకుఁ బెండ్లిసేసి
దివ్య భోగంబులఁ దేలించుచుంచు,
లావణ్య తిలకపైఁ గసితీరనంచు,
రాపత్ని యుత్కంఠ దీపించుచుండె
కాని భైరవి విన్నఁదనమొంది మగుడి,
యరుదేర, కారణం బూహింపలేక,

"ఓకూతురా! నీ విభుండేలరాడు?
నీముద్దు మోమేమిటికి చిన్నవోయె?"
అనుచు నుత్తలపాటు మదిహత్తికొనఁగ,
చిన్నికూతును గాఁగిటం జేర్చుకొనియె.

తరువాత భైరవి తనతల్లితోడ
వృత్తాంత మాద్యంత మెఱిఁగించి, మఱియు
"ఓయమ్మ! నాయందు దయయుంటె నేని,
కోకిలా లావణ్య తిలక యెన్నఁడును
ఈజన్మమున నెందుఁ గలియకుండఁగను,
ఒనరింపు మిదితల్లి! నా ప్రార్థనంబు!"

అనవుడు రాపత్ని కన్నీరు విడచి
"బాలికా! నీమేలు నామేలుకాదె?
నామేననూపిరి యాడునందాక
నీకాపురము నిల్వబెట్ట యత్నింతు!"

అనినాటి సాయంత్రమున కూతుఁగోడ,
కారాగృహా వాస మనస్సుకుదాని,
ధూళి ధూసర కేశములు గల్గుదాని,
మలిన వస్త్రాచ్ఛాదనము గల్గుదాని,
కుంతలాధిపు నామ్న జపియించుదాని,
లావణ్య తిలకను వీక్షింపఁబోయె!

రాపత్ని కర్ణకఠోర వాక్యముల,
లావణ్యతోడ నిట్లాడ గాదొడఁగె
"ఓసిదుర్మతి! కుంతల విభుండునేఁడు
ఎల్లలోకములు నాగా వినుతి సేయగను
నాబిడ్డను వరించి యొసఁగె నుంగరము!
దీనిఁజూడుము నమ్మకము లేక యున్న!"
అని రాజ ముద్రిత యుంగరంబు యొకటి
జూపి క్రోధముతోడ నచ్చోటు బాసె!

మిన్ను విఱిగి పైఁబడి నట్లాదోఁప
లావణ్యతిలక హా! యని మూర్ఛనొంది
కొంతసేపటికిఁ దెప్పరిల్లికొని తెల్విలేచి
"హాకుంతలాధిపా! మఱచిపోయితివ?
నీప్రేమగలదాన నని పొంగిపోయి
ఎన్నికష్టాలైన నోడిపట్టినాడు!
తొలిపుట్టువున నెట్టి కర్మచేసితిని
నాపాప ఫలమిట్లు నన్నే చెనకుడు!"
అని బాష్పములు రాల లావణ్యతిలక.
ఘనశోకమునఁదోఁగి కృశియింపఁదొడఁగె!

ఆనాఁటి నిశ్శబ్ద గంభీర రాత్రి
సమయంబునందు కోకిల యేగుదెంచి
రాజపుత్రి వసియించు మేడ లోపలికి
అద్దాలు విఱిగిన వాతాయనంబు
గడచి రివ్వునఁబోయి రాజపుత్రికేల
సుస్నేహ పూర్వకంబుగఁ గూరుచుండె!

దాని చక్కఁదనంబు, సన్మైత్రివిధము
కనులారఁగనుఁగొని లావణ్యతిలక,
యానంద సాగరమున నోలలాడి
చిగురుచేతుల దాని మృదువైన మేను
నిమిరి వక్కునఁ జేర్చి, ముద్దాడి ముకిసి
"ఓ కోకిలా! పుణ్యముల పంట నీవు!"
గాఢ దుఃఖాంధకార సుధామరీచి
నాయింటమీఁదవై వసియింపు మిపుడు!
అని యకారణ స్నేహమునఁ బల్కి యామె
ఆరముగ్గినపండ్లు, తేట తేనియలు
కడుపార దినబెట్టి కడుపారఁ దాను
దినినట్లు సంతృప్తి సంతోషమొందె

ఆపక్షి రాజపుత్రివైపు వీక్షించి
పలికె మనుష్య భాషణముల నిట్లు
"ఓ మనోహర గాత్రి! లావణ్యతిలక
నీ సమాగమ భాగ్యమబ్బుటం జేసి,
నా జీవనపథంబు మునిఁగె వెన్నెలల
నిరుపమానందంబు చేకూరె నాకు!
ఎఱుఁగుదువుకదా, కుంతలాధిపుని?
చండికా శాపమున నిట్టులైతి!—

అని బాష్పపూరంబు దొరఁగ పెల్లేడ్చి,
కోకిల మఱల నిట్లనియె శోకమున
"ఓ మహా రాజపుత్రి! బ్రహ్మవ్రాత
తప్పింపఁగా నెవ్వని తరంబుగాదు!
సవతి చెల్లెలు భైరవి కపటమెంచి
నాముద్దుటుంగరమును దొంగిలించె
కటకటా! నీమీఁద ప్రేమ హేతువున
ఎఱుఁగనైతిని మోస కృత్యంబు నేను!"
అని భైరవినిఁ గూర్చి వృత్తాంతమెల్ల
ఎఱిఁగించి నాఁడాదిగా నామెఁ గూడి
అనురాగలత యల్లిబిల్లిగా బెరుఁగ
రాత్రులందున వచ్చి రేయెల్ల గడిపి
నిర్మల ప్రాభాత వేళ నెవ్వరికిఁ
దెలియరానట్టుగా నెగసి దవ్వేగు

క్రమముగా లావణ్యతిలక సోయగము
నభివృద్ధి వడసి కన్నుల విందుగొలిపె!

రాపత్ని యొకనాఁడు తనకూఁతుతోడ
లావణ్యతిలక మందిర సీమకేగి
దరహాస వదనారవిందంబుతోడ
గ్రంథావలోకనం బొనరించు దాని,
నవయౌవనోన్మీలనముఁ గల్గుదాని
లావణ్యతిలకను గన్నారఁగాంచి
యాశ్చర్యభరితాత్మయై యిట్టులనియె:—
"ఓసి స్వైరిణీ! చాలు నీమాయలింక!
వన్నెకెక్కిన రాజకులమందు బుట్టి
యిట్లు వర్తింతురే మాన్యగోత్రలైన?
నీ తండ్రితోఁ జెప్పి శిక్షింతు నిన్ను
కులకళంకిని! నిన్నుఁ జూడ పాపంబు!"

అని కషాయిత నేత్రముల నిప్పులురల
భైరవీయుతముగా నచ్చోటు వాసి,
కొండెంబులను పల్కి కల్పించి కతలు
ముసలిరాజును చిక్కమున వేసికొనియె!

ఆనాఁటి నుండియు లావణ్యతిలక
పడ్డ యిక్కట్టు లాదైవంబెఱుఁగు!
తఱచయ్యె నుపవాసములు ప్రేమవతికి!
జీర్ణ చేలంబులు కలవాయెనకట!
ఆగర్భ శ్రీమంతుఁడగు రాజుబిడ్డ

కటకటా! సైరంధ్రివలె నుండవలసె!

కోకిల యొకనాటి నడిరేయిదాక
యెందేగెనోగాని యగుపించలేదుం
రాపుత్త్రి పలురీతుల భయంబువడసి
శబరులు విషసాయక ప్రయోగమున
నేసిరో నాముద్దు కోకిలామణిని ?
దానిని నాకంట నెవరు పెట్టెదరు?"
అని దుఃఖతాత్మయై భయమొంది యామె
అద్దాల కిటికీలు తెరచు వేమారు
శబ్దలేశముపిన్న నా దిక్కు జూచు
నిట్టూర్పు వెడలించు, కన్నీరునించు
"కోకిలా! కోకిలా! యనుప్రేమగదుర
హృదయ కల్లోలిని శాంతింపబిలచు!

కొంతసేపటికి కోకిల యేగుదెంచి
రాపుత్త్రి మృదుహస్తమున వ్రాలిసోలి
మిలమిలముక్కున వెలుగొందుచున్న
రత్నహారమునామె కంఠానవిడిచి
"ఓమనోహారి! నన్ను క్షమియింపవలయు
దూరభూములకేగి మగుడి వచ్చితిని
తెక్కలు తెగినట్లు దోచెనియ్యోను
సుఖమున్న దానవే సుఖముగానుంగి
అనవుడు రాపుత్త్రి యాశ్చర్య పడుచు
"ఓమనోహర ఇంతయాయాసమునకు
గతమేమి ఈరత్నహార మెచ్చటిది
దూరభూములకేల నీవేగినావు"
అనకోకి లాపరంబనియె "నోయబల
వణిజోపహార మీరత్న హారంబు
నారాజ్యమున కేగి శుద్ధాంతవీథి
క్రీడాగృహంబున మంజూషమందుం
గలరత్నహారంబు గొనివచ్చినాను
నీకంఠమున వేయ పోయిగాందోచ"
అనితెల్లగా దెల్లవారునంతాక

సల్లాప సౌఖ్యంబు వనుదేలియాడి
పోలేక యెట్టులో నచ్చోటబాసె
ఎడబాటు ప్రణయంబు నకుశాపమకట.

మఱునాటియుదయాన రాపత్ని వచ్చి
లావణ్య తిలకను నిలువెల్లజూచి,
"ఇన్ని పాట్లనుబెట్టి యింతచేసినను,
చిక్కదు, స్రుక్కదు, వేడదెవ్వరిని,
ఇంతకంటెను వింత భువిలోనంగలదె?"

అని రత్నహారంబుదిలకించి, యామె
కోపంబుదీపింపం బరుషోక్తులాడి,

"ఓ కల్లలాడిరో! ఈ వేషమేమి?
మగనిదాచెను జాణ తనమోపులబ్బె?
నీ పీచమడగింతు నెవ్వరడ్డదరో!"

అని కఠోరంబుగ బల్కియాజంత
పోయి భూవిభుతోడ వచియించెనంత.

లావణ్యతిలక యెంతటి జాణయయ్యో!
నా కులోన్నతిపౌరుష మెంచదయ్యో!
అభిమాన మానంతయునులేక యిట్లు,
ఒనరింపం దనకెట్లు మనసొప్పెనకట!
అని కోపమునరాజు నాపత్నిమాట
నమ్మిరోషావేశమునపలుకుచుండె!

లావణ్యతిలక యెవ్వానితోడగూడి,
ప్రణయ ప్రవాహంబునను దేలియాడి,
గడుపుచున్నదొ రాత్రులను సంశయించి,
రాపత్ని యొకనాటి మధ్యాహ్నమందు,
నగరిలోపలి బాలికనుబిల్చి యనియె;

"పరిచారికా! నీవు నేం జెప్పినటులు
జేయగావలయుం దప్పిన శిక్ష జేతు,
నేడాదిగానీవు లావణ్యతిలక
వసియించు కారాగృహంబు చెంగటను
కాపుండి, రాత్రివేళల నిదురపోక,

ఎట్టి వింతలుజూతువో జ్ఞప్తిపెట్టి,
తెలియఁగింపుమా! నీకు బహుమానమిత్తు!"

అనవుడు నాబాల యట్టులేయనుచు,
మెల్లగా లావణ్య తిలకసన్నిధికి,
బోయి నమ్రతదోప నెన్నియోపలికి
"ఓయమ్మ! నీ దాసిగా నుండుదాన,
నీవేమిపంచిన నొనరింతు"ననుచు,
కపటోక్తులనుబల్కి కాపుండెనచట!

ఆరాత్రిలావణ్య తిలక సత్వరమ
కార్యంబులనుదీర్చి, యా దాసితోడ,
"బాలికా! నీవింక నిద్రింపఁబొమ్ము!"
అనిపల్కి తలుపు దగ్గఱకువేసి లోన
శయనించి సుస్వరం బెడలించిపాడె;
"తొగరు చంచుపుటంబు లమృతంబు జిలుక,
తెక్కలల్లార్పున ముత్యాలు గురియ,
మురిపెంపుచూఁపుల గానంబువెడల,
పల్కు పల్కునరాలు కరగిపోవంగ,
కోకిలా! నాప్రేమ ప్రాలంగరమ్ము!"

వెలుపలమెట్కున శయనించియున్న
దాసియా యపూర్వ మాధుర్యస్వరము,
వినిలేచి మెలమెల్లగా ప్రాకుకొనుచు,
తలుపు దగ్గఱసల్చి, యాలించఁదొడఁగె;

ప్రేమ వారాసిలోపల మునిగిపోయి,
లావణ్యతిలక యా దాసిసంగతిని
మఱచిపోయెను! అంధురాలయ్యెనకట!

ఆపాటగాలిలో దేలి యావలకుఁ
బోయి కోకిలనెత్తుకొని వచ్చెనపుడు!

లావణ్యతిలక ప్రేమాబద్ధయగుచు,
కోకిలావరముతో రేయెల్లగడపె.

మఱునాటియుదయాన రాపత్ని కడకుఁ
బోయి యాదాసిసంతస మాత్మఁబొరల,
మాట జాణతనంబు మెఱుగెక్కనటులు,
ఎఱిఁగించె రాపుత్రి వృత్తాంతమెల్ల!

రాపత్ని పటురోషమున మండిపడుచు,
"భైరవీ! మనకొంప మునిగెనియ్యెడను,
మనలసాధించె నా దుష్టురాలు!
దానిసుఖమును మనము జూడఁగలమె!

అని యా నిశీథమునందుఁ గింకరులఁ
బిలిచి, సొమ్ములొసంగి, వినుతించి యనియె;

"మాల మాదిగలార! మీ రేగియిపుడు,
లావణ్యతిలక మందిర సీమకెదుట,
గలరావిచెట్టు కొమ్మల నెల్లయెడల
వాడికత్తులుగట్టి రాండు దూరంబు?"

కాలకింకరులవలె నడచివారు,
రాపత్నియాజ్ఞను నెరవేర్చినారు!

ఆరాత్రి కోకిల తొలిరేయియట్ల,
అరుదెంచి రావిచెట్టున వ్రాలునపుడు,
కటకటా! లేఁతతామర తూండ్లవోని,
కాళ్లు రక్తముఁజిమ్మె! మృదువైనమేను
నఱుకుకొని విశేషముగ సోలిపోయె!
రవడి పలిటిం గ్రిందికేతెంచి,
రక్తసిక్తాంగంబు గదలింపలేక,
కొంతసేపటికి లేచి బలంబువడసి,

"ఎవరైన నన్నుబట్టి బంధింతురేని,
రాపత్ని వెంటనే నను జంపకున్న?"
నా ప్రాణముఁహరింప లావణ్యతిలక,
ఎట్టి కష్టములొంది యేమౌనో యనుచు,
మెల్ల మెల్లనసాగి యెగిరియాగునను,
పరిసరారణ్య స్థలాంతమందు
ఆకు పచ్చనిపసుల తృణాంకురములు
సాంద్రంబులై మనోమోదంబుగొలుప,

ఉన్మత్త పూవులు గఱిక పూవులును,
అరుణంబులగు రత్న పుష్ప పుష్పములు

అల్లిబిల్లిగ నల్లుకొని ప్రాకులతలు,
గలిగిశోభిల్లు శాద్వల సీమ కేగి,
హాయని నిట్టూర్పు నిగుడించి, వివశ
యైతెక్కలను జాచి, నిద్దంపు ముక్కు
తెఱచి, కో, యనిమంద మృదు కంఠరవము
కనికార మొలికింప, వలవంత నేడ్చె!

,,ఓ మిత్త్రుండా! కుంతలాధిపా!, యనుచు
కన్నీటివానలోఁ దడిసి వందురుచు,
ఆదారినే తెంచు చెలికాని గాంచి,
,,సచివాగ్రిణీ!,, యనికుంతలాధిపుడు,
బిలువ, ,,ఓ!,, యని దుఃఖముప్పొంగ, నిలిచి,
సంజీవ నీపాన మొనరించినటులు,
ఆనర్మసచివుండు, కలయఁ జూచుచును,
నేరినెందునుఁ గానఁ గాలేక యేడ్చె!
మఱలకోకిల వేడి నిట్టూర్పు బుచ్చి,
"సచివాగ్రణీ! నన్ను క్షమియింపవలయు!,,
అననర్మ సచివుండు జూచికోకిలను,
,,కటకటా! కుంతల లక్ష్మీసనాథ!
సకలదీవులు నేలు రాజాధి రాజ!
నీకెంతగతి పట్టె! ఎంత పాపంబు!"

అనిశోక వివశాత్ముఁడై నర్మసఖుఁడు,
కోకిలావరమును దన కేలఁ బట్టి
నిమురుచు, గాయంబులకు మందుబెట్టి,
తనకు టీరమున నాకుల పంజరమున,
భద్రంబు గానుంచి ఫలహార మొసఁగి
నిదిరింపుమీ, మిత్త్రుండా! బాధయణఁగు!,,

అని కొన్ని దినములు గడచి పోవగను,
ఒకనాడు సచివుండు నృపునితో ననియె:
"జననాథ! ఆనాటి రాత్రి నీవటులు
నను బాసి రాపుత్త్రితో మాటలాడి,
హాయియెప్పటికి రాక మఱచినావు!
ఏమయ్యెనో, బైటపడ నేమొ యనుచు,
భయమొంది లావణ్య తిలక కష్టములు
వినలేక నీపేరు జపియించుకొనుచు,
ఓమిత్త్ర రత్నమా! దేశ దేశములు
దిరిగి యీయటవిలోనొక కుటీరమును
నిర్మించి దినమొక్క యుగముగానిట్లు
గడుపుచున్నాను నేటికిదీఱె చింత!,,
అనికుంతలేశ్వరు వృత్తాంత మెల్ల
వినిచాల దుఃఖించి గతియేమి యనుచు,
చాలయోజించి, యా సచివ శేఖరుఁడు,
కోకిలావరముతోఁ బయనంబు చేసి,
చండికాలయము సమీపించి మ్రొక్కి,
,,ఓలోకమాతా! ప్రసన్నాత్మ వగుము,
నామిత్త్రునకు బూర్వదేహం బొసంగి,
రక్షించి, కులవర్ధనుని జేయుమమ్మా!,,
అనపుడు చండియదేవి శాంతించి,
కుంతలేశున కిచ్చె తొల్లింటి రూపు,
పలికెనా మిత్త్రుల హృదయంబు కలఁగ,
"ఒకవత్సరములోన నితఁడు భైరవిని
వరియింపలేకున్న గతిలేక మఱల
పక్షిరూపముదాల్చి తిరుగాడ వలయు!,,
సచివుండు తలయూచి, యట్టులేయగుచు,
దివ్య తేజంబున వెలుగొందుచున్న
రాజపుత్త్రునితోడ నచ్చోటు బాసి
కుంతలన గరమార్గము బట్టిపోయె!
అపుడుచండిక భైరవీకన్య కడకు
సరిగ మోదాశ్రుకణములు స్రవింప,
మృదుమంద మధురోక్తులను బల్కెనట్లు
"బాలికా! నీపున్నెములు పండనేఁడు
కుంతలేశుఁడు నీకుబతి యానుసుమ్ము!
ఒకవత్సరము దాక శాంతింపు మదను:——
వత్సరాంతరమునఁ గడుభక్తి మెఱయ,
శుభదినంబున నన్ను దర్శింపవచ్చి,
పడసియా శీర్వాదము 'సుఖింపుమబల!,,
అనిప్రేమ పూర్వకముగ మాటలాడి,
యాదేవి నిజనికేతన సీమకేగె:

# జానకి చూపు.

—:o:—

(అధికార్ల సూర్యనారాయణరావుగారు.)



తొలుకరించిన తొలిపూవు పొలుపుతోడ
బాలభానుని బంగారు వలపుతోడ
విమల మానస ప్రేమామృతములతోడ
పూనవే జానకీ! చల్లనైనచూపు!
సుభగసలిలావగాహనోత్సుకతఁ దేలి
యాకసంబును గాంచు రాయంచపోలె
కనుల నానంద చంద్రిక గాయుచుండ
చిలుకవే జానకీ! సౌఖ్య మొలుకుచూపు.
ఎడఁద శోకాంధకారంబు పొడము వేళ
ఉదయ కాంతులతో జ్ఞాన జ్యోతులల్లు
ప్రణయ దీపాలు నేత్రాలఁ బ్రబలుచుండ
నిలుపవే జానకీ! తెల్విఁ గొలుపుచూపు.
అవనిగోల పాల్గొనగ సంభవములైన
తాపములు [illegible]కొనన గాధ[illegible]ఁబడిన
పంచ ప్రాణంబులును లేచి వచ్చునటులు
తొడుగవే జానకీ! ధైర్య మిడెడు చూపు.
కడు జరాభారమున నొడల్వాడకుచుండ
ఆశ లొక్కొక్కటే యెండి రాలుచుండ
సత్యసుకుమార కౌమార నియతి విడక
చూడవేజానకీ! చిన్ని లేడిచూపు!



# శ్రీకృష్ణుడు.

(గొల్లపూడి సీతారామశాస్త్రిగారు.)



అమరసింహుడు విష్ణునకు 39 నామములఁ దెలిపియున్నాఁడు. అందులో కొన్ని శరీర వర్ణనలను బట్టియు, కొన్ని ఆయనచే నిహతులైన శత్రువులను బట్టియు, కొన్ని ఆయన సద్గుణ పుంజముల బట్టియు కలిగినవి. విష్ణువును సాకారునిగానే ఉపాసించినట్లు తోఁచుచున్నను కొన్ని నామములు గమనించిన ఇంద్రియాతీతుడని స్పష్టమగును. కొన్ని నామములు ఈయన యవతార కాలము నాటిపేర్లు. శ్రీకృష్ణుఁ డట్టివాఁడే. ఈయనకు ప్రత్యేకముగా సంబంధించి, విష్ణునకు పర్యాయ పదములైన నామములను పరీక్షింపవలెను. ఇట్టివి కృష్ణ, దామోదర, మాధవ, గోవింద, వాసుదేవ, దేవకీనందన, శౌరి, కంసారాతి, యను ఎనిమిది పేర్లు గలవు. కృష్ణుడన నర్వమును జేయువాఁడు, దైత్యులను నలిపివేయువాఁడు, కృష్ణవర్ణము గలవాడని యర్థము. దామోదరయన ఉదరమందు తులసి మాలగల వాడనియు, పలుపున ఉదరమందు గట్టబడిన వాడనియు అర్థము. మాధవయన లక్ష్మీభర్తయనియు యదువు పెద్దకొడుకు మధువు వంశమందు బుట్టినవాడనియు అర్థము. భూమినిగాని, గోవునుగాని, స్వర్గమునుగాని, వేదమును గాని పొందెడివాడు గాన గోవిందుడు. వసుదేవునికుమారుఁడు, జగమంతట గలవాఁడు అని రెండర్థములు వాసుదేవపదమునకు చెప్పుదురు. దేవకీనందను డన్నయర్థము స్పష్టము. శూరుని మనుమఁడు శౌరి. కంసారాతి యన్నను భావము సుగ్రాహ్యమె. మాధవ యన్నపదము యదువంశమును సూచించు నని చెప్పుటకు కొంచెము కష్టపడవలెను. దామోదర యన్న దానికి పలుపున గట్టబడిన వాడని సాధించుటకు శ్రమ పడవలెను. గోవిందయన్న గోపాలుడగుటయు కష్టమే. శౌరియన తాతపేరును వాసుదేవుడని తండ్రి నామమును దేవకీనందన యన మాతృదేవతాఖ్యయు సులభముగా నూహ్యంబులు. వంశావళి తెలిసె. కంసారాతియని చేసిన యొక్కఘన కార్యంబు సెప్పె. కృష్ణుడని వ్యావహారిక నామము నిచ్చె. మొదటవర్ణమును దర్మిలా మహాత్మ్యమును దానికి కారణములయ్యె.

ఈ పరిశీలనవలన దెల్లంబగున దేమనగా, ఇప్పటికాలమున కృష్ణుని కంటగట్టిన గాథలకు మూలాధారములు అమరసింహుని నాటికి మృగ్యంబులని. అమరుడు కృష్ణుని విష్ణ్వవతారములఁ జేర్చి గౌరవించె, అప్పటి ప్రజలభావములను సారస్వతములోని శబ్దంబు

లను రూఢ్యర్థములను ప్రకటించె. కృష్ణుని బంధుగులగూడ స్వర్గవర్గములో పేర్కొనిన అమరుడు ఇప్పటికథా బాహుళ్యము అప్పుడు ప్రచారమందున్నచో, విడిచియుండడు. ఈ పురాణంబుల లేశమాత్రముగానైన సూచించు పదములు రెండేగలవు. గోవిందయన్న గోపరిపాలనమును దామోదరయన్న పలుపుతో రోటికికట్టుటయు అర్థముచేసినచో, కృష్ణుని బాల్యక్రీడలని చెప్పువానిలో రెంటికి ఆధారము లేర్పడును. గోపవంశకథకు మూలంబైన యశోదనామమైనరాలేదు. ఆమెనువదలి, ప్రాముఖ్యములేని రెండుకథలకు అంకురములచూపునా? పైనుడివినరీతిని యీ గాథలదెలుపు నర్థములను తరువాత వ్యాఖ్యాతలుచేర్చిరని యూహించుట సమంజసము.

విష్ణుని నామాంతరములదెలిపి, కృష్ణునితండ్రి వసుదేవుని బిరుదముల చెప్పె. తరువాత కృష్ణునిఅన్న బలరాముని పేర్కొనియె. బలరామునితల్లిని భార్యనుదెలిపియు, కృష్ణుని సతీమణులపేరెత్తడు. ప్రద్యుమ్నుని అనిరుద్ధునిపల్కరించె. కాని కామపాలయని బలరాముని పిలుచుటచేత మన్మథుడు బలభద్రుని పుత్రుడని యనుటకు తావుగలదు. కాళిందీభేదనత్వము బలరామునికారోపించె. ఇప్పటి భాగవతపురాణమును, కథలను, కృష్ణుని లీలలును అప్పటికిపుట్ట లేదనితోచును. పరిశోధకులు వీని జన్మస్థానము, సమయము, బయలువరిచిన మేలౌనగూడును.

కృష్ణునికిని, గొల్లలకును సంబంధమే లేదా ?

కాళిదాసుని నాటికి యీ గోపబాంధవ్యము ప్రచురితమయ్యె. మేఘసందేశమున „గోపవేషస్య విష్ణోః" అని వర్ణించెను. అమరునకిని, కాళిదాసునికిని షుమారు రెండుమూడు వందలఏండ్లు వ్యవధిగలదు. ఈ మధ్యకాలమున యీ నూతనపరిణామము వికసించెనా ?

“ఇంతేగాక భారతయుద్ధమందు పాండవపక్షపాతుడై, రాజనీతిజ్ఞుడై, జయశీలుడైన మంత్రిగానున్నవాని పేర్లు కానరావు. భారత కృష్ణుడును, నవతార పురుషుడును వ్యక్తులా? మరియు భగవద్గీతా గ్రంథకర్తృత్వ సూచక నామధేయములులేవు. గీతాకారుడు ఈయవతార పురుషుడు గాడా? అట్లైన విష్ణ్వవతారమన్న ప్రఖ్యాతికి కారణమేమి? అమరము అసంపూర్ణ గ్రంథమా! శోధనచేయ వలసియున్నది.”



# కుందమాల.

( తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు. )



## ద్వితీయాంకము.

( ఇద్దరు మునికన్యలు ప్రవేశింతురు )

ప్ర॥ ము :— అహాహా! వేదవతీ! ఏమే! నీ భాగ్యము! నీప్రియసఖి సీతకు రాముని వలె శ్యామల వర్ణనముగల పుత్రికు లిద్దరు గలిగిరి.

వే:— సంతోషము! సంతోషము! వారికి పేళ్లేమి పెట్టిరి?

ప్ర:—పెద్దవాడు కుశుఁడు రెండవవాడు లవ కుమారుఁడు. పూజ్యులట్లు నామకరణము సేసెను.

వే:— ఇప్పుడు వారు విద్దెములు సేయుచున్నారా?

ప్ర॥ ము:— అంతియేగాదు.

గీ॥ కొదమ సింగంబులకు జోడు కోడెలగుచు
కూరిమి బాలకములతోడఁ బరువులిడుచు
రతువుల మనోజ్ఞముగ విహరించుచుండు
రుల్లములరంగ ఋషిపత్ను లెల్లరకును.

మునిజనుల యొడులలో పదింపదిగ మెలంగుచుందురు. ఇప్పుడు వాల్మీకుల వారుచేసిన రామాయణమును పఠించుచున్నారు.

వే:— ఈ వృత్తాంతమువలన సీత పుణ్యాత్మురాలని యెఱుగ వలసి యున్నది.

ప్ర॥ ము:— దీనికేమిగాని నైమిశారణ్య విశేషము లేమి?

వే:— మహారాజుగారి యజ్ఞసంభారములన్నియు పూర్తియైనవి. శిష్యులతోఁ గూడఁ దపోధను లందఱును నిమంత్రితులైనారు.

ప్ర॥ ము:— పూజ్యులగు వాల్మీకుల వారిని గూడ బిలిచినారా?

వే:— రామదూత యొకఁడు వాల్మీకి తపోవనముకుఁ గూడవచ్చెనని వినియుంటిమి. ఇప్పుడు సీత యెక్కడనున్నది? చూడవలెను.

ప్ర॥ ము:— ఇచ్చటనే సాల వృక్షచ్ఛాయను విశ్రమించి యున్నది. కాలమెట్లుగడపుదునాయని తలపోయు చున్నది.

(నిష్క్రమింతురు.)

## ప్రవేశకము.

(అంతట చింత నభినయించుచు నుత్తరేణను గూర్చుండి సీత ప్రవేశించుచున్నది.)

సీ:-- (నిట్టూర్పుపుచ్చి) పురుషుల హృదయములు స్వభావసిద్ధముగ నిష్ఠురములు.

అహో! యేమివీరి అవిశ్వసనీయత! దంపతీ స్నేహ ప్రసంగముల పట్టున స్వర్గమునను పృథివియందు ననుకూడ నుమామహేశ్వరు లనియును సీతారాము లనియు సుప్రసిద్ధమైన వాడుక. ఆ విషయముగ బొమ్మలు వ్రాయవలసివచ్చిననువీరివే. ఏమూలవిన్నను ఇట్టిగీతములే వింటిని. నిరపరాధను: ఆర్యపుత్రు నెట్లునిందించుదానను. ఆర్యపుత్రుడు సర్వవిధముల నన్ను పలాలించెడివాడు.

అకారణముగ ననేక యోజనములదూరమునబడవైచినాడు. ఆయన శోకపూర్ణదుఃఖకారిణినై యుద్భవించితిని. ఆయనతో గూడి చంద్రోదయమును కన్నులార గాంచితిని. కోకిలల మధురాలాపముల నాలకించితిని. మలయమారుత స్పర్శచక్కగ ననుభవించితిని. నేడో? వానినన్నిటిని ఏకాకినినై కనుచుంటిని. వినుచుంటిని. అనుభవించుచుంటిని;

నావంటిస్త్రీకి తో ప్రాణములగూడ పరిత్యజింతునని పల్కినపలుకులు వ్యర్థములుగదా; ఆనాడావిధముగ స్వామివల్ల భర్తనై బమిలాజనముల కంతకును తలమానికంబనై యుండి నేడీవిధమున పరిత్యాగ దుఃఖమున శోచనీయమగునవస్థ ననుభవించుచు లజ్జాపరిపీడితనై గడుంగడు బాధల నందు చున్నదానను; పిల్లలపుట్టుకయు పోషణము సర్వమును భగవానుండగు వాల్మీకి యాదరమున వర్థిలంగనినవి. తపోవనవాస విరుద్ధమగుఇట్టి దీర్ఘనిశ్వాస మిప్పట్టున నావంటిదాని కనుభూతము కారానిది. తడవుగనిటునటు మసలరాదు. మరణప్రయత్నముకు ప్రతిబంధకమైనదియునిదియే. ప్రియసఖ వేదవతిని నేనచ్చటకును బంపియుండ లేదు. ఏపనియు నియోగించలేదు. ఏమైనది చెపుమా?

(అంతట వేదవతి ప్రవేశించుచున్నది.)

వే:— తపోధనులకు నతిథిజనసముచితమును సదుదాచారమునకు వందనోపచారము సలిపితిని. ఈసాలవృక్షము కడకు బోయి ప్రియసఖినిసంభావించెదను

(పరిక్రమించి చూచి)

అదే విదేహరాజతనయ గ్రీష్మమానమునందలి తీవవలె కడు నడలి పాండురావస్థం దగులుకొని యీసాలము మొదలనలంకరించియున్నది. సమీపించెదను. (చేరి)

చింతాపరవశమున నధోముఖియాటకరులు విరియ బారికనులుగూడ కనబడుటలేదీమెకు. మిక్కిలిదైన్యమున్ జెందియున్నది. పలుకరించెదను. సఖీ! వైదేహీ!

సీ:—(తొట్రుపాటుతో) ప్రియము. ప్రియము. ప్రియసఖి వేదవతి వచ్చినది. ప్రియసఖీ! స్వాగతము.

వే:— కుశలవులకుఁ గుశలమా?

సీ:— వనవాసు లుండవలసి నట్లున్నారు!

వే:— నీవృత్తాంత మెట్లున్నది?

సీ:— (వేణినిజూపి) ఇదియెట్లున్నదో అట్లు!

వే:— (స్వ) ఈనిరపరాధ మిక్కిలి సంతాపము నందుచున్నది. రామసంకీర్తనమున నివారింప జూచెదను.

(ప్రకాశముగా)

ఓసీ! అప్రాజ్ఞురాలా? అపేక్షా శూన్యుడును దయారహితుమునగు నాతని యెడల

కృష్ణపక్ష చంద్రరేఖవలె దినదినము నేల యిట్లుకృశించెదవు?

సీ:— దయారహితు డనదవేల?

వే:— నిన్ను పరిత్యజించుటచేత.

సీ:— నేనుపరిత్యక్తురాలనా!

వే:— లోకమట్లు చెప్పుకొను చున్నది. సత్యముగ పరిత్యక్తవైతివి.

సీ:— శరీరముచేతనా? హృదయముచేతనా?

వే:— పరకీయమగు హృదయము నెట్లురుంగ గలవు?

సీ:— అతని హృదయము సీతకుపరకీయమా?

వే:— ఏమా, అపరిత్యక్తాను రాగము.

సీ:— అతడు నాయెడల ననురాగము లేని వాడా? సేతు బంధనాది పరిశ్రమ యంతయును, అధర్మురాలగు నన్నుం గూర్చియే గదా! ఆర్యపుత్రు డనుభ వించి యున్నాడు. అదిసుప్రసిద్ధమే.

వే:— ఓఆత్మశ్లాఘినీ! అదిక్షత్రియుల కుచిత కర్మ. దానికింగారణము రావణునిపై కోపము గాని సీతపై ననురాగము కాదు.

సీ:— ఆపైది చూడకున్నావు.

వే:— ఆపైనేమున్నది?

సీ:— ఇదే.

వే:— ఏమది?

సీ:— (లజ్జతో) సపత్నీజన నిశ్వాస మెఱుగని రామవక్షస్థలమున నెన్ని నాళ్ళునాకు బహూకరణము కలుగలేదు.

వే:— సఖీ! తొందరపడకుము. చూతువుగాని రాముని అగ్ని దీక్షా సమయము ఆసన్న మైనది.

సీ:— ఏమనేమి?

వే:— అశ్వపాణిగ్రహణము సహధర్మచారిణి తోగదా చేయువలయు?

సీ:— ఆర్యపుత్రునిచేతనే యుండ వలయునా? హృదయమున లేనా?

వే:—(స) అహో! ఏమిదృఢానురాగము. (ప్ర) సఖీసుఖమగు పుత్రసందర్శనము నిప్రవాన శోకమును అపన యింప నేరక యున్నది.

సీ:— శోకపరిహారముగూడ శోకమునువర్ధిల్లగ జేయును.

వే:— అదియెట్లు?

సీ:— బిడ్డలిద్దఱును మొలకదంతములచేముద్దు లొలుకు తమకోమల వదనముల నా వదనము వంకజూచి, నవ్వునపుడును మృదు మధురా లాపముల నందడిం జేయునప్పుడును వారి మాధుర్యమున్ గాంచి అందునిమగ్న నైయుంటిని. కాలక్రమమున వారు బాల్యము వీడి పరిణత వయస్కులై వర్ధిల్ల గలరు. అప్పుడువారి మాటయేమని సంతా పమునన్ను బాధింపుచున్నది.

వే:— అహో! పాపము! సీతపిల్లల బాలత్వ మీవిధముగ గడచిపోవు చున్నదే అనిఅది తలంచుకొనునప్పుడు అతని నృశంసత్వ మిట్టిదని అనుకొనుటకు గూడ నవకాశము లేకపోయినది.

సీ:— సఖీ! వేదవతీ? కానిమ్ము!

వే:— ఆర్యపుత్రుని జూడుమని చెప్పుము.

సీ:— (ఆత్మగతము) లజ్జావేశముతోడ నేమి యిట్లుపలుకు చున్నాను (ప్ర) కుశ

లవులకు తండ్రిగారిదర్శనమున జన్మము అమోఘమూ గాక!

వే:— మాకు రాజదర్శనము సమాపన్నము గానేయున్నది.

సీ:— ఎట్లు?

(నేపథ్య మందు ఋషులు.)

అహెూ! ఆశ్రమవాసులారా! వినుడు వినుడు!

ఇచ్చటికనతి దూరమున నశ్వమేధాశ్వము సంచరించు చున్నది. యజ్ఞోపచారములు సన్నద్ధములైనవి. నానాదేశ ఆశ్రమవాసులు వసిష్ఠాత్రేయ ప్రభృతులు మహామునులు చేరనున్నవారు. భగవానుండగు వాల్మీకి యాగమునకై ప్రతీక్షించియున్నాము. యజ్ఞదీక్షకిప్పుడే యుపక్రమింతురు. రామాదులు వాల్మీకితపోవన వాసుల నాహ్వానము సేయుటకు వచ్చినారు. జాగు సేయరాదు.

గీ॥ సమిధల గ్రహించి, తీర్థోదకముల నూని
అంది దర్భాంకురమ్ముల నభిహితముగ
మునులు వటువ్రతు మున్ముందు, మునితనూజ
లిండ్ల వాకిండ్ల శుభముగ నిడుడు బలుల.

సీ:— శీఘ్రముగఁ బోవలెను. ఆర్యుడు కాశ్యపుడు ప్రయాణ ఘోషను విని యజ్ఞోపకరణముల గ్రహించి ముందు పోగలడు. నేనును కుశ లవులకు ప్రస్థాన మంగళములు నిర్వర్తింప వలయు.

(అని, అందఱును పోవుచున్నారు.)

(ఇతి ద్వితీయాంకము.)



## నటశేఖర

దేవరకొండ వెంకట సుబ్బారావుగారు.



ఆంధ్ర రంగభూమిని వీరుసుప్రసిద్ధులు. ఈనటశేఖరుని యభినయభంగిమములు ముందు శారదలో ప్రకటింపబడును.

# రామునివయస్సు.



(గో. రామదాసుగారు.)

—:O:—

'శారద, సం॥ 2 సంఖ్య 6 సంచిక పుటల 727–771 లో పై పేరుతో నొక వ్యాసము ప్రచురించ బడెను. రామాయణములో రాముని వయస్సు విషయములో నొకచోట నొకలాగునను మరియొకచోట మరియొకలాగునను వ్రాసియున్నట్లు కొన్ని వార్తాపత్రికలలో ప్రచురించిరని యున్నది. వార్తా పత్రికలననేమి? స్వతః రామాయణమునకు వ్యాఖ్యానము వ్రాసినపూర్వులకే ఈవైరుధ్యప్రసంగములు గన్పించినవి. అందువలననే వాటికి విరోధము లేదనియు అన్నిటికీ ఒక్కటే భావమని స్థాపించుటకై పూనుకొని యెంతయో తాపత్రయ బడినారు. పైవ్యాసకర్తలు జెప్పిన యంశములను బరిశీలించు నవసరమున పూర్వవ్యాఖ్యాతల సిద్ధాంతములను గూడ బరిశీలించుట కవకాశముగలిగె. రాముని వయస్సు విషయమై తొలుదొల్త దశరథుడు విశ్వామిత్రునితో జెప్పినట్లు బాలకాండ వింశసర్గలో నిట్లున్నది.

ఊన షోడశ వర్షో మే
రామో రాజీవలోచనః।
నయుద్ధయోగ్యతామస్య
పశ్యామి సహరాక్షసైః॥

'ఊన' అనే పదమునకు ఒకటి తక్కువయని యర్థముచేసి, రామునకు పదునైదేండ్ల వయస్సని వార్తాపత్రికలవారి వాదనయని వ్యాసకర్తలు వ్రాసినారు. ఇట్టియూహతప్పని చాటుటకు రోమనుసంఖ్యల ఉదాహరణనిచ్చినారు. కాని రోమను సంఖ్యలకును సంస్కృత సంఖ్యలకును నెట్టిసంబంధమును లేదని వారికి తెలియలేదేమో! హిందూదేశభాషల సాంప్రదాయకమును బట్టి కించి దాలోచించిన 'ఊన' యనుపదము యొక్క యర్థము వ్యక్తమై యుండును. పంజాబీ భాషలో 'ఊని' అనగా పందొమ్మిది. హిందీలో ఇరువదికన్న ఒక్కటితక్కువైన సంఖ్యకు 'ఊని' అని యందురు. ఓఢ్ర భాషలో 'ఒణీసె' అందురు. ఇది 'ఊనవి' యొక్క అపభ్రంశమే. ఇవి యన్నియు 'ఏకోనవింశతి' అను సంస్కృత పదముయొక్క క్లుప్త పదములే. కావున ఆపదములనుండి 'ఊన' అనగా ఒకటితక్కువ, యని యర్థము చేయరాదు. 'ఊన' అనగా తక్కువ యనియే యర్థము. ఈ భావము 'ఊనషాణ్మాసికము' లో స్పష్టబడుచున్నది. ఆరు నెలలకంటె తక్కువరోజులలో బెట్టెడిమాసశ్రాద్ధమని యందరికిని తెలిసినదే. 'ఊనషాణ్మాసికము' ఆరవ మాసములో బెట్టేశ్రాద్ధముకన్న కొన్నిరోజులుతక్కువ చేసి పెట్టెడిశ్రాద్ధము ఇచ్చుట. ఊన, అనగా ఎన్నియో కొన్నిరోజులు తక్కువయనియే యర్థము. కాని యొక నెల గాని కొన్ని నెలలుగాని తక్కువయని యర్థముగానేరదు. అటువలెనే 'ఊనషోడశ' అంటే పదియారవ సంవత్సరమునకు ఎన్నియో కొన్ని రోజులు తక్కువయనియే యర్థము. కానిపండ్రెండేండ్లని యర్థము చేయుటసరిగాదు. మరీచుడు రావణునితో జెప్పిన 'బాలో ద్వాదశవర్షోయం' అనుదానిని సరి బెట్టుటకుగాను 'ఊనషోడశవర్ష' అనుదానికి పండ్రెండేండ్లు అనిఅర్థము చేయుటగూడ తప్పు. వారీ

చుడు చెప్పినట్లున్న శ్లోకము విషయములో పూర్వ వ్యాఖ్యాతల యుద్దేశమును గమనించుట యుక్తము.

మారీచుడు చెప్పినదానికి 'బాలష్షోడశవర్షో' యన్న పాఠాంతరమున్నట్లు కతకవ్యాఖ్యకర్త వ్రాసినారు. లేదా మారీచునకు గలభయమును ఉత్ప్రేక్షించుటకైనా 'బాలోద్వాదశవర్షో' యన్న వ్రాసియుండవచ్చునని గూడా ఈవ్యాఖ్యాత చెప్పెను.

శిరోమణి వ్యాఖ్యానమిట్లున్నది:— 'మారీచు చెప్పిన శ్లోకములోనున్న ద్విశబ్దమేకశేష మగుటవల్ల బరని యర్థము. అందుచే పదియారేండ్లని అర్థము గలుగుచున్నది. దీనిని బట్టి భట్టోజీచెప్పిన పాఠాంతరముగూడ సరిపోవుచున్నది. కావున ఊనషోడశవర్షో మే అని చెప్పినవెంటనే విశ్వామిత్రునితో రాముడు వెళ్లునరికి పదియారవ సంవత్సరము ప్రవేశమైనది. ఆసంవత్సరములోనే రామునికి సీతకు వివాహమైనది. కావున వివాహకాలమునకు రామునికి పదియారవ సంవత్సరము అని సిద్ధము.

గోవిందరాజులవారి వ్యాఖ్య:— 'ఊనత్వం, పల్లఒకనెలగానిమూడుమాసములుగానిలేదా ఆరుమాసములైనా తక్కువయనిగాని ఒకటి రెండు మొదలైన సంవత్సరములు తక్కువయని యర్థముగాదు. కాన 'ఊనషోడశవర్ష' యనగా కొంచెము నెలలు తక్కువ పదియారేండ్ల వయస్సువాడని యర్థము. ...తే 'బాలోహ్యకృతవిద్యశ్చ నచవేత్తి బలాబలం' అనిదశరథుడు చెప్పిన వాక్యములో 'బాలః' యనుశబ్ద ప్రయోగమెట్లని శంకించగా, బాల్యయౌవనసంధిలో బాల్యడని చెప్పు నాచారమున్నది. మరియు "బాలఆషోడశాద్వర్షాత్పోగణ్డశ్చేతి కీర్త్యతే" అనువాక్యమున్నది. బాలోద్వాదశవర్షోయ మకృతాస్త్రశ్చ రాఘవః అజాతవ్యంజనః శ్రీమాన్పద్మపత్రనిభేక్షణః, అని మారీచుచెప్పినది రావణుని భయపెట్టుటకై మారీచు అబద్ధమాడి యుండవలెను. ఏమంటే స్వయముగా వాయవ్యాస్త్రముచే దెబ్బతిన్నవాడైనను 'అకృతాస్త్రః' అని చెప్పినాడుగాదా!"

ఈపైవజాపిన ముగ్గురు వ్యాఖ్యాతలు గూడ మారీచువచనములు అసత్యములుగానే భావించి ఊనషోడశవర్షోయ మనుదానికి కొన్నినెలలు తక్కువపదియారేండ్ల వయస్సు అనియే యర్థముచేసిరి; గాని మన వ్యాసకర్తలుమాత్రము అసత్యవంతుడు, పాపాత్ముడు, రాక్షసుడైన మారీచువాక్కులనే స్థిరపరచి దశరథునివాక్కులకు విపరీతార్థముతీసిరే! మారీచువాక్యప్రమాణముపైరాముని వివాహకాలమునాటికి పదిరెండేండ్లవయస్సని జెప్ప బూనుకున్నారు.

ఇంతేగాదు, వీరివాదనను బలబరుచుటకు సీత పర్ణశాలలోనుండగావచ్చిన రావణునితో జెప్పిన "మమ భర్తామహాతేజా వయసాపంచవింశకః" అన్నది మరియొకటేట! అరణ్యవాసమునకు బైలుదేరేసరికి రాముడికి ఇరువదియైదు సంవత్సరములు ప్రాయము. అందులో అయోధ్యలో వివాహమైన తరువాతనున్న పదిరెండు సంవత్సరములూ కొట్టివేస్తే వివాహకాలమునకు రామునికి పదుమూడవ సంవత్సరము వచ్చుచున్నట్లున్నది. ఇందు విషయమై వ్యాఖ్యాతలేమన్నారో చూతము.

శిరోమణి:— "సమాద్వాదశ తత్రాహం రాఘవస్యనివేశనే" అనిసీతరావణునితో చెప్పినదానిని బట్టివివాహమైనతర్వాత అయోధ్యలోపంద్రెండేండ్లున్నారుగావున వనమునకు ప్రయాణమైనసరికి రామునికి ఇరువదియెనిమిదేండ్లు వయస్సున్నట్లుగన్పించుచున్నది. "మమభర్తామహాతేజా వయసాపంచవింశకః" అన్నది పైనిజెప్పినదానికి విరోధముగాదు. 'పంచవింశకః' లోనున్న 'క' శబ్దమునకు మూడనియర్థము." (కశబ్దస్యవహ్ని వాచకత్వేన త్రిత్వలాభః కశబ్దస్య వహ్ని వాచకత్వంతు కఃప్రజాపతిరుద్దిష్టః కోర్కవాయ్వనలేషు, ఇతికోశాదవగంతవ్యం) గావున, అయిదు, ఇరువది మూడుఅనగా 'ఇరువదిఎనిమిద'ని యర్థము."

గోవిందరాజులు:— ఇరువదైదేండ్లవానితో సమానత్వము జెప్పినది. "ఇవార్థేనకనోవిధానాత్" గావున నిత్యయౌవనత్వం జ్ఞాపకము చేయబడినది.

దేవత లెల్లప్పుడూ ఇరువదియేండ్ల వయస్సు వారు గదా!"

వీటిని సమర్థించుటకు ఈవ్యాఖ్యాతలెంత ప్రయాసపడిరో గమనింపవలెను. అక్షర అక్షర మునకుగూడ నర్థము చూపినారు. ఇదియంతయు నెందులకు? వివాహము నాటికి రామునకు పదియారు వత్సరములు ప్రాయమని స్థిరపరచుటకే. ఏమి పంద్రెండేండ్ల వారనియంటే వ్యాఖ్యాతలకొంపఏమి మునిగినది! వారికాధనువులు లేకపోయెనా? మనవ్యాఖ్యాకర్తలు నుడివిన మనుధర్మ శాస్త్రమేమైనది. మనువు ఒప్పుకొనుచుండగా వ్యాఖ్యాతలేల దానిని ప్రమాణముగా గొనలేదు?

మనుధర్మశాస్త్ర మొప్పుకుంటున్నది. గాన రామునికి అయిదవయేటనే యుపనయన మైనదని మన వ్యాసకర్తలు సిద్ధాంతీకరించినారు. గాని వ్యాఖ్యాతలు మాత్రము అటులనలేదు. రామునకు గర్భాష్ట మునందే యుపనయనము జరిగినట్లు గోవిందరాజుల వారిమతము. "తచ్ఛబ్దేన దశరథేన కామ్యపక్ష మాశ్రిత్య గర్భాష్టమ ఏవకృతం" ఈమతమును వారవలంబించ వలసిన హేతువు లేమనిన—

వనవాసమునకు బోయెదనని చెప్పవెళ్ళిన రామునితో కౌసల్యాదేవి "దశసప్తచ వర్షాణి జాతస్యతవ పుత్ర:" యని యన్నవాక్యమును పూర్వవాక్యములతో సమర్థించుటకే. వనవాసమునకు బోవు [illegible] యిరువది అయిదు వర్షముల ప్రాయమైనయెడల కౌసల్య చెప్పిన దశసప్తచవర్షాణి అనునదెట్లు సరియగునని చెప్పియుపనయనము ద్వితీయజన్మ గానఅప్పటినుండియే తల్లి గణించెనని యనుకొని యుపనయనముయెనిమిదవ యేట జరిగియుండవలెనని సిద్ధాంతముచేసిరి. ఇలాగునే భూషణ మనువరైన వ్యాఖ్యానములలో నున్నది. కాని జన్మమునుండి యొకరున్ను ఉపనయనము నుండి మరియొకరున్ను వయస్సును లెక్కించుట బాగులేదని శిరోమణి వ్యాఖ్యానములోనున్నది. ఇంతయేకాక ఈ వ్యాఖ్యాతలు. కౌసల్య చెప్పిన వయస్సువచనములను పూర్వ వాక్యములతో సరిపెట్టుటకు అక్షరపరీక్షకూడ చేసినారు. "దశసప్తచ వర్షాణి జాతస్య తవపుత్రకేతి కౌసల్యోక్తి పద్యఘటకే ధూతదశశబ్దస్యైక శేషేణ వింశతిరర్థః చశబ్దస్య చందశ్రావాచకత్వాస్యై కత్వలాభః చశ్చన్ద్రేశేపుమానుక్తః కచ్ఛపేచ్ఛంద్ర చోరయోః ఇతిమేదినీ"

వ్యాఖ్యాత లిట్లు చెప్పగా మనవ్యాసకర్తలు ఈకౌసల్య వాక్యము నెట్లు సమర్థింతురో గదా! వీరివ్యాసమందు ఈశ్లోకము నే యెత్తుకోలేదు. ఏమో గాని!

రాముడు బాల్యుడని స్థిరబరచుటకు వ్యాసకర్తలు మరియొక ప్రమాణమును జూపిరి. వివాహమగుటకు ముందుకొన్ని దానములు చేయవలసియున్నది. అవిచేయుటకు పిన్న వయస్కులర్హులు గారు. శ్రీరాములు పిన్నవయస్కుడగుటంచేసియే తండ్రియగుదశరథుడే వారినుద్దేశించి గోదానము మున్నగునవి చేసినాడని కవివ్రాసినాడు అనివీరు వ్రాసినారు. ఈసందర్భములో మూలమిటులున్నది. I. 72,

23. సువర్ణశృఙ్గా స్సమ్పన్నా
స్సవత్సాః కాంస్యదోహనాః
గవాం శతసహస్రాణి
చత్వారి పురుషర్షభః
24. విత్తమన్యచ్చ సుబహు
ద్విజేభ్యో రఘునందనః
దదౌగోదాన ముద్దిశ్య
పుత్రాణాం పుత్రవత్సలః॥
25. ససుతైః కృతగోదానై
ర్వృతస్తు నృపతి స్తదా
లోకపాలై రివాభాతి
వృత స్సౌమ్యః ప్రజాపతిః॥

"అరఘునందనుడు పుత్రులయందుమిక్కిలివాత్సల్యము గలవాడు గావున వింతటితో దనియక వారల సమావర్తనోత్సవమును గురించి బంగరు కొమ్ములు గలవై భాగ్యవంతములగు నాలుగులక్షల

గోవులను దూడలతోను బాలు పిదుకు కంచుపాత్రలతోను బ్రాహ్మణులకు దానముచేసి మరియు బహుధనమువ్యారిగా వారికినిచ్చె. అప్పుడు సమావర్తనము చేసి కొన్న పుత్రులు తన్ను బలసియుండగా ఆదశరథ భూవిభుడు దిక్పాలురు బలసి కొలువ ప్రసన్నుడై యున్న బ్రహ్మదేవునివలె ప్రకాశించెను. (గోదానమ్ గావః అనగా కేశములు దాన మనగా ఖండనము ఇదియె వివాహమునకు ముందు సేయంబడు సమావర్తన కర్మమనబడును.)
(దేవరాజులవారు.)

మనవ్యాసకర్తలా గోదానమంటె గోవులను యిచ్చుటని తప్పర్థము జేసికొనినారు. సమావర్తన కర్మజరుగగానే పెద్దవాడు తానుగాన బ్రాహ్మణులకు సంభావనల నిప్పించెననియె అర్థముగాని రాముడు చిన్న వయస్కుడుగాన అతనిబేరుగ తానుదానములు చేసెనని యర్థముగాదు.

ఈగోదాన కర్మ వివాహముజరుగుటకు ముందు పెండ్లికొమారుడు చేసుకొవలసిన కర్మ. సీతనురాముని కిచ్చుటకు నుభయపక్షములవారు సమ్మతించి, వివాహ ముహూర్తమును స్థిరపరచిన పైని జనకుడు దశరధునితో నిట్లుజెప్పెను. (I. 71.)

23 రామలక్ష్మణయో రాజన్
గోదానం కారయస్వహ
పితృకార్యంచ భద్రంతే
తతో వైవాహికం కురు॥

(రామలక్ష్మణులకు గోదానంబను సమావర్తన కర్మమును జేయింపుము. నీకు శుభంబగునుగాక వివాహకాలమున జేయవలసినపితృకార్యమగు నాందీ శ్రాద్ధమును గావింపుము)

వివాహమగు దినమునకు పూర్వము నొకటి రెండు దినములలో పెండ్లికుమారుడాచరించవలసిన కర్మగోదానము. ఇదియెంతవయస్సున చేసికొవలసి నది ఏఏజాతుల వారికీకర్మ విధించబడినది, ఈప్రశ్నల కుత్తరువు వేదములలోనిట్లు చెప్పబడియున్నది.

(అధర్వణ వేదము. (VI 133.)

"బ్రాహ్మణవృత్తి నవలంబించు కుఱ్ఱవానికి వేదాధ్యయనము చేయుటకుగాను వానినడ్డిచుట్టు ముంజగడ్డితో చేసిన త్రాటిని గట్టి పవిత్రునిగా చేతురు, యిదియే యుపనయనకర్మ."

ఇతిర వృత్తులలో చేరు పిల్లలకు పదియారవయేట జరుగు గోదానమే ప్రథమకర్మ. అంతవరకు ఆకుఱ్ఱవాండ్ల జాతుగ త్రించబడదు(ఋగ్వేదము (VI 57.) అప్పుడు ( పదియారవయేట ) వాని జాతు కత్రించెదరు"

ఈ వేదాచార ప్రకారమే రామునికిజరిగినట్లు గనబడుచున్నది. రాముడు బ్రాహ్మణ వృత్తి నవలంబించలేదు ఎంతసేపు శస్త్రవిద్య యేనుగులను గుఱ్ఱములను రథములను యెక్కి వేటకువెళ్లుట మొదలైన శూరులకు యుక్తమైన విద్యలనే పిన్నవయస్సునందు నేర్చినట్లు రామాయణములోనే చెప్పబడియున్నదిగాన నుపనయనము జరిగినట్లు యెచ్చటనూ జెప్పలేదు చెప్పకపోయి నంతమాత్రమున కాలేదని మనమెట్లు చెప్పగలమనియంటే బ్రాహ్మణేతర వృత్తుల నవలంభించువారికి నుపనయన కర్మలేదని వేదశ్రుతులే ప్రమాణము. వేదములలో జెప్పిన యాచార ప్రకారము రాముని వివాహమైనదని స్పష్టముగా ఆరామాయణ మందుండుట మరియొక ప్రమాణము. ఇంకొకటి జాతకర్మ నామకరణ కర్మల చేయించినట్లు చెప్పి యుపనయనము చేసినట్లు చెప్పక బోవుటేమి;ఉపనయన కర్మ ముఖ్యమైనదే దాని విషయమై యెందుకూరకొనవలె? అందుచేరామునకు వేదములనాటి యాచార ప్రకారమే వివాహకర్మజరిగినది. కావున వివాహమునాటికి రామునకు పదియారవవత్సరము ఇది దశరథుడు విశ్వామిత్రునితో చెప్పిన పూనషోడశ వర్షమే అనుదానికి సరిగానున్నది. ఇట్లు వేదోక్తాచారమునకును దశరథుడు చెప్పిన వయస్సునకును వివాహమప్పుడు జరిగిన కర్మలకును సరిపోవు చుండగా వ్యాసకర్తలు జెప్పిన పదిరెండేండ్లెట్లు సరిపోవును.

వీరికాధరువు మనుస్మృతి ఈస్మృతిని యాధరవు తీసుకొనవలెనంటె ముందురామాయణ కాలమునుమానవ ధర్మశాస్త్ర కాలమున్ను బరిశీలించవలసియున్నది. ఆకాలనిర్ణయమును బట్టి మనుస్మృతి రామాయణముకన్న ముందేయని నిశ్చయమైన అప్పుడు అది మనము పరిశీలించు గ్రంధమునకు వర్తించును.

ఇట్లు వేదాచార ప్రకారము రామునకు వివాహకాలమునాటికి పదియారేండ్లని స్థిరబడగా మారీచ వాక్యము లెట్లు సరియగును. ఇందువిషయమై యొక వ్యాఖ్యాత ఆవాక్యమునే దిద్దినాడు. రెండవవాడు రాముని పరాక్రమము నుత్ప్రేక్షించుటకు కవియట్లు వ్రాసినాడనెను. మూడవవాడు మారీచబద్ధమాడినాడనెను. మారీచుని గుణగణనచేసిన వాడెంతమర్యాదస్తుడో వ్యక్తముగాగలదు. అట్టివాడు అబద్ధమాడలేదని వాని మాటలే యేలవిశ్వసించవలెను? అంతేగాక పెళ్ళినాటికి పండ్రెండేండ్లవారే శ్రీరాముడైన భార్యతో గాపురముండు టెట్లు? ఇందువిషయమై యింకముందు విస్తరముగా జెప్పెదను.

ఇక మాయవేషము వేసుకొని వచ్చినరావణునితో సీత జెప్పినవయస్సునకున్ను దశరథుడు విశ్వామిత్రునితో చెప్పినవయస్సునకును యెట్లుసరిపోవును? ఇవిసరిపెట్టుటకు పూర్వవ్యాఖ్యాతలెన్నిదారులు త్రొక్కిరో చూస్తిమిగదా! ఎన్నిప్రకారములు సమర్థించుటకు ప్రయత్నించినను నొక్కటైనా స్థిరబరచలేకపోయిరి. దశరథుడు జెప్పిన పదియారేండ్లకు వివాహానంతరము అయోధ్యలోనున్న పదిరెండువత్సరములు గలిపితే అరణ్యవాసమునకు వెళ్లుతరికి రామునకు ఇరువదిఎనిమి దేండ్లప్రాయమైయుండవలెను. అట్టిచో సీత ఇరువది అయిదేండ్ల ప్రాయమనియే జెప్పెను? ఇరువది ఎనిమిదేండ్లకును ఇరువదిఅయిదేండ్లకు భేదములేదా? వైరుధ్యమునకింకనెట్లుండవలెను?

ఇది ఇటులుండ, వనవాసమునకు వెళ్లునప్పుడు శలవుబుచ్చుకొనుటకు కౌసల్యవద్దకు బోగా ఆమెచెప్పిన ప్రకారము పదియేడు వత్సరములే వయస్సు తేలుచున్నది. ఇదియుందువాటితోను వెనుకవాటితోను గూడ సరిపోలేదు. ఇట్టివిరోధ వాక్యముల నుంచుకొని ఇవి విరోధములుగావనుట ఎట్లుచెప్పవగును? ఇట్టివానిని సమర్థించ బ్రయత్నించుటకు అక్షరములకు అర్థము చెప్పుట మొదలైన అసాధారణప్రయత్నములకు అవకాశమగుచున్నది. కౌసల్యచెప్పిన వయస్సును స్థిరపరచుటకు నుపనయమైన దగ్గరనుండి లెక్కించినదట. పుట్టిన దగ్గరనుండి తండ్రియు నుపనయము నాటనుండి తల్లియు వయస్సు లెక్కించెనట. ఇదియెచ్చటి సాంప్రదాయమో! ఎవరికైన నుపనయనము నాటనుండి ప్రాయము లెక్కించెదరా? దత్తులకు దత్తతయయిన నాటనుండి వయస్సు లెక్కించెదరా! ఇది యేధర్మశాస్త్రమందు జెప్పబడియున్నదో? జాతకము అనుపదమునకర్థమే పుట్టిన సమయము దెలుపునది. అందుచేతనే పుట్టిన తిథివార నక్షత్రసమయములు లిఖింపబడియుండును ఉపనయనము నాడివిజరుగునా? ఆసమయమును బట్టి లెక్కించెదరా? ఏకాలములోనైన నుపనయనము నుండి వయస్సు లెక్కించునట్లు మఱియొక ప్రమాణము చూపగలరా?

ఏకాలమునందును యేదేశమునందునూ జరుగని యాచారమును జెప్పిసమర్థించుట యెంత విశ్వాసయోగ్యముగానుండును. చెప్పినసబబు పండిత పామరులకు సమ్మతముగా నుండవలెను గాని తమన్న చెప్పినదే వేదమని బుకాయించగూడదు.

రాముని వయస్సిట్లులుండ నిక సీతవిషయములో ఆమెకు వివాహమునాటికి యేడేండ్ల ప్రాయమని శ్రీవ్యాసకర్తలు జెప్పినారు. సీతకైదవయేడు రాగానే యాపెతండ్రి వివాహవిషయమై ఆలోచించుటయింతగాదు అప్పటినుండి రెండేండ్లలోపుననే దగినవరుడు దొరకినాడు. వివాహమాయెను. ఎంతసులువుగా తేల్చివేసినారు! దీనికి ప్రమాణము వారికి మూర్ఛితులైన రామలక్ష్మణులను జూచి యేడ్చుచు జెప్పిన సీతవాక్యము.

బాల్యేన బాలాం సంప్రాప్తం
భార్యాం మాంసహచారిణీం" *

బాలాం అనుపదమునకు చిన్న వయస్కురాలని పీరియర్థము. రాముని విషయములో 'బాలో ద్వాదశ వర్షోయం' అనిచెప్పిన దానికి పదియారేండ్లవఱకు బాలుడని చెప్పుదురుగాన రాముడుపదియారేండ్లకు తక్కువ వయస్సుగలవాడనియర్థము చెప్పినారు వ్యాఖ్యాతలు "బాల ఆషోడశాద్వర్షాత్ త్పోండశ్చేతి కథ్యతే" ఈసిద్ధాంతము స్త్రీలపక్షమున చెప్పగూడదా గాన బాలాం అనగా పదియారేండ్లకు తక్కువ వయస్సురాలనియే యర్థము చెప్పవలెను. ప్రౌఢదశకు పూర్వదశ స్త్రీలకు బాలదశ. దీనినిబట్టి భర్తతో కూడరాని వయస్కురాలని చెప్పుటకేమైన ప్రమాణము చూపగలరేమో మనవ్యాస కర్తలు?

"పతి సంయోగ సులభం వయోదృష్ట్వాతు మే పితా" అనువాక్యమునకు పెనిమిటితో గలయుటకుదగిన వయస్సుగల దానినిగా జూచి అని యర్థము స్పష్టముగా గనిపించుచున్నది. పతిసంయోగమునకు దగినవయస్సు స్త్రీలకేది? పండ్రెండేండ్లకుపైనా? లేక అంతకు లోపున నావివాహమైన తర్వాత అయోధ్యకు వెళ్ళిన తోడనే యెవరి భర్తలతో వారు స్వేచ్ఛగా విహరించినటు 1. 77. 16. లో జెప్పబడియున్నది.

"రేమిరే ముదితాం; సర్వా భర్తృభిస్సహ తారహ"

(అందరు ముదంబు వొరల [illegible] దమతమ కాంతలంగూడి క్రీడించుచుండిరి.)

29వ శ్లోకములో "రామస్తు సీతయా సార్థం విజహార బహూనృతూన్?"

(రాముడును అనుకూలంబగుమనముగలిగి సీతయందు మనసునిలిపి యాబిడ మనస్సునందు దానును నెలకొని పెక్కు ఋతువులా మెతోడంగూడి విహరించుచుండెను.)

ఋతువులని జెప్పుటకు కారణ మేమి వ్యాఖ్యాతయిట్లు వ్రాసియున్నారు. ఆయా ఋతువులకు దగిన భోగోపకరణములతో భోగ మనుభవించినారని తెలియదగినది.

ఇట్లు వివాహమైన వెంటనే భర్తతో గాపురముజేసినట్లు స్పష్టముగా గన్పించుచున్ననూ శ్రీవ్యాసకర్తలు విపరీత తలంపేల జేస్తిరో వారుజెప్పినట్లు వివాహము నాటికి సీత కేడేండ్లు యున్నయెడల అప్పుడే రహస్యమందు క్రీడించుటెట్లు? ఆయాఋతువులకు దగినట్లు విహరించుటెట్లు?

యౌవన ప్రాదుర్భావముగాని కన్యలకు వివాహము చేయు నలవాటుబడ్డ యీకాలమునందు తండ్రులు [illegible]కు వివాహముచేసిన వెంటనే అత్తవారిండ్లలో వదలి వేయుచున్నారా? స్త్రీలకు బ్రహ్మచర్య విధానమంతయు భర్తవద్దనుండి యభ్యసించునట్లువిధించియున్నారుగాన చిన్నతనముననే ఆడపిల్లలకు వివాహముజేయవలసినదని వ్యాస కర్తలు జెప్పినారు. ఇట్లు యెవరైనా చేయుచున్నారేమో జెప్పగలరా!

"వైవాహికోవిధి స్త్రీణాం సంస్కారో వైదికస్మృత పతిసేవాగురావాసో గృహార్థోగ్ని పరిక్రియా"

అని ఒక ప్రమాణము జూపినారు. దీనియర్థమే మోగమునింప వలసియున్నది. 'వైవాహికోవిధిః' అను పదములకు యిక్కాలమందు జరుగుచున్న చిన్నపిల్లల వివాహములేయని అర్థము చేసినారు. అదేనిజమైన యర్థమైన యెడల పతిసేవా మొదలైన గృహోపచారములు చేయుటెట్లు? 'వైదికస్మృతః' అనగా వేదములలో జెప్పిన వైవాహికోవిధి వివాహకర్మయే స్త్రీలకు జరిగే ముఖ్యసంస్కారము. వేదములోనూ యిట్లే జెప్పబడ్డది. (అధర్వణ వేదము I. 14.2) వివాహసంస్కారముజరుగ విధియేగృహస్థులుచేయుకర్మలకు స్త్రీలుపనికిరారు. వేదములో జెప్పిన వివాహకర్మయును ఈనాడు జరుగుచున్న పిల్లల వివాహమున్నూ యొక్కటియేయనియర్థముజేయ గూడదు. అదే అర్థమైన వివాహమైనప్పటికిరజస్వల

* V. 26. 1. (అధోముఖముఖీ బాలావిలప్తుముపచక్రమే) యిచ్చటకూడ 'బాలా' అనగా చిన్నవయస్కురాలనియేయర్థము చెప్పుదురేమో.

గాని పిల్లలను పితృకర్మలయందు యేల చేయించుకొనిన్వరు శిష్టులైనవారు అట్టిపిల్లలచే భుజించరేలని? గృహస్థ ధర్మములను చేయుటకు వివాహమైనప్పటికీ కన్యలైరవారు నిషేధించబడినట్లు ప్రస్తుతాచారమువల్ల గన్పించుచున్నది. ధర్మశాస్త్రములో కాచారమువల్లనే వ్యక్తమగును. కావున పైజెప్పిన శ్లోకములోనున్న వివాహమునకు నీరోజులలో జరుగుచున్న చిన్నపిల్లల వివాహములని యర్థము గాదు.

వేదములలో జెప్పిన, వైవాహికోవిధిగదా స్త్రీలకు జెప్పిన ప్రథమ సంస్కారము? ఆవేదములలో యెట్లు చెప్పబడియున్నదో చూతము. అథర్వణవేదము II 36. లో స్త్రీలకుయుక్తవయస్సురాగానే వివాహము చేయవలెనని మాత్రమేమున్నది గాని యిన్ని సంవత్సరముల ప్రాయమురాగానే వివాహము చేయవలెనని జెప్పలేదు. యుక్తవయస్సనగా నేమియర్థము? ఆవేదమందు వర్ణించబడిన సూర్యాని వివాహమును బరికించిన దీనియర్థము వ్యక్తమగును. వివాహకర్మ అంతయు ముగిసిన వెనుక రాత్రియే వధూవరుల సంధానము జరిగినట్లున్నది. VII. 36. "సంతోష హృదయముతో మంచము నెక్కుము. ఈభర్తకు సంతానమిమ్ము" VII. 37. గావున యుక్తవయస్సనగా రామాయణములో జెప్పినపతిసంయోగ సులభవయస్సు అనియే. అనగా రజస్వలా అయిన పిమ్మట యనిగాని తత్పూర్వము గాదని స్పష్టమే. సంధానమైన మరునాటి యుదయమున పురుషుడు స్త్రీని యిట్లుబిలుచును. "నేను పురుషుడను. నీవు స్త్రీవి. నేను ఋక్కును, నీవు వాక్కువు. నేను ఆకసమును నీవు భూమివి. కాన పుట్టబోయే పిల్లల తలితండ్రులుగా మనము కలసియుందము" వివాహముగాని పురుషులు వివాహము చేసుకో గోరదరు. విస్తార దానములను చేయువారు కోమాళ్లనుకోరదరు. ఎక్కువ అయిశ్వర్యము కొరకు వశించని శక్తిగలవారమై మనమిద్దరమూ కలసియుందము, (అథర్వణవేదము VI I. 71. 72) రజస్వలానుముందు జరిగెడి ఈనాటివివాహమయియుండెనయా వాక్యములకర్థమేమి? గావున వధువువివాహమునాటికి రజస్వలా అయ్యేయుండవలెను.

ఇది యే పూర్వాచారము. సీతకు వివాహము ఈఆచార ప్రకారమే జరిగినది. పూర్వపువ్యాఖ్యాతలు గూడ వివాహమునాటికి సీతకు భర్తతో గాపురము చేయదగిన వయసుండెననియే స్థిరబరచిరి.

మాయారూపుతో వచ్చిన రావణునితో సీతతన యొక్కయు తన భర్తయొక్కయు వయస్సులను జెప్పుట యుక్తమా అయుక్తమా యనునది విమర్శించక శ్రీఆంజనేయుల వారితో జెప్పిన యంశములన్నియు యుక్తముగా నున్నవని శ్రీవ్యాసకర్తలు సమర్థించినారు. హనుమంతునితో అశోకవృక్షము క్రింద సీత జెప్పిన నుడువులలో నొక్కటియైన అయుక్తపదమున్నట్లు గ్రంథమందు గన్పించదు. అయినను వ్యాసకర్తల కెట్లు దోచెనోగాని అవి యన్నియు యుక్తములేయని స్థిరపరచిరి. అవి ఎవరైనా అయుక్తములంటేనా!

మాయావేషధారి యైయున్న రావణుడు అడిగనదేమి? సీత జెప్పినదేమి? III. 46.

15. కాత్వం కాంచన వర్ణాభే
పీతకౌశేయ వాసిని?

31. కాఽసి కస్య కుతశ్చత్వం
కిన్నిమిత్తంచ దండకాన్
ఏకాచరసి కల్యాణి
ఘోరా రాక్షససేవితాన్ ॥

ఈప్రశ్నల కెంత వరకు అవసరమో అంతవరకే ప్రత్యుత్తర మివ్వవలెనా లేదా? అంతకు నధికముగా ప్రసంగించుట సీతవంటి గుణవంతురాలికి యుక్తముగానుండునా? ఇది గౌరవవంశీయులగు స్త్రీలకు దగియున్నదా?

ఇట్టి ప్రశ్నలడుగుటయే గాదు. మర్యాదగల స్త్రీలతో అనరాని పలుకులు గూడ నాడినాడు. (III. 46)

19. విశాలంజఘనంపీన
మూరూకరికరోపమౌ।
ఏతావుపచితౌ వృత్తౌ

సంహతౌ సంప్రవర్తితౌ॥
పీనోన్నత ముఖౌ కాన్తౌ
స్నిగ్ధౌ తాళఫలోపమౌ॥)
20 మణిప్రవేకాభరణౌ
రుచిరౌతే పయోధరౌ
చారుస్మితే చారుదతి
చారునేత్రేవిలాసిని
మనోహరసి మేకాన్తే
నదీకూల మివాంభసా ॥

పరస్త్రీ ఒక్కరితె యుండగా పెద్దమని షైన వాడెవ డైననిట్లు బలుకునా? ఈపలుకుల వలననే వాడెంత పవిత్ర వేషము పైకివేసుకున్ననూ వాని గుణవైఖరి స్పష్టబడగలదు. అటువంటి నీచవాక్కులను బలుకుచున్నపై మొగవానితో సీతవంటి పుణ్యచారిత్రి మాటనైనా మాట్లాడునా? మాటాడిన గౌరవించునా? గౌరవించిన తనయొక్క వయస్సును జెప్పునా? ఈసందర్భములో సీతనుడివిన నుడువులవల్ల సీతయొక్కగరీయతయెంత తగ్గియున్నదో చూడుడి!

బ్రాహ్మణ వేషము లోనుండి వాడుగాన చెప్పకపోతే శపించునేమో యన్నభీతిచే చెప్పెనని ఒక శ్లోకమున్నది.

III. 47. 2 "బ్రాహ్మణశ్చాతిథిశ్చాయ
మనుక్తోహి శపేతమామ్"

చెప్పకపోతె శపించునని భయపడ్డది. ఏమిటి చెప్పకపోతే? వాడడిగినదానికి సరియైన ప్రత్యుత్తరవు కాని అడగనియంశములు చెప్పకపోతే అనిగాదు * రావణుడడిగిన ప్రశ్నలలో సీతవయస్సును రాముని వయస్సునుగోరినది ఒకటైనలేదు. అయిననూ మర్యాద హీనముగా మాట్లాడిన వానితో గౌరవ ప్రవర్తనకు లోపమును గలుగజేయు తన వయస్సును జెప్పుట సీతకు యుక్తముగా నున్నదనుట యెట్లు?

సీత మరియొకసమయములో తనను ప్రశ్నవడిగిన నెట్లు మాట్లాడెనో చూతము. లంకలో అశోకవృక్షమునకు ఉరిబోసుకొనుటకు సిద్ధముగా నుండగా హనుమంతుడు సీతను ప్రశ్నించెను. ఈప్రశ్నలు రావణుడడిగినప్రశ్నలకు సమానములే. V. 33.

3 కానుపద్మపలాశాక్షి
క్లిష్టకౌశేయవాసిని।
ద్రుమస్యశాఖామాలంబ్య
తిష్ఠసిత్వమనిందితే।
... ... ...
కాత్వంభవసి శోభనే.
9 కోనుపుత్రఃపితా భ్రాతా
భర్తావాతేసుమధ్యమే

రావణుడడిగిన ప్రశ్నలకంటే ఈప్రశ్నలు హెచ్చువివరముగా నున్నవి గానిరావణుడు బలికిన అమర్యాద సంభాషణ ఇచ్చటలేదు. మరియు, మహామర్యాద గాను, అతిన్రమతగాను నడిగినాడు హనుమంతుడు. అయినప్పటికి సీతయొక్క ప్రత్యుత్తరువు మాత్రము కించిద్భేదముగా నున్నది. ప్రశ్నలు అడుగువారి గుణముల కనుగుణ్యముగానే యున్నవి. దుర్మార్గుడైన రావణునిప్రశ్నలుదుష్టవాక్కులతోనున్న సన్మార్గుడైనహనుమంతునిప్రశ్నలుమర్యాదతోగూడిన వాక్కులతోను న్నవి. అయిననూ, ప్రత్యుత్తరువు ఇయ్యవలసినది సీతేగాన ఒక్కరీతిని జవాబుచెప్పెను.

---

* (అనుక్తోహి శపేతమామ్, అని మరియొక ఉద్దేశమున అనుకుని యుండవచ్చును. సీత పుణ్యచారిత్రి. వాడు దుర్భాష లాడుచున్నవాడు. గాన అట్టివాడడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పనిష్టములేదు. కాని అతిథిగా వచ్చినాడు. వానికిప్రత్యుత్తరము ఇవ్వకపోతె శపించునని అనుకున్నది. గావుననే తరువాత శ్లోకములో,కొంచెము నేపాలోచించిన దని యున్నది. ఈఆలోచించుట యెందుకో! వాడాడిన పరుష వాక్కులకు కోపమువచ్చి ఆకోపమునణచుకొనుటకు గాదా?

భయపడునా లేదా? అనవసరమైన తనయొక్కయు తనపెనిమిటి యొక్కయు వయస్సులు జెప్పకపోతే శపించునని భయపడునా? గొప్పయింటి పిల్ల, గొప్ప యింటికోడలు. గొప్పవాని భార్య; స్వతహాగా నిష్కళంకమైన గుణగౌరవముగలది? అట్టియామె పరపురుషునితో (ఎంతబ్రాహ్మణుడైనా) పెద్దలను దూషించుచూ తనవయస్సు చెప్పినదనుట యుక్తముగానున్నదా? ఏకాలమందైననూ, ఏజాతియందైననూ కులస్త్రీలు పైపురుషునికి తనవయస్సు జెప్పు నాచారమున్నదా? ఏధర్మశాస్త్రమైననూ నొప్పుకొనుచున్నదా? లోకాచారమైన గలదా?

ఇట్టి గుణహీనతను గలుగజేయు వాక్యములను సీతయన్నట్లు వాల్మీకివ్రాసియుండునా? రామాయణమునందు మరియొచ్చటనైననూ సీత ఇట్లుమాట్లాడినట్లున్నదా? సీతను తనవృత్తాంతము చెప్పుమని యడిగిన వారు మువ్వురు. అనసూయ బ్రాహ్మణవేషము వేసుకున్న రావణుడు, ఆంజనేయులు. అనసూయాదేవి చేసిన ప్రశ్న ఇది:—

24. స్వయంవరే కిల ప్రాప్తా త్వమనేన యశస్వినా
రాఘవేణేతి మే సీతే కథాశ్రుతిముపాగతా॥
తాంకథాం శ్రోతుమిచ్ఛామి
విస్తరేణచ మైథిలి
యదానుభూతం కార్త్స్న్యేన
తన్మేత్వంవక్తు మర్హసి॥

సీతా! మహాకీర్తిమంతుడైన రాముడు నిన్ను స్వయంవరమున బొందెను గదా. ఈసంగతి నేను వినియున్నాను. మైథిలీ ఈకథనంతయు సవిస్తరముగా వినగోరుచున్నాను. కావున జరిగినది జరిగినట్లుగా దానినంతయు జెప్పవలయునని యడిగెను.

---

...కు ఇచ్చిన ప్రత్యుత్తరములో వివాహ

* (అనుక్తోపి) చెప్పవలసివచ్చె. తోటి స్త్రీ వాడు దుర్భాష అట్టియామె తోనె "పతిసం ఆతిథిగా వచ్చినాడ్వా మే పితా చింతామభ్య శ్లోకములో చెంచె. పరుష వాక్యములకు

గమద్దినో విత్తహానాదీవాధనః అనిగుభానముగా పెమిటితో గలయుటకు దగినవయస్సు కాగానే యని జెప్పినది. అవయస్సింతయనియే జెప్పలేదు.

తరువాత ఆంజనేయులవారు సీతను వృత్తాంత మడిగినవారు. వారితోనూ తనవయస్సింతయని జెప్పలేదు. యోగ్యులు సాధువులు మర్యాదస్థులు అయినవారితో అనవసరమైనను వయస్సు జెప్పలేదు. అయోగ్యుడు అమర్యాదవాక్యములను బలుకుచుండువాడు అయినరావణునితో పెద్దల నిందించుట తన వయస్సుజెప్పుట మొదలైన హీనవాక్యములు బలికినట్లు వాల్మీకివంటి కవి వ్రాయునా? వ్రాసిన యొకచో వ్రాసి మరియొకచో వ్రాయకుండునా, రావణునితో చెప్పిన (అష్టాదశవర్షాణి మమ జన్మని గణ్యతే; యనువయస్సులో (ఉషిత్వా ద్వాదశసమా, అనుశ్లోకములలో చెప్పబడి రెండువత్సరములు తీసివేయగామిగిలినవి ఆరేండ్లేకదా! యనసూయతో చెప్పనప్పుడు ఆరేండ్లవయస్సుదానను కాగానేయని యేలవ్రాయడు. వాల్మీకికి గణితము తెలియదేమో:

మరియు రావణునితో జెప్పినని యున్న శ్లోకములలో 8 1/2 మొదలు 11 1/2 వరకూ (బ్రాకెట్టులో జూపినవి.) వదలి జదివినను కథాసందర్భము చెడదు. ఇంతేగాదు దశరథుని దూషించు వాక్యములు నైతముండవు. బ్రూయాత్కించి ద్విప్రియమ్ ఇది రాముని దృఢవ్రతముగదా! అట్టివాని భార్యామాత్రంఅప్రియమును బలుకునా? అందులో పూజ్యులైన మామగారినిదూషించునా? గావున ఈశ్లోకములు మొదటికవివి గావని స్పష్టపడుచున్నవి. వీటిని తొలగించుటవలన నష్టమేమీలేదుగాని గ్రంథమునకు శుద్ధికాగలదు. ఇట్టి అసందర్భములు చూచియే శ్రీవైద్యాగారు దిరిడిల్ ఆఫ్ రామాయణ (The Riddle of Ramayana) లో బాల్యవివాహములకు ప్రమాణములకు జూపుటకై యొకరిచేతనో యిటీవల మార్చబడిన శ్లోకములని యన్నారు. వైద్యాగారే కాదు. ఈర్ష్యలేని

హృదయముతో జదువు వారెవరైననూ యీమాట అనక తీరదు.

ఇట్టిదూర్వ్రుడుశ్లోకములెన్నియో రామాయణమం దున్నవి. వీటివల్లనే ఆగ్రంథముయొక్క యథార్థము కప్పివేయబడియున్నది. నిజమైన దేశాభిమానుల ట్టివాటిని తొలగించి గ్రంథమును శుద్ధిపరచి యథార్థమును వెల్లడిచేసి మనదేశమునకు ప్రఖ్యాతి తేవలెనే గాని వాటినేబట్టుకొని అవే యథార్థములని సాధింప ప్రయత్నించుట వల్లలాభము లేదు. విరుద్ధవాక్యము లెన్నియో యుండుటచేతను లోకాతీతములైన సంగతు లెన్నియో యుండుటచేతను రామాయణగ్రంథమందు చెప్పిన కథ నిజముగాదనియు అందు చరిత్రాంశము లేశ లేవనియు అనేకమంది విద్వాంసులు కొట్టి వేసినారు. ఇందువలన గ్రంథమునకు గలముఖ్యత చెడినది. అట్లుగాక దానిలోనుండు నిజమును బైటబెట్ట ప్రయత్నము దేశాభిమానులందరును చేయవలసినదే. నిజమును బైటపెట్టుటవల్ల మన మతాచారముల కెట్టి లోటులేదు. పైగా గౌరవముహెచ్చును. ఏమనగా సత్యమే బ్రహ్మము. ఓం తత్సత్.



# వసంతకోకిలము.

—:o:—

( అనంతపంతుల రామలింగస్వామిగారు. )

శా॥ మౌనీభావ మహౌ వ్రసని తేలఁ బ్రమటిలో మోమోటమానీక నీ
వేకాంతంబున వృక్షశాలల భయమో- యుంపైనసీ గానమీ
లోకుల్వింట రుప్పదో- పలుకుమా లోకైకసమ్మోహన
శ్రీకంఠస్వర మొత్తి నా మనవి జెల్లించుమా కోయిలా!

క॥ పలుగాకులతో లోకం బలరుట నేకాంతవాస మతి యోగ్యముగా
దలఁచుచు వృక్షాగ్రమునన్ దలదాచుకయుంటివో ముదంబునఁ బికమా!

ఉ॥ కాకులలోనఁ గాకివయి కాటుకవన్నియఁ గల్గినిల్వనిన్
లోకులెఱుంగు టెట్టు లిలలోపలఁ బాచమ సుస్వరంబుతో
నీకలకంఠ మెత్తి సుధనించెడు గానముఁ బూనుమంతటన్
కాకి నిసుంగ దేదో, కలకంఠమదేదియొ తేటతెల్లమౌ!

ఉ॥ నీయమృతాభగానమును నేవిని చిన్నతనంబు నందునీ
వేయెడనోకనుంగొన మహీరుహముల్గని కాంచలేక కో
కోయని నేను కూయుటను కోయనిహాయిని గూర్చుచుంటి, వా
తీయనికంఠ మిప్పుడలఁ దిరుబడె గాకటు పల్కరింపగన్!

క॥ నవరస పోషిత జీవనము వసంతాశ్రియముఁ గలిగి మోహన మగునో
నవకవితాకలకంఠమ! ప్రివసంతపికంబు బదులు పలుకఁ బలుకుమా!

చ॥ పలికితె కోయిలా! విబుధవర్ణిత కీర్తి విరాజితాస్యతో
తక్కలితమ్ము దూక్తి నాతతి సుధామయ భాస మరున్నవాంకురం
బులఁజిలియించు నవ్యరస పూర్ణము గానదళీవిచికాశిర
స్థలమున ఫేనఖండ సదృశంబుగనన్ నటియింపఁ జేయుచున్॥

క॥ కల, కల, కలయని యీయమ్మాకర్ణించి కీదవాతత్వ మెఱుక పడెనఖిల జగం
బులు, బరభృత నినదగా నెందలరగనిను మాత్రమంట యదికల మెసుమా!

క॥ అమరగఘుస్త్రాహైన న్యాయ్యముగ రసంబమరెనొకట నంమరో యనుభా
వముఁ గొని మున్మారటులే యమృతము మరుతమును జలిపి యులరె దోపికమా।

క॥ నీకలగానము కన్నన్ బ్రాకటముగ మించిపాడు వారరయఁగ భూ
లోకములో నాకములోఁ గోకోయను చదిగదీవా కో.. కోకిలమా!

క॥ అలవిష్ణుపదము నారసెదు విలారుహము నెక్కి-మూచితే! మాధవునిన్
గలఁడు, కలండని, కలఁడని కలరూతమునఁ బలుకి నేను తెత్తెనో పికమా!

క॥ వనరమకును మాధవునకు ఘనతర కల్యాణమగును గావున రండో
జనులార! యావినోదము గనుడను చెలుఁగెత్తి పిలువగా వచ్చితివో!

క॥ వాచాలత నీచంబని యోఁచగమిత భాషణంబులో మన్నటకునా
లోచించి కొసరిపాడెదో మేచకనిచయమున నా అుప్పుటానెదు లీలన్॥

గీ॥ దివ్యశారీర మాధురిఁ దేటపడగ । వసుధ జనులకు దెల్పఁగ వచ్చినట్టి
వన్యదివి దూతవంచుఁ గర్ణాను మోద। నవసుధానార కలితగానంబు వినుము

మ॥ నవచూతాగ్రము నెక్కి-పిక్కన, వసంతావాసము న్జేసెనన్,
జివురుంగొమ్మలఁ జేరి పల్లవము నింతే నొక్కినన్ గిన్కగ
న్నవనత్యాంతము నెల్లఁ జేసినదిగాకం బొందఁగాఁ జాలునే
భవదీయాద్భుత మాధురీ కలితదివ్య స్వారగానాద్భుతిన్।

క॥ కవిభృతమాన సనరసీ ప్రవిమల కల్లోల కవితభావ జపమా
భవదీయమధుర గానము సెప్పలంబడ మోగ్రిడులైనఁ జిప్పరించుఁ గదే!

చ॥ సరసులు కల్గుచోటు, సురసంబులు గ్రాలెడుచోటు, పద్మినుల్
కరమలగారుచోటు, గణికామణు లొప్పెడిచోటు, పల్లవ
స్ఫురితము లైనచోట్లు, మధుచోయులు ద్రిమ్మరుచోటునా వనాం
తరమిరవౌట నీకిటు సుధామధుర స్వరమబ్బెనే మోకో!

మ॥ చివురుం గొమ్మలపల్లవాధర రసశ్రీనానుటన్ లోకసం
స్తవనీయంబగు గాన కౌశలమహత్వం బబ్బెనో నీకు, కే
కవసంత ప్రథితైక సంగతిని రాగాలాప మింపొంది తో
నవనవ్యామృత సద్రసాక్తమగు గానంబూని మారాడుమా!

మ॥ నలువౌ రాగముఁ గల్గుఁ గొమ్మలలపున్నాగంబు లెన్నన్దమిన్
దలలూపున్ మధుపాళి మత్తిలెడు, మోదాంభోధి నోలాడిరం
జలు నెంచన్ గవిసంచయంబు, సుమనశ్శ్రీ మంత్ర సంపూతని
ర్మల మాతావకగాన కూజితస మీరస్పర్శ మూలంబునన్॥

క॥ రూపముగలిగిన సద్గుణ మోపనిచో విఫలమందు; నొగి హేతుంబౌ
రూపమునొందిన సగుణ సురూపిణివి యగుటను సురూపిణి కావే।

చ॥ కనఁగఁ జరాచరాత్మక జగంబుననిండియు నందునందు నిం
పొనరనిజాంశ మొందఁ ఖిలముంచుచు లీలఘటించు నీశ్వరుం
డనుటఁ బత్రిలోకమున నాతని గానకళావతారమౌ
చనియెదఁ గోయిలా! నిను; నవామృతసారము నించి పాడుటన్.

మ॥ కనులన్ రాగము, కర్ణపేయమగు నీగానంబునన్ రాగమున్
మనునాహారమునందు రాగము, వసంతప్రాప్తినై రాగమున్
వనితాపాంథగణాను రాగరచనా ప్రాచుర్యవ ద్రాగమున్
గని రాగాత్మక దివ్యరూపవనినిన్ గామింతునో కోయిలా!

గీ॥ నీలమణి నీలవర్ణునో పాలుఁజెంచుల భువనమోహను డయ్యెనో పౌనరనటుల
రాగమయుఁడయ్యె నత్తువిరాగు డగుచు నోపికమ నీవునటులగుచుందువందు॥

ఉ॥ పాదపవాసమున్, మృదులపల్లవభక్షణ, మంబుపానమున్,
మోదవికీర్ణ మానసము, మోహనమాధవ సన్నిధానమున్,
ఖేదము యామణత్రియ వినిర్జితజీవనమున్ జెలంగ సిక్
నాదు మదిన్ దలంచెద ననారతమింక విరాగమూర్తిగాన్॥



# భద్రాచలయాత్ర.

(పెద్దిభొట్ల వీరయ్యగారు బి. ఏ., బి. యల్.)

గోదావరీనదీతీరమందు దండకారణ్యమధ్యమున శ్రీభద్రాచల క్షేత్రముగలదు. శ్రీరామచంద్రుడు సీతా లక్ష్మణ సమేతుడై భద్రగిరియందుండుటయు సుప్రసిద్ధభక్తులగు కంచర్ల గోపన్నగారను రామదాసుగారు ప్రస్తుతము భద్రాద్రియందుండు దేవాలయమునకై విశేషము సొమ్ము వెచ్చించిన సంగతియు నెల్లరకు విదితము. ప్రతిసంవత్సరము చైత్రశుద్ధ నవమినాడు శ్రీరామ కళ్యాణోత్సవమతివైభవముతో జరుగుటయు వేనవేలు యాత్రికులప్పటున నచ్చటికిబోవు చుండుటయు ననేకసంవత్సరములుగా జరుగుచున్నది. కాని యీ క్రోధనసంవత్సరమునగత (ఏప్రిల్ 2 తారీఖున) జరిగిన శ్రీరామనవమి మహోత్సవమునకు భద్రాచలమునకు వచ్చిన యాత్రికులసంఖ్య యపరిమితమై యుండెను. ఈ సంవత్సరము కాలమానము చక్కగనుండి కలరా మొదలగు జాడ్యములు దూరమగుటచేతను ప్రతి గ్రామమునకు రైలుస్టేషను 50 మైళ్ల దూరములోనుండినను ఫోర్డు మోటారుబండ్ల సౌకర్యమును బట్టి మారుమూలలనున్న ప్రజలుసహితము యాత్రకుబోవుటకెక్కువ అవకాశము గలుగుటయు బొగ్గుగనుల ప్రదేశమగు సింగరేణి ప్రాంతమున భద్రాద్రివరకు కొంతదూరము రైలు కొంతదూరము మోటారు బోవుచుండుటయు యాత్రికులకెక్కువ ప్రోత్సాహమునకు గారణములయ్యెను. రైలుమోటారుల సౌకర్యములు హెచ్చినకొలది యాత్రికులు భద్రాద్రి కపరిమితముగ బోవుట కెక్కువ వీలుగలుగును.

ప్రస్తుతము భద్రాచలమునకు నాలుగు మార్గములు గలవు. రాజమహేంద్రవర ప్రాంతమువారు గోదావరి మీద స్టీమరులోను బోట్లలోను పయనమగుచుందురు. పాపికొండల సందున గోదావరివైశాల్యము మిక్కిలి తక్కువగుటచేత గాలి విపరీతమైనచో నచ్చట పడవలు రాతికి దగిలి బద్దలగుట కవకాశముగలదు. కాని యీప్రయాణము శరీరమున కాయాసములేదు. నదిలో నీరు తక్కువగుటచేత స్టీమరు ప్రయాణము సుకరముగాదు. ఏలూరు చింతలపూడి ప్రాంతములజనులు చింతలపూడి అశ్వారావుపేట మార్గమున అరణ్యములోనుంచి భద్రాద్రి చేరుదురు. బెజవాడకు దక్షిణమున పశ్చిమమునమున్నవారు ఎర్రుపాలెం రైలుస్టేషను దగ్గర రైలుదిగి బండ్లమీద తిరువూరు మీదుగా నరణ్యములోనుంచి పోవుదురు. నాల్గవ

మార్గము సింగరేణిబొగ్గుగనుల వద్దనుంచి బండ్లమీద నరణ్యమున బోవలెను. ఇచ్చటనే మోటారుబండ్లు నూతనముగా నడుపుచున్నారు. బెజవాడనుంచితిరువూరువరకు రోడ్డు గలదు. కొండపల్లి మీదుగా మోటారులచ్చటికి బోవుచున్నవి. బెజవాడ కనుకొండపల్లికిని 11 మైళ్లుదూరము. కొండపల్లినుంచి తిరువూరుకు 39 మైళ్ళుదూరము. తిరువూరుకు భద్రాచలమునకు 48 మైళ్లు దూరము. ఇందుమూడు వంతులరణ్యము. అరణ్యములో నొక్కబండిమాత్రము పోవుటకు దగినవెడల్పుగల మార్గముండును. అరణ్య మంతయు నైజాం దొరతనము వారిది.

గోదావరికిని త్తర భాగమున భద్రాచల మున్నది.

భద్రాచలం తాలూకాకాశనివారప్పేట జమీందారులగుశ్రీరాజా పార్థసారథిఅప్పారావు బహదరు జమీందారుగారికి జెందియున్నది. ఇదియేజన్సీ, అనగా; మన్నెపు ప్రదేశములోచేరినది. భద్రాచలంలో బ్రిటీషువారి కచ్చేరీలుపోస్టుఆఫీసు టెలిగ్రాఫుఆఫీసు ఆసుపత్రి గలవు. ఇచ్చట నుండు తహస్సీలుదారొక్కడేసబురిజిష్ట్రారుశిరస్తదారుమేజస్ట్రీటు హెడ్డుఅక్కౌంటెంటు మొదలగు పనులనిర్వహింపుచుండును. వీరికి రవిన్యూ సివిల్ అధికారములు కూడా గలవు. దేవాలయము మాత్రము నైజాం ప్రభుత్వము వారిపాలనలోనున్నది. అమీల్దారుగారు దేవాలయమును గురించినపనులు నైజాంగారి తరపున నెరవేర్చుచుందురు. దేవాలయము వద్దనుభయరక్షకభటులుప్రత్యేకము స్వామి దర్శనమునకై యాత్రికులు పొందు పరియా నను వర్ణింప నలవికాదు. శిఫారసుగాని ధన వ్యయముగాని లేనిచో వెళ్ళినదారిని స్వామి దర్శనములేకుండ నింటికి తిరిగిరావలసినదే. అటుల వచ్చినవారిలో మామిత్రులగు కొంభొట్లుగా రొకరు. రక్షక భటులకును యాత్రికులకును దేవాలయముకడ నుత్సవ కాలము లందుజరుగు సంఘర్షణము ఘోరముగ నుండును. క్రిందబడువారిలోను దెబ్బ లుతినువారిలోను యాత్రికులురక్షక భటులును గలరు.

భద్రాచలమునకు నుత్తరముగ 22 మైళ్ళ దూరమునపర్ణశాలగలదు. అచ్చటికి బోవుబాట తక్కువవెడల్పు గలదగుటచే బండ్లుతలకిందగుట గలదు. అచ్చట ముఖ్యముగసీతాదేవి యుండిన ప్రదేశమును ఆమె యారవేసిన చీరెయుండుప్రదేశము మొదలగు వాటిని జూడవచ్చును. భద్రాచలమునకేగు యాత్రికులలో నెక్కుడు పర్ణశాలవరకు బోవుచుందురు. భద్రాద్రి కాగ్నేయమున 5 మైళ్ళదూరమున ఉష్ణగుండములు గలవు. గోదావరినదిలో నిసుక ప్రదేశమందు 6 అంగుళములోతున చలమదీసి యచ్చటనుంచి చెంబులతో నీరు చేదుదురు. ఆనీరు మిక్కిలి వేడిగనుండి గంధకపువాసన గలిగియుండును. పూర్వము యాత్రికు లిష్టము వచ్చిన రీతి నూతినీరు దీసికొనెడివారు. తర్వాత చెంబుకు అణాచొప్పున జనసమ్మర్దమైనదినమున చెంబు కణాచొప్పున జనులెగబడి యొకరినొకరుత్రొక్కుకొని త్రోసికొనిమిక్కిలికష్టముతో వేడికేటిని సంపాదింప గలిగిరి. కొందరికి గుండమును చూచుటకేయవకాశము కలుగలేదు. వేడినీరుచిక్కకనిరాశజెందిన యాత్రి

కుల గొందరఁ జూచితిని. అచ్చటికి ఫర్లాంగులోనున్న గోదావరినీటిలో యీ వేడినీరు గలిపి జనులు స్నానము చేయుదురు. కొందరు వేడినీటిని శిరస్సున చల్లుకొని స్నానము చేయుదురు. ఉష్ణగుండములనుంచి గోదావరియొడ్డున కెక్కుచోట పెక్కు గుండ్రాళ్ళు చిన్న రాళ్ళు గలవు. యాత్రికులు తీసికొనిపోగలిగినన్ని రాళ్ళను గైకొందురు. ఆరాళ్లు నునుపుగ నుండును. అందు కొన్ని మిక్కిలి మనోహరముగ నుండును.

భద్రాచలమునందు నూతులులోతు. ఘోరోదకము. గోదావరినుండి మంచినీరు నెల్లరు దెచ్చికొనవలెను. తిరుపూరుబాట చాపరాల పల్లి నూతిలో జలముతప్ప మిగిలినచోట్ల సరియైన దాహోదకము లేదు. కాలి నడకను, బోట్లను, మోటారులలోను, వచ్చినజనులుగాక బండ్లమీద వచ్చిన జనుల సంఖ్య కూడ హెచ్చుగ నున్నది. కొన్ని వేలబండ్లు గోదావరికిద్దరిని నద్దరిని యుండెను. చెట్లనీడ లేక యేయొడ్డ లెండకు బడెడు కష్టమునకు కాళ్లక్రింద కాలుచున్న యిసుక తోడ్పడ జూచువారికి వేదన కలిగించక మానదు. యాత్రికులకు భోజన సౌకర్యమునకు సత్రములున్నవి కాని నోరులేని జీవము లెండకు ఘోషిల్లుచుండ వాని యిబ్బందుల దప్పింప నెట్టి ప్రయత్నము జరుగకుండుట శోచనీయము. గోదావరి యొడ్డున ధార్మికులు చెట్లను వేసి పెంచి పుణ్యము గట్టుకొనగలరని నమ్ముచున్నాను. నర్సారావుపేట ప్రాంతములకు జెందిన కీర్తిశేషులగు పైడిగంటం వెంకట్రామయ్యగారు యాత్రికులకై యనేకవేల ద్రవ్యమును వెచ్చించి భద్రాద్రిలో పెద్ద ధర్మసత్రమును గట్టించియుండెను. ఈ సత్రములో 15000 రూప్యముల పాత్రసామాగ్రిగలదను నప్పుడు దీని యుపయోగమును వర్ణింపవలెనా? ఇప్పుడు ఈసత్రమును నైజాము వకీలు తుంగతుర్తి నరసింహారావు పంతులుగారి యాజమాన్యముక్రింద నడచుచున్నది. ఇదిగాక గోదావరియొడ్డున భద్రాద్రిలో కొంతకాలము పోస్టుమేస్టరుగ కొండముది వరదయ్య పంతులను వారుండిరి. ఆయన నాకు బాల్యమిత్రుడు. ఆతడు విశేషధనము ఖర్చుబెట్టి సత్రమును గట్టించెను. వీరు ప్రతిసంవత్సరము స్వయముగ శ్రీరామనవమి నాటికి భద్రాద్రి చేరి సత్రమును నడుపుచున్నారు. స్వల్పజీతము దెచ్చుకొనువారైనను మిక్కిలి శ్రమచేసి కొన్ని వేలు స్వంతద్రవ్యమును వినియోగించిన వరదయ్య పంతులుగారి త్యాగశీల్యములను వర్ణింప నాతరముగాదు. ఈ సత్రమునకు ప్రహరీ నిర్మాణ మవసరము, త్యాగశీలురు శ్రీ వరదయ్య పంతులుగారికి దోడ్పడి పనిని పూర్తిచేయించగలరని నమ్ముచున్నాను. గోదావరి మిక్కుటముగ వచ్చునప్పుడు సత్రము తలుపులు తీసియుంచబడును. ప్రవాహము సత్రములోనుంచి పోవుచుండును. అందువలన పునాదులకు జాల వ్యయమైనటుల దెలియుచున్నది. మంగళగిరిభక్తురాలగు బాలాంబగారు ఈ సత్రమును మొలకలపల్లిలోని సత్రమును నిర్వహించుటకు మిక్కుటముగ దోడ్పడుచున్నటుల దెలియుచున్నది. భద్రాద్రియందు లక్షలకొలది వచ్చినజనుల సహాయమునకై తగు కూరగాయలు పెరుగు దగ్గరపల్లెలనుంచి వచ్చుచుండును. వీధులు పరిశుభ్రముగ నుంచుటకై మంచి ప్రయత్నములే జరుగుచున్నవి. ఈ దినములలో ఆ కాంపౌండ

రునకు పని యధికము. బండ్లతోలాల వలన దెబ్బలుతగిలినవారికికట్లు గట్టుటయందు వీరికి తీరిక లేదు. అరణ్య ప్రాంతమునకు జెందిన ప్రదేశమగుట చేత భద్రాద్రిలో తయారగు వస్తువులేమియులేవు. అచ్చట చూచువస్తువు లన్నియు మన బస్తీలనుంచి పోవునవి.

సాధారణముగా నుత్సవ సమయమందు నాటకశాల వారికి పని గలుగు చుండును. అట్టి తొందర భద్రాద్రిలోను గలదు. తిరుపతి భిక్షుకులెందరో గోదావరి యొద్దనుచేరుదురు. బిచ్చగాండ్రు, మాగ్గలివాండ్రు మంత్రముచెప్పెడిబ్రాహ్మణులు గోదావరి పొడుగున వ్యాపించి యుందురు. స్వామి వారి కళ్యాణమునకై వచ్చిన యాత్రికులు పెక్కండ్రు తీర్థవిధుల దీర్చుకొనుచుందురు. సంస్కర్తలగువారు కొందరు జనసమూహ ముండుచోటును విడిచి దూరముగ స్నానమున కేగుట గలదు. అట్టి చోట్ల మడుగులుండును. ఇరుపురు మొసళ్ల కాహారమగుట విచారకరము. ఈ సంవత్సరము జనులు విపరీతముగ వచ్చుటవలన నిలుచుటకు తావుచిక్కలేదు. ఒకొక్కగదికి 40—60 రూప్యముల వరకద్దె నిచ్చి మూడు దినములుండిన వారుగలరు. నాకు మిక్కిలి కష్టముమీాద రెండుగదులు 20 రూప్యములకు దొరకెను. అష్టమినాటి సాయంకాలమునకు భద్రాద్రిలో ప్రవేశించితిమి. ఆరాత్రి గోదావరినుండి యుదకము రావలసి యుండుటచేత నూతనస్థల మగుటవలన నుపవసింప వలసి వచ్చెను. మరునా డుదయమున లేచి గోదావరి కేగి స్నానమాచరించి యచ్చటి యుద్యోగస్థులతో దేవాలయమున కేగితిమి. కాని మూవరి శిఫార్సుతో వచ్చినవారేక్షకొన్ని నందలగుట చేత స్వామిదర్శన మగుటకుమూడుగ జనసమ్మర్దమునుండి కొన్ని గల్లితాలతో పిల్లలు, స్త్రీలు, పురుషులు నాలయములోపలికి నెట్టబడి తుదకు తృప్తికరముగ స్వామిదర్శనము లేకయే వెలుపల బడగలిగితిమి. ఈ సమయమందు పోలీసువారును, అర్చకులును కొంత మందిని తీసికొనివచ్చి దేవాలయము లోనికి నెట్టుచుండిరి. లోపలనున్న వారి కుక్కిరిబిక్కిరియగుటయు నచ్చటగొన్ని ముష్టియుద్ధములు యాత్రికులలో యాత్రికులకును యాత్రికులకునర్చకులకుజరుగుటయుగలదు ఇచ్చటి యేర్పాటులుమిక్కిలియును తృప్తికరములుగా నున్నవి. తిరుపతి మొదలగు క్షేత్రములలో వలె చివరమజిలీలో తొక్కిడికి నవకాశము ను తగ్గించుటకు మారుగ నిచ్చట త్రొక్కిడియంతయు గర్భాలయములోనే యుండును. ప్రభుత్వమువారు తగుజోక్యము కలిగించుకొని యీ విషయములో యాత్రికుల సౌకర్యములు జూడనియెడల ప్రజలలో నసంతృప్తిహెచ్చును. నూటికి 75 మంది యాత్రికులు స్వామిదర్శనము చేయకయే భద్రాద్రి నుండి తిరిగివచ్చుచున్నారన్న యతిశయోక్తి కాదు. వీరందరు కళ్యాణోత్సవముతో దృప్తి చెందుచున్నారు. ఇదివరలో కళ్యాణోత్సవము దేవాలయ ప్రాకారములోపల జరిగి ప్రజల కిబ్బందిగానుండుటచేత నిప్పుడు నెలువలకొండపైన పందిళ్లువేసి యచ్చట కళ్యాణము జరుపుట వలన లక్షజనము నకు పైగా నలుదిక్కులనుండి చూచుటకు వీలుగానుండెను. ఉదయము 6 గంటలనుండి

మధ్యాహ్నము 12 గంటలవరకు నెండలో కాలుచున్న బండలపై జనులు నెత్తి కాచ్ఛాదన లేక యేత దేకనిష్ఠతో కల్యాణమును జూచుటకై యోపికతో నుండుటను చూచితీరవలెను. లక్షకు మించిన జనమిట్లొక్క చోట ఒక్కభావమునను నుండుటను శ్రీరామనవమినాడు భద్రాద్రియందు దక్క మరెచ్చట చూడజాలము? కొందరు కల్యాణమంటపము సమీపమునకు బోవలెనని నెట్టుకొని పోలీసువారి ప్రహారములకు లోనగు చుండిరి. కల్యాణ మంటపము సమీపమున ప్రత్యేకము పందిళ్లు శిఫార్సు గలవారికి ఉద్యోగస్థుల కేర్పడియున్నవి. నా కట్టిచోటునకు బోవ నవకాశ ముండినను స్త్రీలు బిల్లలతో జనసమూహము నుండి యటకు జేరుట కష్టముగదోచి దక్షిణమున చిత్రక దనుండి కల్యాణమునుజూడగలిగితిని. ఆమహాజనములో నాకు తెలిసినవారు వేయింటి కొక్కరైన నున్నారననుకొనజాలను. దక్షిణమునకనిగిరి కావలి పల్నాటినుండియు పశ్చిమమున హైదరాబాదు ప్రాంతములనుండియు అనేక వేలజనులువచ్చియుండిరి. వీరిలో కొందరు ధార్మికులు పిప్పరమెంటుతొనలు డబ్బాలతో తెచ్చి పంచిపెట్టిరి. కొందరు పటిక బెల్లము ముక్కలనిచ్చిరి. తలంబ్రాలైన వెంటనే కొందరు బుట్టలతో నా బియ్యమును అణాకు 20 గింజలచొప్పున విక్రయమునకు గడంగిరి. ఇంతదూరము యాత్రకేగినవారు తలంబ్రాలుకొనుటకు వెనుకాడరు గదా ?

కల్యాణోత్సవమై స్వామిని గుడిలోనికి దీసికొనిపోయినంతనే యాత్రికులలో కొందరు తిరుగుముఖ మగుదురు. కొందరు పర్ణశాలకును, మరికొందరు ఉష్ణగుండముకు బోవుదురు. ప్రతిదినము సాయంకాలము ఉత్సవములు జరుగుచుండును. ఆ వేడుకలు జూడదగియున్నవి. దశమిరాత్రి రథోత్సవముజరిగినది. ఇచ్చటి రథము మిక్కిలి చిన్నది. ఉత్సవములప్పుడేమి యితరసమయములందేమి భజనమండలులను విశేషముగ చూడగలము. భక్తితాండవ మాడుచుందురు. స్వచ్ఛంద సేవకుల లేమివల్ల కొన్ని నివారింపదగిన యిబ్బందులు యాత్రికులకు గలుగుచున్నవి. రాచకీయమునకు సంబంధములేని మతసేవకులు కొందరు సంఘముగ నేర్పడి యట్టియిబ్బందుల నివారింపవచ్చును.

శ్రీరామాలయములో చుట్టును చిన్న చిన్న ఆలయములు గలవు. అందు దశరథుడు, వాల్మీకి, గోపాలస్వామి, నరసింహస్వామి రామదాసు మొదలగు వారివిగ్రహములున్నవి. ఆంజనేయులవారియాలయము ప్రత్యేకముగ పశ్చిమ భాగమున గలదు. వాహనశాలయు నుత్సవవిగ్రహముల మందిరము జూడదగియున్నవి. ఏకాదశినాడు మిట్ట మధ్యాహ్నము స్వామిని దర్శించుటకు వీ[illegible]నని భ్రమపడి పోలీసువారు మొదలగువారి నాశ్రయించి శిఫార్సు గొనిపోవువరికి నందరును మావలె విరామముండునని యాశపడి వచ్చినటులగన్పించెను. నిలుచుటకైన యెడము లేదయ్యెను. అట్టితరి స్వామిని దర్శించుటెట్లు? చివరకు మిక్కిలి ప్రయత్నముమీద కష్టముతో మా మనుష్యులలో గొందరు వెనుకబడినను స్త్రీలును, పిల్లలును లోపలకు బోగలిగితిమి. స్వామిని పూజించి దర్శించు భాగ్యము లభించినది. అంతట ప్రసాదము గైకొని బ్రతుకు జీవుడాయని

మార్గమధ్యమందలి జనులను తప్పించుకొని వెలుపలకు రాగలిగితిమి. ఈ విషయములో మాకు సహాయపడినవారికి మేము కృతజ్ఞులమై యున్నాము. మత కృత్యముల నెరవేర్చుకొని ఏకాదశినాడు సాయంకాలము గోదావరిదాటి తిరుగుప్రయాణము ప్రారంభించితిని. దశమినాడుదయమున నుష్ణగుండమున కేగితిమి. ఎండ వేడికిని ప్రయాణమునందలి బడలికకును డస్సి పర్ణశాలకు పోజాలనందుకు చింతించుచున్నాను. నా మిత్రులగు శాంభోట్లుగారు మిక్కిలి కష్టములకోర్చి భార్యా పిల్లలతో పర్ణశాలకు గూడ పోగలిగిరి. భద్రాచలమునందు శ్రీ పార్థసారథి అప్పారావు బహద్దరుగారి కచ్చేరి సావిడి దేవాలయమునకు చేరువుననే యున్నది. అచ్చట కొంతతడవు లౌకిక వ్యవహారములో మేము కాలక్షేపముచేసి భద్రాద్రి ప్రయాణమువల్ల పుణ్యమును పురుషార్థమును సాధించగలిగితిమి.

ఇక నా ప్రయాణవివరమును సంగ్రహముగ దెలిపి నా భద్రాచల యాత్రను ముగించుచున్నాను. బెజవాడ నుండి అర్ధగంటలో కొండపల్లికి రైలుమీద వెళ్లి అచ్చట ఉదయం 5 గంటలకు మోటారు ఎక్కి 8 గంటలకు తిరువూరు చేరితిమి. అచ్చట సాయంకాలము 5 గంటలకు బయలుదేరి మరునాడుదయము 8 గంటలకు 26 మైళ్ల దూరమున నున్న చాపరాలపల్లికి చేరితిమి. రాత్రి యడవిలో కొంత దారితప్పితిమి. తెల్లవారి వంసాపురము దాటినతర్వాత అడవిలో రెండు భర్తీబండ్లు ఎదురువచ్చుటచేత ముందుబండ్లుపోవుటకై మేము మొరక ప్రదేశమునకు తప్పుకొన మొరక నెక్కుటలో బండి తిలక్రిందై మాకుకొంత దేహశుద్ధిగలిగినది. అపాయముగాని, గాయముగాని తగుల లేదు. చాపరాలపల్లి నూతినీటిని వర్ణింపజాలను. అరణ్యమధ్యమందట్టి జల మెటులగలిగెనో? అచ్చట గుంటూరి సూర్యనారాయణగారను భక్తులొకసత్రము నేర్పాటుచేసి అన్నివర్ణముల వారికి నన్నమిడిరి. చెట్లక్రింద బండ్లుదించుకొని యచ్చటనే వంటలు చేసుకొనువారు చేసికొని సాయంకాలము 4 గంటలకు ప్రయాణమై 9 మైళ్లలోనున్న మొలకలపల్లికి రాత్రి 8 గంటలకు చేరితిమి. అచ్చట కీర్తిశేషులైన మల్లాది సుబ్బదాసుచే నిర్మింపబడిన సత్రముగలదు. దానికి బెజవాడవర్తకుడైన కూనల పున్నయ్యగారు ప్రతి సంవత్సరము సత్రముజరుగగలందుల కేర్పాటుచేసియుండిరి. ఆ రాత్రి యాసత్రమునందుండి తెల్లవారుజామునబయలుదేరి పగలుపదిగంటలకు బూరుగుమ్ములపాడు చేరితిమి. అది గోదావరికీవలనున్నది. అచ్చటనుండి భద్రాచలము కనుపించెను. మూడు మైళ్లుండును. బూరగుమ్మల చేరుటకు బూర్వము కిన్నరసానివాగు అను పెద్దవాగొకటిగలదు. ఎద్దులుప్రయాసతో దానిని, గోదావరిని, దాటవలసియున్నది. బూరగుమ్ములపాడులో నైజాం తహశీల్దారుండును. అచ్చటికి చేరునప్పటికే ఎండ తీవ్రముగుటచే నాయూరనే బసచేసి సాయంకాలము గోదావరిదాటితిమి. గోదావరిలో బండ్లుదిగుచోట 20 గజముల లోతుండును. బండిచక్రమునకు కమ్మికి తాకు అంటగట్టి బహుజాగ్రత్తతో [illegible] దురు. ఒక్కొక్క బండిదాటుటకు [illegible]

చాల కాలవిలంబన మగును. గోదావరిలో పెద్దవారికి నడుములపైవరకు నీరు వచ్చును. అందుచేత కొంతదూరము ముఖ్యముగ స్త్రీలు పిల్లలు జోట్లమీద దాటవలెను. అట్టి దూరము నూరు గజములుండును. గోదావరి యచ్చట మైలువెడల్పుండును. బూరగుమ్ములపాడులో నొక శాస్త్రిగారు నూతనముగా ఈ సంవత్సరము సత్రమును పెట్టెను. భద్రాచలములో ఎక్కువ వడినశ్రమ పెరుమాళ్లకే యెరుక. తిరుగు ప్రయాణములో రాత్రికిన్నెరసానివాగు దాటి నగరం అను గ్రామసమీపమున కొంతసేపు బండ్లనాపి తెల్లవారుజామునకు ములకలపల్లి చేరితిమి. చాపరాలపల్లి పోదలచితిమి. ఇతర బండ్లచ్చటనే ఆగెను. జతబండ్లు లేనిదే యడవిలో పోజాలక మేమును ఆగవలసివచ్చెను. ములకపల్లి సత్రములో లడ్డు బొబ్బట్లు మొదలగు పిండివంటలతో భోజన మిడుట యెట్టి కష్టమైన పనియో చదువరు లూహింపగలరు. ప్రతి సంవత్సరము యాత్రికులకై యీ సత్రమువారు తెచ్చియుంచు సామానులో కొంత మిగులుచుండెడిది. అట్టిది యీ సంవత్సరం భద్రాద్రికిపోవుజనమునకే సరిపోయెను. తిరిగి వచ్చుజనులకు విస్తళ్ల దగ్గరనుంచి బియ్యము నెయ్యి మొదలైనవి తరుగయ్యెను. కొనుటకే వస్తువు దొరకు స్థలము కాదు గదా? అట్టి సమయములో ఆ సత్రమును నడుపువారు కొందరు చెల్లెక్క విస్తరాకులు కోయుటయు నొండులో దగ్గరపల్లెలలో దొరకదగినసామగ్రికై ప్రయత్నించుట మొదలగు వారి కష్టములను వివరింప జాలను. ఒక్క చిత్రము గలదు. ఆకులు దెచ్చి రాసులుగ వేసి యెవరి విస్తరి వారిని కుట్టుకొండని వేడినను ఒకరిద్దరుతప్ప తదితరులావని తమది కాదనియు సత్రముపెట్టువారే విస్తళ్లను తీసుకొనిరావలెనని కాళోలుఉపేక్షించిచూచుచు నూరకుండిరి. మేమా సత్రములోనే ఆ పూట గడపి రాత్రికి చాపరాలపల్లికి చేరితిమి. ఆరాత్రి యుపవసించి మరునాడు తెల్లవారుజామున బయలుదేరి జాము ప్రొద్దెక్కుసరికి లింగగూడెం మకామునకు వచ్చితిమి. దారిలో నర్సాపురం చెరువుచూచితిమి. అచ్చటను సత్రముగలదు. కాని దానిని చూచుట సంభవింపలేదు. కాని లింగగూడెంలో బెజవాడ వర్తకులగు ముళ్ళపూడి సదాశివయ్య మొదలగు వారొక సత్రమును జరుపుచున్నారు. అచ్చటను తినుబండములు మొదటి మూడుదినములలోనే ఖర్చగుటచేత బెజవాడకు కబురుబంపి తిరిగి యాత్రికులు వచ్చునాటికి సాధన సామగ్రి చెకూర్చగలిగిరి. మేము వేరేయింట బసచేసి సాయంకాలము 4 గంటలకచ్చట బయలుదేరి మధ్యదారిలో బయ్యనగూడెముకడ కొంచెము సేపాగి రాత్రికి 11 గంటలకు తిరువూరు చేరినాము. అచ్చటనుండి తిరిగి మోటారులో కొండపల్లికివచ్చి రైలులో బెజవాడకు రాగలిగితిమి. బయ్యనగూడెంవద్దనొక సత్రము కలదు. అది తిరువూరు కారుమైళ్లుండును. లింగగూడెముకు తిరువూరుకు పది మైళ్లు. లింగగూడెంకు నరసాపురముకు 8 మైళ్లు. నరసాపురముకు చాపరాలపల్లికి 8 మైళ్లు. తిరువూరులో నడిమితిరువూరు రాజాగారి సత్రము గలదు. ఎర్రుపాలెములో జమలాపురపు



శ్రీయుత ఆర్. యస్. రామచంద్రరావుగారు. యం. ఏ. యల్. టి.
"మాక్ బెత్" అను నాంగ్లనాటకమునందొనగిన భంగిమము,



Macbeth "........while I threat he lives
words to the heat of deeds too cold breath gives
I go, and it is done......"

Macbeth about to Murder Duncan. ( Act II. sc- i )



జగన్నాధరావు పంతులుగారి సత్రముగలదు. ఇది ప్రయాణములో మొదటిమజిలీ. బండ్లు దొరకక యాత్రస్థులు 1,2 దినములుండవలసివచ్చెను. ఈ సంవత్సరము బండ్లబాడిగ 40 రూపాయిలవరకు హెచ్చెను. మామూలుగా 20 రూపాయలుండెడిది. ఎర్రుపాలెముకు 8 మైళ్ళలో గోసవీడుగలదు. అచ్చటకూరదానను భక్తుడుగలడు. వీరికి కాళ్ళులేవు. చేతులమీద దేకుదురు. వీరు హరికథలు చెప్పి ఆర్జించి యీ గోసవీటి సత్రమును నడుపుచున్నారు. ఈ సంవత్సరం వీరు సరుకును నరసారావుపేట ప్రాంతమునుంచి తీసుకొని వచ్చిరి. చిన్న రైలు మారుటలో ఆలస్యము జరిగి సకాలమున కొందరు యాత్రికులకిబ్బంది గలిగినది. కాని తిరుగు ప్రయాణములో నీ సత్రము బాగుగా జరిగినదని దెలియుచున్నది. గోసవీడునుంచి రోలుపడకు 10 మైళ్ళు. ఇచ్చటనుంచి చెరువుగలదు. సత్ర మొకటి గ్రామస్థులచే నేర్పాటు చేయబడినది తరువాత 6 మైళ్లకు తిరువూరు మజిలీ. కొందరు దగ్గరమజిలీ యగుటచేత బయ్యనగూడెము చేరి అచ్చటనుంచి నరసాపురము మొ॥ కలపల్లి మకాములు నేర్పాటు చేయుదురు. గ్రామము వచ్చిన చోటరెండు మైళ్ళదూరము తప్పలింగం గూడెమునుంచి నగరంవరకు నొకటే మహారణ్యము 36 మైళ్ళున్నది. మకాములలో మజ్జిగచిక్కుట కష్టము. కట్టెలకు వెదుకనవసరము లేదు. విసనకర్రతో పనిలేదు. వర్షాకాలమందు వాగులు బాటలను గోసి పరికాటములను గలిగించును. చెట్లమొదళ్లు బండ్లకడ్డములగులును. ఈయరణ్యమార్గముల బూర్వము కల్పకు బోవు వారు పలుగులు పారలు వెంటనిడుకొని బాగు చేయుచుండెడివారు. ఇప్పుడా యరణ్యమార్గములు దుర్గమములుగా నున్నవి. అనేక బండ్లు పల్టీలు కొట్టినవి. ఒకటి రెండు చోట్లు తప్ప మిగిలిన చోట్ల నెక్కువ ప్రమాదములు లేవు. ఈ బాటనే బండ్లును జనములనేక కాలమున పోవలెనన్న వందలకొలది సత్రములు వేయుచున్న పుణ్యాత్ములే బాటలను బాగు చేయించుపనికి బూనుకొనవలె. యాత్రికుల యిక్కట్టులు నివారణ కావచ్చును. సింగరేణి మార్గమున మోటారు నూతన మగుటచేత రాత్రి బయలుదేరిన మోటారు అడవిమధ్యను చెడిపోవ నందలి జనులు మిక్కిల ప్రయాసపడి శ్రీరామనవమి వెళ్ళినమరునాడు సాయంకాలము భద్రాద్రి చేరగలిగిరి. వేలకొలది జనులలో రోగమువల్ల దేహయాత్ర చాలించిన వారిద్దరుండిరి. మొత్తముమీద నందరును సుఖముగనిల్లు జేరగలిగిరి. వెన్నెల రాత్రులందు ముప్పది మైళ్ళ మహారణ్యమును జూచుచు వందలకొలది బండ్లతో ప్రయాణము జేయుట మిక్కిలి యాహ్లాదకరముగా నుండును. దారిలో వెలగచెట్లయందలి కోతుల గుంపులు మృగరాజములు బొబ్బరించుచున్న వనిజనులలో యానందోత్సవము - కాపుచిచ్చు మంటలు ముచ్చటగ నుండును. గృహములను వీడి యరణ్యములో శ్రీ సీతారాములెటుల గాసిచెందిరో యూహించుటకు భద్రాద్రియాత్ర సహకారియై మనకిహపర సాధనమై యుండునని నమ్ముచున్నాను.



# ఆంధ్రప్రబంధములు.

( జి. జోగి సోమయాజిగారు, బి. యే. యల్. టి. )

భాషకు వివిధ గ్రంథ బాహుళ్యము, వృక్షమునకు శాఖా బాహుళ్యము వంటిది. వృక్షమెట్లనేక శాఖాయుక్తమై ఫలపుష్ప పత్రసహితమై శోభిల్లుచుండునో యట్లే భాషయు గ్రంథ బాహుళ్యంబున శోభిల్లుచుండును. గ్రంథము లనేకరకములుగా నున్నవి. ఏ భాషయందు వివిధములైన గ్రంథ జాతులు గర్భించుచుండునో యది యభివృద్ధి గాంచుచుండును. పద్య గద్య శ్రవ్యదృశ్యకావ్యములని నాలుగు తరగతులుగా నాలంకారికులు విభజించియున్నారు. ఆంధ్రభాషకు సాదర్శమై ప్రాచీనభాషలలో నెల్ల ప్రాచీనమైన సంస్కృత భాషయందున్న గ్రంథజాతులను కావ్యముల యొక్క యుత్పత్తియు నీసందర్భమున గొంచెము విస్తరించవలసి యున్నది. సంస్కృతమునందు గద్యకావ్యములు బహు స్వల్పము. ముచ్చిమున్మారనునట్లు మూడు కావ్యములు మాత్రము కన్పించుచున్నవి. వైద్యమును గురించి వ్రాసినదియది శ్లోక రూపకముగానే రచియింపబడినది. దృశ్య ప్రబంధములు మహోన్నత స్థితికి తేబడినవి. అందు విషాదాంతనాటకములు బహిష్కరింపబడినవి. తరువాత రఘువంశ, మేఘసందేశ శిశుపాలవధాది కావ్యములు లెక్కకుపగా గాన్పించుచున్నవి. ఈకావ్యముల ఫక్కిని కనిపెట్టినవారిలో మొదటివాడు విరించి తుల్యుడగు వాల్మీకి. ఆయన వ్రాసిన రామాయణము కావ్యములలో జేర్పబడినది. తదనంతరము రచింపబడిన భారతము పురాణమై యొప్పుచున్నది. వైపుల్యమను లక్షణము భారతమందు బెంచబడి తరువాతి పురాణసాహిత్యకి మార్గదర్శకమై యున్నది. వాల్మీకి ప్రథమకావ్యరచయితయగుట తరువాత కవులాతని ననుసరించియు వైపుల్యమంతగా లేని కావ్యముల రచించుట ప్రారంభించిరి. వీరిలో ముఖ్యుడు కాళిదాసు. తరువాతనింకను గావ్యము లనేకములు సంస్కృత భాషయం దుద్భవించినవి, కాని తత్కావ్యములయందు బ్రథమ రచయితయగు వాల్మీకి యందుగల గుణములు లేకపోయినవి. తరువాత రచించిన కాళిదాసు వాల్మీకి గుణములనేకములు గ్రహించి తనకు వీలైనయంతమట్టునకు వన్నె ఘటియించుటకు ప్రయత్నించెను గాని వాల్మీకికంటె మిన్నగా వ్రాసెనని మాత్రము మాయభిప్రాయము గాదు. మొట్టమొదట నాదికావ్యము ననుసరించి వ్రాయబడిన కావ్యములు పెడదారిబట్టి శిశుపాలవధ వ్రాయు కాలమునాటికి కేవల వర్ణనాప్రధానములై కథారంజకత లేక చిత్ర కవిత్వ బంధకవిత్వములకు గూడ

నాస్థానములై యొప్పినవి. తరువాత నాలంకారికులు తత్కాలమందుత్తమ గ్రంథములుగా బరిగణింపబడిన కొన్ని గ్రంథముల గ్రహించి కావ్యలక్షణములను ధ్రువపరిచిరి. అట్టిస్థితిలో నున్న సంస్కృతకావ్యములును దల్లక్షణ వ్యంజకములైన యాలంకారికుల గ్రంథములును నాంధ్ర భాషలోని కావ్యనిర్మాణ కర్తల కాదర్శములయ్యెను.

ఇక నాంధ్ర ప్రబంధములకు మార్గదర్శకులెవ్వరు? వారే విధి నీసాహిత్యము నభివృద్ధిపరచిరి? యను విషయము విచారింపవలయును. ఆంధ్రభాషను సంస్కరించి పురాణమగు భారతమును తెనిగించినవాడు నన్నయభట్టు అందాతడు. ప్రబంధలక్షణములగు వర్ణనలను రచియించెను. తరువాత రచియించిన ప్రబంధములకు, నుద్రిచ్చునకు బీజము వలెనే భారతములోని విశేషస్థలములలోని వర్ణనములే యాధారములని చెప్పవచ్చును. నన్నిచోడ టెంకణాదిత్యుని కుమారసంభవము కావ్యఫక్కికి జూపించుచున్నది. అది సంస్కృతకుమారసంభవము చదివిన కవి చేతనే వ్రాయబడినదని చెప్పక తప్పదుగాని యందులోనున్న గుణముల నన్నిటినిగాని కథావిధానమునుగాని కవియనుకరింపక పోయెను. కథాసంవిధానమున (న॥ సి) కుమారసంభవము పురాణములనే బోలియున్నది గాని కావ్యముల బోలియుండ లేదని చెప్పక తప్పదు. నాచనసోముని హరివంశము చాలమట్టునకు ప్రబంధముల ఫక్కికి దారి జూపించినది. కథాబాహుళ్యము కలిగినను వర్ణనలపట్టునను భావస్ఫురణపట్టునను నాంధ్రప్రబంధములకు మార్గముచూపినదని చెప్పకతప్పదు. తరువాత చెప్పవలసినవాడు శ్రీనాథుడు. ప్రబంధ సాహిత్యమునకునై స్పష్టముగా మార్గముచూపినవాడితడు. ఇంతకు ముందు కేతనాదులు దశకుమారచరిత్ర కాదంబరీ మొదలగు గ్రంథములను తెనిగించిరిగాని యాతనికంటె నెక్కువ ప్రబంధ మార్గదర్శకముగా గ్రంథరచనము చేయలేదు. శ్రీనాథుడు ముఖ్యముగా సంస్కృతగ్రంథముల జదువుకొని పాండిత్యము సంపాదించినవాడు. ఆతని కాలమందాంధ్ర భాష సంస్కృత భాషాచ్ఛాయమై యొప్పుచుండెను. ఆతని గ్రంథముల జదివినవారికెవరికైన నీతని సంస్కృత భాషాపరిచయము బోధపడకపోదు. సంస్కృత కావ్యముల నన్నిటిని జూచిన శ్రీనాథుడు "నైషధం విద్వదౌషధ" మ్మనియు "శాకుందనమ్యంపి" యన్ననియు కావ్యభవ్యంబులని పేర్వడియున్న గ్రంథంబుల రెంటిని దెలుగు జేసెను. అందు శృంగారనైషధముచే ప్రబంధరచనా సౌధమున కొక పెద్దసోపానమును కల్పించెను. అతడు వ్రాసిన గ్రంథ మొదలి కథాసరళియు వర్ణనావిధానమును భావనాపద్ధతియును తరువాతి కవుల కాధారములయ్యెను. ఈతడు సంస్కృత నైషధములోని వర్ణనల నన్నిటిని మక్కికి మక్కిగా దెలుగుచేసెను. తనకు దుర్ఘటముగు పంచనాళీయవర్ణనము మొదలగుచోట్ల కొన్ని విశేషములను విడిచివేసి తన శక్త్యనుసారము రచించెను. తరువాత ప్రబంధరచనకు సోపానము గట్టినవాడు పిల్లలమఱ్ఱి పినవీరన. ఈతడు శృంగార శాకుంతలమును రచించినవాడు. ఈ శృంగార శాకుంతలము స్వతంత్ర

గ్రంథము. కథమాత్రము భారతమునుండి గ్రహింపబడినది. కాళిదాసకృత సంస్కృత నాటకమునుగూడ చదివినవాడీ యాకవి. అయినను కాళిదాసుచే చేయబడిన వర్ణనా చమత్కారమును బాటింపబడిన పాత్రౌచిత్యమును నీకవియందుగానరావు. భారతములో వలెనే రసాభాసముగను విరసహేతుకముగను నౌచిత్యహీనముగను వర్ణింపబడిన స్థలములయందైనను కథావిధానమును మార్చి స్వారస్యము పుట్టింపదలచెను గాని యాతని కల్పనయు నంత సమంజసముగా కన్పింపలేదు. పూర్వకవి కాళిదాసకృత శాకుంతలమందలి కథపట్టుల నీత డనుసరించినయెడల నీతనికి స్వాతంత్ర్యము తక్కువ యని జనులు భావింపరేమోయని యీతడు తనదారిత్రొక్కినట్లు తోచుచున్నది. కాని నయముననేమి భయముననేమి యీతడు చూపించిన స్వాతంత్ర్యత తరువాతి కవులకు మార్గదర్శకమయ్యెను. కావ్యములయందు రసపోషకముగాగాని నాయకపోషకముగా గాని యున్న మూలకథను బరిత్యజించి యితివృత్తమునందు మార్పు నొనర్చుకొనవచ్చునను ధనంజయసూక్తిని యాంధ్రకవులంతగా బాటించినట్లులేదు. పిల్లలమర్రి పినవీరన కథా సందర్భమున స్వాతంత్ర్యపు మార్పుల నొనర్చినను బద్యరచనా సందర్భముననను నింక గొన్నిసందర్భములను శ్రీనాథుని ననుకరించియే యున్నారు.

తరువాత వర్ణనా ప్రధానములగు నాంధ్ర ప్రబంధములకు బ్రథమ గ్రంథమగు మనుచరిత్ర మల్లసాని పెద్దనామాత్యునిచే రచియింపబడెను. ప్రాకృతమందున్న ప్రబంధ సాహిత్యమున కంతటికిని నియ్యదియే మార్గదర్శకమై యొప్పుచున్నది. ఈతడు పురాణాంతర్గతమైన కథను గ్రహించి స్వతంత్రములగు వర్ణనల సంఘటించి పాత్రౌచిత్యాదుల బాటించి సరసముగా మనుచరిత్రమును రచించెను. ఇదియే వర్ణనా ప్రధానమగు ప్రబంధ సాహితికి మొదలని చెప్పక తప్పదు. తరువాత వసుచరిత్రమును రచించి రామరాజభూషణుడు ప్రబంధలోకమున నింతకంటె నెక్కుడు వన్నెలగు ప్రబంధము వ్రాయుట కవకాశము లేదని చూపివేసెను. వసుచరిత్రతో ప్రబంధ సారస్వత మంతమొందినను నాంధ్ర సాహిత్యమునకే కొరంతయును రాబోదని చెప్పవచ్చును. తక్కిన ప్రబంధములందు ముఖ్యములగునవి రాఘవపాండవీయమును నాముక్తమాల్యదయునై యున్నవి. రాఘవపాండవీయము ద్వ్యర్థి కావ్యములలో పరిగణింపబడవలసినదేగాని ప్రబంధములయందంతగా పరిగణింపబడవలసినది గాదు. ఆముక్తమాల్యద, పేరుగాంచిన ప్రబంధమైనను ననేకములందుం బూర్వపద్ధతుల ననుసరించి వ్రాయబడినదేగాని నూతనమేమియును గన్పట్టదు. మిగిలిన ప్రబంధలోకమంతయును వసుచరిత్రననుకరించి వ్రాయబడిన గ్రంథములే గన్పడుచున్నవి. తరువాత వారు వర్ణనలయందుగాని కథపట్టులగాని స్వతంత్రములగు మార్పుల జేయజాలక పూర్వుల దోషములను మాత్ర మనుకరించి యున్నారు. అట్టి యనుకరణములను వసుకృతులు నాంధ్రప్రబంధలోకమునకు సామాన్యమై కవిసమయమువంటిదిగా బరిగణింపబడినవని యనేకోదాహరణములతో బ్రా॥ వ॥ చి॥ సి॥ శాస్త్రిగారు తమ వసుచరిత్రవిమర్శ యందుదాహరించి యున్నారు.

తెనుఁగు భాష సంస్కృతమునే యాదర్శప్రాయముగా నొనర్చుకొనుట చేతను నన్నయభట్టు కాలమునాడు మాత్రమే తలయెత్తి మాట్లాడుట కారంభించుట చేతను సంస్కృత భాష కనేక విధముల నభివృద్ధియందు తీసిపోవుననుటకు సందియ ములేదు.

సంస్కృతము నుండి ప్రథమమున పురాణములు తెనిఁగింపబడినవని పూర్వము వ్రాసియే యున్నాను. అట్టి పురాణరచనయైన తరువాత నారంభించిన ప్రబంధరచన నవీనయుగారంభమునాటికి నంతమొందినది. తన తల్లియగు సంస్కృత భాషవలెనే తెనుగు గద్య కావ్యరచనయందు ప్రవేశించి యుండలేదు. లక్షణగ్రంథములు కూడ పద్యములలోనే వ్రాయబడినవి. ఆకారణమునంజేసి నవీనయుగారంభమునకు (అనగా 20వశతాబ్ది) ముందుండిన యాంధ్రసారస్వతమునందాహ్లాద జనకములైనవి ప్రబంధము లొక్కటియే యని చెప్పక తప్పదు. అట్టి ప్రబంధములలో నుత్కృష్టమైనవి నాలుగు మాత్రము కనుపట్టుచున్నవి. అందు ము॥ మనుచరిత్ర వసుచరిత్ర, రాఘవపాండవీయము, ఆముక్తమాల్యద. ఈ గ్రంథముల ననుసరించియు సంస్కృతములోని కావ్యములంబట్టి రచింపబడిన యలంకార గ్రంథములబట్టియు నాంధ్రమున ప్రబంధలక్షణములు, అప్పకవ్యాదులచే నిర్వచింపబడినవి. ప్రబంధమునం దిరువదిరెండు వర్ణనలుండవలయునని వారిచే నిర్ణయింపబడినది. ఇట్లు తాత్కాలికమగు ప్రబంధములను సంస్కృత కావ్యములను బరీక్షించితల్లక్షణములను సర్వప్రబంధములకు సామాన్యముగా నుండవలసిన లక్షణములని చెప్పి భావికవుల స్వేచ్ఛను నిరోధించిరి. రాజకీయవిధానము సందెట్టి పారతంత్ర్యమనుభవించుచున్నామో, యట్టి పారతంత్ర్యమునే సారస్వతమునందుగూడ ననుభవించుట మనకవుల కాచారమై పోయినది. మన పూర్వులగు మహాకవులు వ్రాసినమార్గములనేత్రొక్కి వారు వ్రాసిన పుస్తకములకుఁగాని కల్పనలకుగాని వన్నెపెట్టుటకు శక్తిచాలక వానిదోషంబులను మాత్ర మనుకరించి తుట్టతుదకు బ్రబంధములన్నియు నొకరిదిచూచియొకరును నింకొకరిది దగ్గరనుంచి గాని పైవారును వ్రాసినట్లు తోపింప జేయుచున్నవి. దృశ్యకావ్యములనియు శ్రవ్యకావ్యములనియు రెండు విధములుగా సారస్వతమునువిభజించి నప్పుడు శ్రవ్యకావ్యములయందన్నిటియందును మహాకావ్యమునకుండ వలసిన వర్ణన లన్నియు నుండక తప్పదని శాసించుట కెవరి కధికారమున్నది. అట్టివారు శాసించినను దానినే ప్రమాణముగాగాని "I. P. Code" వలెదానినాదరించి యభివృద్ధిగాంచనివారెంత శ్లాఘాపాత్రులు!

నైషధకాలము నుండి యాంధ్రమునందు రచింపఁబడిన ప్రబంధము లన్నియుఁ బరీక్షింపఁగా నొకకొన్ని సామాన్యపుగు లక్షణములు గన్పించుచున్నవి. సుమారు మూడువంతుల ప్రబంధముల యందు శృంగారమే ముఖ్యరసము. స్వీయ, పరకీయ, సామాన్యలలో నెవరోయొకరగు నాయిక నొక నాయకుని జూచి మోహించుట. సందర్శనవియోగాదులచే, సంభోగ విప్రలంభ శృంగారవర్ణన. విప్రలంభ శృంగారములో వృక్షములను మృగములను సంబోధించుట,

చంద్రినున్మథో పాలంభనము, మన్మథపూజ మొదలగు కొన్ని సామాన్యమైన సిద్ధగుళి కలు. ఏకవి వ్రాసినను నావిప్రలంభమే, యాశృంగారమే, యాగుళికలనే పుస్తకముల నిండనింపి వేసిరి. రసనిష్పత్తియగుట కిది యొక్కటి యేమార్గమని వారి యభిప్రాయ ముకాఁబోలు. నవనసములని యాలంకారి కులు మొరవెట్టు చుండఁగా నందులో నొక్క రసమగు శృంగారమునే తీసికొని వర్ణిం చుట యందీకవుల యభిప్రాయ మేమియో గన్పింపుట లేదు. మిగిలిన వీరశాంతాది రసములను వీరేమి చేసిరో తెలియ కున్నది. ఒకమతోద్ధారకుని చరిత్రగాని యొక్క వీరా గ్రేసరుని చరిత్రిగాని యింకొక మహాపురు షుని చరిత్రమును గాని వీరెందుకు పరిపోష కముగా రచియింపఁ గూడదు? అందుచే వీరి కల్పనా సామర్థ్యమునకును పాసనకును వన్నె వచ్చియుండును గదా? ఇదిగాక పై శృంగార రచనయందు వీరుచేసిన మహాదోష మొకటి కలదు. సంభోగ శృంగార రచనయందు నాయికా నాయకుల రహస్యావస్థలను బహి రంగపరచినాన్పుల పయిబ్రౌఢోక్తులు, గర్భా దానపు గదులందు శ్లేషవాక్య స్ఫుట నలునింక ననేకములు కల్పించి వీరుకొన్ని చోట్ల నసభ్యపు శృంగారమును చూపించి యున్నారు. స్త్రీపురుషుల యన్యోన్య వాం ఛల చేతను, వారొకరి యందొకరు చూపిం చిన ప్రేమాతి శయంబు చేతను, హానభావం బుల చేతనే రసనిష్పత్తి కలుగునుగాని, కవి, శయ్యామందిరమున నాయికా నాయకులతో సమానముగ నిద్దుర మాని యుండుటచేఁ గాదుగదా! నేను పై నుదాహరించిన వర్ణ నాదివిషయము లందరికిని సామాన్యముగా నెఱుకపడినది యగుటచే నుదాహరణముల నిచ్చుట మానుకొంటిని.

అలంకారములతో నెంత మట్టుకా కవులు తమగ్రంథముల యందుఁ బ్రసక్తిని గలిగించి కొనిరను విషయమును విమర్శింప వలసి యున్నది. కొంచెమించు మించుగా నలంకారములేనివద్యము లిందులో లేనేలేవని చెప్పవచ్చును. అతిశయోక్తి, ప్రౌఢోక్తి, కవి నిబద్ధ వక్తృప్రౌఢోక్తి, ఉదాత్త, ఉత్ప్రే క్షాద్య లంకారము లన్న వీరి కెంతయో యిష్టము. ఉత్ప్రేక్షలకు మేరయే లేదు. రస నిష్పత్తికలం కారములెంత వఱ కావశ్యక ములోమనము విచారింతము. నాటకములందు ధీరోదాత్తా దినాయక వ్యవహారమును జూచి మనకు రసానుభవ మెట్లు కలుగు చున్నదో యటులనే శ్రవ్యకావ్యము లందును రస నిష్పత్తికి ముఖ్యమగునవి పాత్రలు, పాత్రౌ చిత్యము, తదవస్థలు, కథాసం విధానములే గాని యలంకారము లంతగాఁ గారణములు గావు. ఈ యభిప్రాయమునే విశ్వనాథ పంచాననులవారు,

"శబ్దార్థ యోరస్థిరాయే
అలంకారాస్తే ఽంగదాదివత్''

అని చెప్పియున్నారు. అలంకారములు కావ్యకన్యక కంగభూషణముల వంటివి. నైజ సౌందర్యముచే నలరారు వారికి నలంకార ములపేక్షలేనే లేదు. అట్టినైజ సౌందర్యము లేనివారి కెన్ని భూషణములు పెట్టినను సౌందర్యము రానట్లు స్వతస్సిద్ధముగా రసలేని కావ్యము నందెన్ని యలంకారము లుంచినను రసకావఁ బడదు. దీనికను గుణ

ముగా కాళిదాసు "కిమివహిమధురాణాం మండనం నాకృతీనాం,, అని చెప్పియే యున్నాఁడు. అదిగాకన "షట్పద శ్రేణిభిరేవ పంకజం సశైవలానంగమపి ప్రకాశతే" అనియుఁ గూడఁ జెప్పియున్నారు. స్త్రీకి శరీరమునందుండు ముత్యములోని కాంతివలె బ్రకాశించుచుండెడు ప్రత్యంగ సౌందర్య జనితమగు లావణ్యమెట్లో యట్లే కావ్యమునకు బాత్రౌచిత్యాదుల వంటివి. ప్రబంధ కవులు వారిగ్రంథములలో రసనిష్పత్తికి యలంకారముల కీయవలసిన ప్రాధాన్యమునకంటె చాలనెక్కుడు గానిచ్చికొన్ని స్థలముల యందు వానినే ముఖ్యకారణముగా నెంచి యున్నారు.

తరువాత నెంచవలసిన విషయము వర్ణనాపద్ధతి. ప్రబంధములయందు ముఖ్యముగా బాటించినది వర్ణనయే. ఇట్టిపద్ధతులుద్భవించుటకు వీరు ప్రథమ కారకులు గారు. వీరికుపాధ్యాయులు మేష్టలగుసంస్కృతకవులీ విషయమున నెక్కువ గరిడి దేసినవారు. మాఘు కావ్యమునందు రైవతకాద్రివర్ణన కొన్నిసర్గలలో చేయబడినది. వాల్మీకి వర్ణనాపద్ధతిని కొంతవరకు బాటించినను నాతని వర్ణన లతిదీర్ఘములుగాక సమయానుకూలములుగా ప్రదర్శింపబడినవి. ఆతడువర్ణ్యమును దగుమాత్రములగు సరసములైనచిన్న చిన్న యుపమానములచే పాఠకుని హృదయమునందు హత్తించియున్నాడు. ఒక్కొక్కయుపమానముచే నొక్కొక్క విజాతీయమైన వస్తువును దద్ధర్మములనుమానస సాక్షికి గోచరములగును. సీతాదేవిని లంకలోనున్నపుడు వర్ణించుపట్ల, "ఆమ్నాయానామయోగేన విద్యాం ప్రశిథిలామివ."

"ప్రతిపత్పాఠ్య శీలస్య విద్యేవతనుతాంగతా"

"ప్రాలేవతవరారోహ ప్రవాతేకదలీ యథా ... కురరీమివ."

"ఆశాం ప్రతిహతామివ—

ఇత్యాదు లనేకములుగలవు. అందునుకొన్నివిషయములు విపులముగా వర్ణింపబడినవి. గాని యయ్యవి తద్గ్రంథ దైర్ఘ్యమునకు సరిపోయియున్నవి.

వాల్మీకితరువాత గాళిదాసువర్ణనములతో గావ్యములువ్రాసియున్నాడు. ఆవర్ణనలయందు మాధుర్యమును స్వభావోక్తులును సరసత్వమును గాన్పించుచున్నవి. తరువాత కావ్యములయందు వర్ణనానైపుణ్యము వెరిగిపోయి యానందజనకత క్షీణించినది. అట్టికావ్యములవర్ణనయే యాంధ్రప్రబంధముల కాధారమైనది. ఆంధ్ర ప్రబంధకారు లుపయోగించిన కథలును వర్ణనలును నొక్కయచ్చున దీసిన ప్రతిమలగుటచే వర్ణనలును గూడనట్లే కావలసివచ్చెను. కోటను వర్ణింపవలసి వచ్చినప్పుడు ప్రథమ కవిచే నేలక్షణములు ప్రథమ దుర్గమునకు చెప్పబడినవో యవియే తిరిగి తెక్కిన కవులచే జెప్పబడినవి. ఒకడు బంగరుకోటయని వర్ణించినవాడనే ప్రతి కవియు దన ప్రబంధము నందును. బంగరుకోటనేవర్ణింప వలయునని గాబోలును దానినే యింకొక యలంకారముచే గొంచెము ప్రౌఢముగా జెప్పియున్నారు. కొందరా బంగరుకోటనే శివునిచే విడువబడిన విల్లాయనునట్లు గన్పించునని యుత్ప్రేక్షించి చెప్పియున్నారు. ఇట్లు ప్రబంధ ప్రపంచమునందు

గోట లన్నిటికిని స్వర్ణమయత్వము సౌన్నత్యము నుబరిఖయొక్క యగాఢతయును ముఖ్యలక్షణముగా గన్పట్టుచున్నయవి. కవియనువాఁడొకశిల్పి. చిత్రకారు డేవిధముగా గతములైన యాకారములును దూరస్థలములైన వైచిత్ర్యములను రమణీయముగా యదార్థముగాజిత్తరువులను వ్రాసి యక్షిసంయోగము వలన మనోవేద్య మొనరించు చున్నాడో యదేవిధముగా గవియుగూడ మాటలచే గర్ణములద్వారా వర్ణితవస్తువుల యాకారములను మనోవేద్య మొనర్చుచున్నాడు. కనుక కవి వర్ణించువర్ణన యేవిధిగా నుండవలయు ననగా వర్ణనము జదివినయంతనే మనస్సునందువర్ణ్యవస్తువుయొక్క స్వరూపము పొడకట్టవలయును. అట్టిరూపస్ఫురణశక్తి లేక మాటలు పోగువలె నున్న వర్ణనలు రుచింపవు.

దేవేంద్రుని పట్టణములో వర్ణింపబడిన కోటలకును నితరరాజుల కోటలకును భేదములుగాన్పింప వలయును. ఒక రాజుకోట నొకకవి వర్ణించినప్పుడు కొన్నిలక్షణములు గోచరమై యొక్క ప్రత్యేకరూపము స్ఫురించినట్లు రచించినయెడల నంకొకకవి యింకొక కోటను వర్ణించునప్పుడు తద్భిన్నత్వమును సూచించిన గాని యదిశిల్పము కానేరదు.

పరమేశ్వరుని సృష్టియందు మనముకోట్లకొలది మనుష్యులను జూచుచున్నాము సజాతీయములైన వారి వారి రూపముల యందట్టి భేదములు గన్పించుచున్న నొకదాని కొకటి పోల కుండనున్నవో యట్లే కవి కల్పితములైన దృశ్యములును బ్రత్యేక లక్షణములచే నొప్పు చుండవలయును. సామాన్య లక్షణములను మాత్రము ప్రతికవియును వర్ణించినయెడల నదివర్ణన యనిపించు కొనదు. చదివినవాని కానందము కలుగ జేయదు. ప్రతి కురంగమునకును నాలుగు కాళ్ళును నొకతలయును డెక్కలును లక్షణములని వానినే వర్ణించుచువచ్చినయెడల నందుస్వారస్యము లేదు. ఒక రాజకన్యక యొకలేడిని బెంచుకొనినదని కవిచెప్పి దానిని వర్ణించునప్పుడాతడొక ప్రత్యేకమగు లేడియొక్క వ్యక్తిని వర్ణించు చున్నాడు. గాని సర్వమృగ సామాన్య విశిష్టమగు లేడియొక్క లక్షణమును వర్ణింపలేదని జ్ఞాపకముంచుకొనవలయును. తాను వర్ణించుపదార్థముయొక్క యాకారము కవి మనఃఫలకము నందు ప్రథమమున నొప్పుచుండినగానియట్లు వర్ణించుట కవికి సాధ్యముకానేరదు. వస్తురూపమునందుఁగల భిన్నత్వమును జూపించుట చాలకష్టమైనపని. పూర్వకవులు చేసిన వర్ణనలను గోశములను, ముందుంచికొని మాటలనుమాత్రమే మనస్సు నందూరించు చుండు నెడలనట్టి ప్రత్యేకరూపము రానేరదు.

వర్ణనసేయునపుడు కవి కేవర్ణ్యముయొక్కయాకారముమనస్సునందుస్ఫురింపకపోయినయెడలడద్వర్ణనముచే బాఠకునికట్టి స్ఫురణమెట్లు సంభవించును. సర్వవర్ణనలయందునుప్రబంధకవులీ విధముగానే సంచరించిరి. నిజగ్రంథమందు నాయికల వర్ణనసేయునప్పుడు కవులందరును నొకేఫక్కి నవలంభించియున్నారు. స్త్రీయొక్క నఖములారంభించి కచాంతములకును ప్రత్యేక విభాగమొనర్చి యొకొక్కయంగము ననేక కల్పనలచే వర్ణించియున్నారు. ఇట్టిప్రత్యేకాంగవర్ణన మొనర్చిన మహాకవులలో గాళి

మార్చి యుపమాన భావములను గ్రంథముల నుండి గ్రహింపక వీరిమనస్సులచే నాలోచించి వారి యనుభవమునకు గోచరించిన యుపమానముల నేలవ్రాయఁగూడదు.

ఇంక వీరి గ్రంథములయందలి కథాంశము నుపేక్షింతము. ప్రబంధము నందు బురద్యాత్రాది వర్ణనలియుం డిరెం డుండవలెనని నిర్ణయించుటచే గదా చమత్కారమైన దాని నింకెటులఁగొని ప్రబంధమునందు వృద్ధిసేయుటకవకాశము లేకపోయినది! ఒక ప్రబంధమునందలి యితివృత్త మింకొక ప్రబంధమునందలి యితివృత్తమునకు ఛాయవలెఁ దోచుచున్నది. ఒకటిరెండు ప్రబంధముల యందు దక్క దక్కిన వానియందు బస కానరాదు. కథ బహుస్వల్పము. వర్ణనబాహుళ్యము. వసుచరిత్రకారుడు కొన్ని దృశ్య ప్రబంధమునందలి రీతుల ననుకరించి కొన్నివిధముల నాహ్లాద జనకత కలుగఁ జేసెను. కథయు హ్రస్వమును దీర్ఘమును గాకుండ సమముగా నేయున్నది. వర్ణనాభాగము మాత్రము హెచ్చుగా నున్నది. మనుచరిత్ర యందుఁ కథపెద్దదిగాని యందు నైక్యము కానరాదు. అందలి మనోహరమైన కథ స్వరోచి జన్మముతో నంత మొందును. తరువాతి కథ యంతయు నొక కథయు బూర్వకథయంతయు నింకొకటి గాను గన్పించుచున్నది. ఆరెంటికిని కవి యతికిన యతుకు కతుకుగానే యున్నది. కథా సంవిధానము నూతన పక్కి ననుసరించిన వాడు పింగళి సూరన. ఈతడు కళాపూర్ణోదయమునఁ గాదంబరి ననుసరించి కథాకల్పన మొనర్చెను. ఇట్టి కల్పన యాంధ్ర ప్రబంధముల యందపూర్వము. గ్రంథము నందు నిజముగా నాహ్లాద జనకతకుఁ గారణము కథాసంవిధానము. కథయందు పాత్రలకు గొన్నికొన్ని స్థితులను గలిగించి వానివలన పాఠకుల యందు శృంగారాది రసముల నుద్రేకము జేయుటకవి యొక్క పని. అట్టి స్థితులు వచ్చుటకు కథయందాస్పదము లేనప్పుడా గ్రంథమునం దాహ్లాద జనకత్వము సిద్ధింపదు.

ఇంక మన మెంచవలసిన విషయములలో పాత్రపోషణ మొక్కటి మిగిలి యున్నది. ఇందుఁ గవి ముఖ్యముగా గమనింప వలయు విషయము లనేకములు గలవు. ఒకపాత్రను సృష్టించి యాపాత్రచే నొక మహోన్నత కార్యము నొనరింపఁ జేయునప్పుడు స్వాభావికముగా నట్టిపాత్రకుఁ గావలసిన పరికరములను సమకూర్చి కొని, యాపాత్రయందలి గుణములను క్రమవృద్ధి నొందింప వలెను. ఒకపాత్రయందు ముఖ్య గుణ మొకటి యుండినయెడల దానియారంభమునకును బరిణతికినిఁ గావలసిన విధిని కవి స్వాభావికముగా వర్ణింపవలెను. కవి పురాణములలోని గాథల గ్రహించినప్పుడు, మూలకథ యందు నాయకుడు నాలుగేండ్లకే నిరుపమాన పాండిత్యమును సంపాదించి నాఁడని చెప్పఁబడిన యెడల, నట్టి విషయమును దీసి వేయుట గాని లేక యా నాయకునికంత చిన్నవయస్సునకు తజ్ఞానము వచ్చుటకుఁ దగిన కారణములను ముందు సూచన యొనర్ప వలయును. ఇట్టిరచనకు బ్రబంధ సాహితియందు తావుగన్పింపదు. ఈవిషయమును బ్రబంధ కవులు పాటించుటయే లేదు. ఒక్క మనుచరిత్ర యందుమాత్రము

ప్రవరాఖ్య పాత్రియందు కవియిట్టి నియమమును బాటించిన వాఁడు. వరూధినివంటి కన్యక స్వయందత్తయై వచ్చినప్పుడు నిరాకరించుటకుఁ దగిన ధైర్యమును బ్రవరాఖ్యునయందుంచుటకు ముందు తడను గుణమైన వర్తనను వానియందు నిల్పి యున్నాఁడు.

ప్రబంధ సాహిత్యము నందు గమనింపవలసిన విషయములను సాధ్యమైనంత సంక్షిప్తముగ పొందుపరచి యున్నాను. ఆంధ్రప్రబంధసారస్వతమునందలి లోటులను బరీక్షించిన యెడల నాభాగము నింకనెన్ని మార్గములయందు వృద్ధి నొనరింప వచ్చునని చెప్పక తప్పదు. నేనుదాహరించిన యభిప్రాయములను కవులగువారు గమనించి పైలోపములను బూర్తి చేసి యాంధ్రమునకు వన్నె దెత్తురు గాక. నేనుపైనుదాహరించిన విషయములలో స్ఖాలిత్యములు గాని వానిగురించి యభిప్రాయ భేదములు గాని యున్నయెడల సహృదయులు మన్నింతురు గాక!

## నాబాధిర్యము.

ఈశ్వర.

నడిరేయి గడెం, నేనడిసన్న లేని
యాసందు త్రోవ, నాయీ యంగనమున,
జీవవిషాద ప్రసిద్ధి నెవ్వారో
యల్లన శ్వాసించి నటుల స్ఫురించె!

అంతనే నెంతో చయ్యన శయ్యవిడి,
మెల్లమెల్లన మునివ్రేళ్లపై నడచి,
తలుపుల, జేరి- శ్రోత్రమునంట, జేర్చి—
వడి, గ్రుంగిపోతి నాబాధిర్య మెఱిఁగి!

మరలి పోవగ నంత మదిమది లేక;
తెలచి, వాకిలి సేరఁ దగఁ బాటులేక,
నిలచి, యూరించితి నీరవరవళి!
యాలించి, యెఱిఁగితి నామేన మూర్తి!!

* ఈకవి బధిరుఁడు. ఇందలి బాధిర్యము స్వభావమైనది

# ప్రణయప్రకటనము.

( నరకూరంశెట్టి వెంకటరత్నముగారు. )

రామ! శృంగార కల్పకారామ! సుగుణ
సంపదభిరామ! ప్రవిపన్నచయాశ్రామ!
ఎఱుఁగుదు భవన్మృదుల వ్యాహృతుల తాను
రాగిల వరి విహారంబు, లోఁగఁ జేయ
మానసిక ప్రేమలత ప్రాకుమార్గము లేక
వీకఁబోడి జోకఁ దక్కి చీకాకుపడియె;
ధర్మమునరింతు నాసీను దయలభించ;
దర్థమునఁ జిక్కదు; వ్రతంబు లాచరింపఁ
జేయుందు; యాగముల కీర్తిసేసి నసేయ
దొరుక; దుపవాసపి యతిఁ బొందుపడఁ బోదు
నామనంబీ వెలుఁగుదు నాతి! సీత
సీతనూతల్లి హృదయ ప్రపూతఖ్యాత
ధాత్రిఁ జక్కఁగ నాటి నేత్రముల మోడ్చి
యంత రింద్రియ కలశ సహాయమునను
ప్రేమరసమును వోసి, సంప్రీతి రోహ
దంబుగా పెంచి, సంకల్ప తరువుఁ బ్రాకు
సేసి, రోమాంచపల్లవస్థితుల గించి,
దేహదేశసమాకీర్ణ తేజమిచ్చి,
స్వేచ్ఛవిచ్ఛానుమముల వాసింపఁ గూర్చి,
యుగణి తానంద వార్ధినోలాడి యాడి
కనులు విచ్చితి భువనంబుగానఁ బడదు;
పొందిరా రాములు బంధు బృందవాహ
నాదికంబులు దృశ్యంబు వందు లేవు;
కనులఁగట్టిన యట్లు నీయాను పమాన
దివ్యమంగళమూర్తి చిత్రింపఁ బడుచు
నెప్పుడే నీయదియొ; రీతినర్చ
జేసినఁ గా నొసఁగు సంప్రీతిఁ గూర్చి
యాదరించెదవో తెలియఁగ రాదు;
అటయ నీడెందు మునిలాము యాంబనంగ
రాక; నవనీతమే యనరాదు; మఱపు
జెందవలెఁ దుచు లోన నెంచెదనొ కప్పు;
డట్టి తెగువ మంచిది కాదటంచొ కప్పు;
డాత్మసించి కట్టాద్భులన పయానంబు
లెల్లఁ బరవసమందు టయ్యుల్లమందు
నిన్ను ధ్యానింతుఁ గాఁగ నెన్ని ధార
మట్లు నీపయి నను రాగమతి శయిల్లఁ
దల్లడింపదె; ముఖమున వెల్లడింతు
దస్మహాప్రేమ యొరుల చిత్తములు గలఁగ
నన్నుదలఁతువో తలఁపవో నిన్ను దలఁప
నట్టిక్షణ మొక్కటియు నాకున రయలేదు!
ప్రాణపదరాగ వల్లి! పుష్పముల చేతఁ
బూజగావింతుఁ బ్రేమకెప్పుడును బోని
రామ! వేచిః జన్మాంతరమున నైనఁ
బ్రణయ మహిమంబు వెలియంగ బడునుగాక
నన్నిభంగుల నైనను నిన్నుఁ గలఁచి
నీదు ప్రేమంబె కోరుచునె గడువాఁడ;
నిన్నుఁ గూడి ధన్యుఁడ నౌదునిక్కము గను.



# ఆస్ట్రియా దేశము.

(ఆర్. రంగనాథ శాస్త్రిగారు)

ఆస్ట్రియా దేశస్థులు సర్వజనప్రియులు. వీరు జర్మనుజాతికి సంబంధించిన వారు అయినను వారికియున్నంత ధనాశ వీరికిలేదు.



మంచిదుస్తులను ధరించిన కృషకబాలిక.



వియన్నా నగరమందలి స్త్రీలు పూర్వమిట్టిదుస్తుల ధరింపుచుండిరి.

ధనాశాపరునిజూచిజగత్తెప్పుడు అసహ్యించుకొనుచుండునుగదా? ఇప్పు డాస్ట్రియావారు తమవ్యక్తిత్వమును స్వతంత్రతను గాపాడుకొనుచున్నారు. వారొకింత యలస స్వభావులు. నెమ్మదిగ కార్యములజేయుటకిచ్చగింతురు. కాని హడావుడి పనికిరాదు. వారియందొక గొప్పదోషముగలదు. అది యేదియన మన దేశమందలి రాజకర్మచారుల

బోలివారును విద్రింపుచుందురు. అందువలన శాసనకార్యములు, శాసనపరిషత్తు కార్యముల యందు అనమర్థులను వేయవచ్చినది. జర్మనీ యందు సంచరించు నప్పుడొక మిల్లునందు తిరుగుచున్నటులుండును. కాని యాస్ట్రియా యందు సంచరించునప్పుడు సుఖాలదేశ



ఒక భూస్వామి.

మున విహరింపుచుండినటులుండును. జర్మనీ యందు గడియారమునుబోలి కార్యములు నడచుచుండును. కాని యిచట మానవులు మానవులుగనే పని చేయుచుందురు. యంత్రములలో భాగముగ మానవుడింకను మారలేదు. అందువలన నాస్ట్రియాయందు తిరుగునప్పుడు మానవుల కానందముగలుగు చుండును. అల్లు- ఆటంకములు- నియమనిష్ఠలకు వెలుపల సంచరించుచుండుటకు మానవుడెప్పుడును కోరుచుండును. జర్మనీనుండి యాస్ట్రియాకు వచ్చువాని కట్టి యానందము గలుగుననుట యతిశయోక్తిగాదు. ఆస్ట్రియాకు ముఖ్యనగరమగు 'వియన్నా' స్వాభావికసౌందర్యమునకలరారుచుండును.



ఫిడేలు వాయింపుచున్నాడు.

ఈ పురవాసులు నిరంతరము సహజ సరళభావమున ఆమోదప్రమోదముల కాలముగడుపుచుందురు. ఆనందతరంగములలీదుచుందురు. వియన్నా పట్టణమున కేగిన వాడు సంతసముననే కాలము గడుపక తప్పదు. అచ్చటి పరిస్థితులట్టివి. బర్లినునగరవాసులు కఠోరమగు ముఖభావము ఉద్యోగపూర్ణమగు గంభీ

దృష్టినో యుందురు. కాని వియన్నా నగరవాసుల చిరునగవుగూడిన మోము-కోమల దృష్టియు యాత్రికుల హృదయమునందానందమును గలిగింపుచుండును. ఈస్త్రీలు ధరించు వస్త్రులనే యనేక సభ్యజాతుల స్త్రీలనుకరింపుచుందురు. సుసౌందర్యమున వలరాజు స్త్రీలాదేశమందన్ని తరగతుల వారియందును గలరు. వీరు పిరికివారుగారు.

నగరవాసుల పద్ధతులు చాలవరకు పల్లెలయందును చిన్నచిన్న పట్టణములయందును వ్యాపింపుచున్నవి. సాధారణముగ ప్రతిదేశమునకును రాజధాని ననుకరించుట స్వాభావికమేకదా! అచ్చట పల్లెలయందు ధనికులు మొదలగువారెల్లరు మన దేశమందువలెనే వియన్నానగరమున నివసించుటకై ప్రయత్నింపుచుందురు. వియన్నానగరమందలిస్త్ర



వియన్నా పట్టణమందలి పండ్లబజారు.

విపత్తుల నెంత విచిత్రమైనను గణనచేయరు. ఎట్టి దుర్ఘటననైనను సాధారణ భావమున గాంతురు. రాజనీతి-వ్యాపారములయందు జిక్కుకొని తల బరువులగొట్టుకొనరు. వారి ప్రాణము నాటకములు-సంగీతము-నృత్యము-మొదలగు లలితకళలయందు మునిగి తేలుచుందురు. వనభోజనము - వనవిహారము మొదలగునవి చాల ప్రియమైనవి. వియన్నా

యిలంతయు రింగుస్ట్రీటునందుమాత్రే భవించియుండును. ఆస్ట్రియాయందుత్తర భాగమునను దక్షిణభాగమున నివసించు జనులు కృషకులు. సరళస్వభావులు. వారికి రాజకీయ సంబంధముగుజ్ఞానమే లేదనవచ్చును. అందువలన విదేశ రాజకీయములతోగాని స్వదేశ రాజకీయములతోగాని వారికి సంబంధమే లేదు. ఇట్లనుటవలన చదువురాని మూర్ఖు

లుగారు. బాగుగ చదువుకొనిన వారలు. ఉత్తమగ్రంథములను ఒరంపుచుం దురు. ఆస్ట్రియా యందంతటను గాలించి



ఈ స్త్రీ సీమరేగు పండ్లమ్ముచున్నది

వెదకినను నిరక్షరుడు వేయింట నొకడుండిన యుండవచ్చును.

జర్మనీయందువలె ఆస్ట్రియాయందు పట్టణములు వీధులు బాటలు మొదలగునవి పరిశుభ్రముగ నుండవు. మ్యూనిసిపాలిటీలు నిద్రమత్తుతోడ పనిచేయుచుండును. నవుకరులు చటపటకార్యములోనద్భుత కార్యచతురులుగారు. అయినను వారికార్యములు వారే చక్కబెట్టుకొనుచున్నారు. భారతీయులమగు మనము సోమరితనమందగ్రేసరులము. స్వరాజ్యము వచ్చినచో ఆస్ట్రియావారిని బోలి



కూలివాడు.

మన కార్యములు మనము చక్కబెట్టుకొనగలుగునుటకు సంశయింపవలసిన పనిలేదు.

ఆస్ట్రియాయందు "క్రిస్టియన్ సోషలిస్టను" పేరున నొకరాజకీయసంఘమున్నది. వీరు పేరుకు సోషలిస్టయినను కార్యమున కాకుండుటయే గాక తద్విపరీతముగ వీరప్పుడును ధనికుల స్వార్థమును రక్షించుటకై యత్నింపుచుందురు. వీరి ప్రయత్నములు

కృషక సాంప్రదాయ సంఘములకు దోడ్పడుచున్నవి. వీరి యనుగ్రహము వలననే యాస్ట్రియాయందలి తినుబండారముల మూల్యమత్యద్భుతముగ పెరిగిపోయినది. సోషలిస్టను మాటకు బాహ్యంభమున క్రిశ్చియన్ యను నొక విశేషణమున్నది నిజము చెప్పవలసినచో క్రిశ్చియన్ యను శబ్దమునకు వీరయోగ్యులు. యుహాదీయులతోడ వీరనిరంతరము నివసించు చోటు కుదప్ప మిగిలిన చోట్లనివసించుటకు వీలులేకుండెను. యుహాదీయులుండువల్లెను 'ఘెట్టో', యని పిలుచుచు అసహ్యించుకొనుచుండిరి. వారికి యింటి స్థలము భూములు మొదలగువానిమీద యెట్టి యధికారము లేకుండెను. కాని పందొమ్మిదవ శతాబ్ద మధ్యభాగమున ఆస్ట్రియా గవర్నమెంటు యుహాదీయుల



పూర్వకాలపు దుస్తులు.

కలహింపుచు వారిపైన యత్యాచారముల నల్పుచుందురు. వీరొనర్చు యత్యాచారముల దలంచిన యే సభ్యజాతులైనను తల వంచుకొనవలసినదేను. ప్రథమమున యుహాదీయులను యస్పృశ్యులు అనాచారులుగ జేసిరి. అప్పుడు యుహాదీయులు వారు కష్టనివారణ కొరకు నూతన శాసనమును జేసిరి అంత మాత్రముననే ప్రజలయందు బాతుకొనియున్న మూర్ఖత్వము దొలంగ లేదు. ఇప్పటికిని యుహాదీజాతికి సంబంధించిన వాడున్నతోద్యోగమును పొందజాలడు. కమొందరు పదవి లభింపదు.

అయినను పదవుల యందువారి కంతగా యీయాన యులేదు. వర్తకమునందు పేరున్నతస్థాన మాక్రమింపు చున్నారు. ప్లీడర్లుగను ఉపాధ్యాయులుగను గణనకెక్కు చున్నారు. క్రిశ్చియన్ సోషలిష్టుల ముఖ్య సూత్రము యుహూదీయులబడగొట్టుట. దీనికి వ్యతిరేకముగ "నేషనలు డెమోక్రాట్సు, అను వారు బయలుదేరిరి. అందుయూహ



బ్యాండు.



కృషకపరివారము.

దీయులు మిక్కుటముగ జేరుచున్నారు. ఈసంఘమును నిర్మించి ప్రాణపణముగ ప్రయత్నించి యభివృద్ధికి దెచ్చినవాడు విక్టర్ పడ్లాక్, అను మహాపురుషుడు. ఈయన యుహూదీజాతికి జెందినవాడు. సామ్యవా - సమితియే యీసంఘము యొక్క ముఖ్యసూత్రములు. కా ర్మిక నిర్దిష్ట ... కార్యపరిణాలి ... యొక్క విషయము మా త్రము గోచరించును



కృషకులు మతసంబంధమగు నాటక మాడుచున్నారు.

అదియొంది యున, ప్రశ్రేసే వాడయి నను మరియొక శ్రేణివానికంటె యాధిక్యుడనని యనుకొనకుండుటకెల్లప్పుడు ప్రయత్నించుచుందురు. జనసంఘము నందు గొద్ది గొప్పలను భేదమును దొలగించుటకు ప్రయత్నములు చేయుచుందురు. పురోహితులు మొదలగువారి ప్రతాపమును నడంచుచుందురు. ఈవిషయములు వారి



కొట్లా గొట్టుచున్నారు

వలనచాలవరకభివృద్ధిగాంచెను. మైనరువెళ్ళిన ప్రతివానికిని ఓటుయుండవల యునని వారొనర్చిన ప్రయత్నము సాఫల్య మైనది.

నలుముఖముల సరిగ పరిశీలించి చూచిన మొదల ఆస్ట్రియాయందు గిణతంత్రి ముయదార్ధముగనున్నటుల మరియొక దేశమందు లేదని నుడువ వచ్చును. సిరింత్రో తుల్యముగ జూడదగిన వారు రుష్యాదేశస్థులు వీరిలయందు దిగువను పిచ్చమొస్తు కాని జీవించువారు కూడ యోగ్యతవలన ప్రధానమంత్రి పదము సంపాదింప వచ్చును. ఆస్ట్రియాయందలి రాజ వంశీకులమని నుడువు వారికిజాతి పోవునను భయమను మాత్రమైనను లేదు. అందువలన మంత్రి మొదలగునట్టి యుద్యోగముల కెవరు వచ్చినను జంకరు ఆస్ట్రియా యందలి సైన్యములయందు జాతి భేదములు లేవు. సైన్యాధ్యక్షులతో చాలమంది మధ్యతరగతికి సంబంధించిన వారలేను. సామాన్యుడగు సైనికుడు శౌర్య సాహసముల వలన సైన్యాధిపతిగావచ్చును. కాని సైన్యాధిపతుల యందు యోగ్యులు, అసమర్థులగువారుచాలమందిగలరు. వీరిసైనికగణము

తీవ్ర... స్వభావులు ... చూచు టకు సాత్వికులు ... వేష ... కాడ తననుగుణ్యముగనే ... బుద్ధియందుసామాన్యులు. శత్రువులుగ



అరణ్యమార్గముల బోవు బాటసారులు.

చూచినను భయంకరులుగారు.

నారిముదినములు ... సము నాడు విశ్రాంతిసైన్యము ... ంత స ... కాలముగడుపుదురు. ... స్త్ర

ములు ధరింతురు నాటకములు సంగీతము వన విహారములయందు మునిగి తేలుచుందురు.

వీరిలో పురుషులు పాదములవరకుండు చొక్కాను తొడుగుకొందురు. కాళ్ళకు బూట్సుండును. సాధారణముగ నెప్పుడు తలకు టోపీని బెట్టుకొందురు. ఒక్కొక్క ప్రాంత్యమందలి స్త్రీలొక విధమగు దుస్తులధరింతురు. కాని వారుధరించు వస్త్రములు పద్ధతి మొదలగునవన్నియు సుందరముగనే యుండును ఒక్కొక్క ప్రాంత్యమందలి స్త్రీల దుస్తులయందు డాంబిక మెక్కువగనుండును.

గతించిన సంగ్రామమందు ఆస్ట్రియా వారికి గలిగిన నష్టము వర్ణనాతీతము. యుద్ధమునకు పూర్వము ఆస్ట్రియా యొక్క సామ్రాజ్యమై యుండెను. అప్పుడు వారు పరులమీద నాధారపడకుండిరి. కానియిప్పుడు ముఖ్యమైన బొగ్గుగనులు లోహపుగనులు పోయినవి. సముద్ర తీరములు వీరిచేతినుండి దప్పినవి. వియన్నా పట్టణము వీరికి రాజధానిగనేయున్నది. కాని రాజ్యమునందలి యైశ్వర్యమంతయు బోయినది. ఇప్పుడు వీరికి భూమిమీద పండు పంటలు తప్ప మరియొక యాదాయము లేదు. పచ్చు మార్గములన్నియు బంధింపబడినవి.

బొహీమియా, మొరావియాయను ప్రదేశముల యందు మంచి గనులున్నవి. కాని ప్రదేశములు రెండును జెకోస్లావియుల స్వాధీనమైనవి. గ్యాలిసియాయందలి ప్రసిద్ధములు నూనెగని పోలండు యధీనమైనది.



వియన్నాయందు ఫలపుష్పములు మొదలగునవి యమ్ము స్త్రీ ౧దు కాఁఱు.

కార్పెథియాను నందు మంచియరణ్యములు గలవు. ఆప్రాంత్యములన్నియు పరులయాధీనమైనది. విశ్వవిఖ్యాతిగాంచిన గుర్రములు లుండు గ్యాలీషియాకూడపోయినది. యుద్ధమువలన

యున్న వారి స్వభావము మొదలగు వానిని దెలిసికొనుటకు వారి కెక్కుడు కాలముబట్టను పోలీసులు ద్వార పాలకనిద్వారమున వీరి మంచి చెడుగులు గనుగొనుచుందురు.

గవర్నమెంటెప్పుడును తమకు విరుద్ధముగ కుట్రలు జరుగుచున్నవని దలంపుచుందురు. కర్మశాలాచారులెల్లరుదామే దేశమునకు శాసనకర్తలమని దలంపుచుందురు. దేశవాసుల జీతముదినుచున్న భృత్యులమను విషయము వారికనుమాత్రమైనను లేదు. రాజకీయోద్యోగమును సంపాదించుటకు యువకులు చేయు ప్రయత్నము వర్ణనాతీతము. విశ్వవిద్యాలయముల నుత్తీర్ణమైన వారందరు యుద్యోగములు ప్రయత్నించుచే యుందురు. న్యాయశాస్త్రమును చదివిన వారుగూడ ప్లీడరుపని చేయక యుద్యోగములకై కాచుకొని యుందురు. తగినంత కాలము బడియున్న గాని యెవ్వడును నున్నతస్థానము నాక్రమింపజాలడు. స్వీయశక్తివలన నభివృద్ధిగాంచుట దుస్తరము ప్లీడరుపరీక్ష నిచ్చిన వారిలో చాలమంది వర్తకము చేసికొనుచుందురు.

పత్రికాస్వాతంత్ర్యము చాలవరకు బంధింపబడినది. వార్తాపత్రికలను ప్రచురింప నిషేధింపలేదుగాని విక్రయమును నిషేధించిరి. పత్రికలను పిల్లలు మొదలగు వారు విడిగ విక్రయించుటకు వీలులేదు. పుస్తకముల షాపులయందు మాత్రమమ్మవచ్చును. ధనార్జనకు సంబంధించిన విద్యను స్త్రీలకు జెప్పుచున్నారు. దేశమందు బీదల గుడిసెలు గూడ పరిశుభ్రముగ నుండును. వారు సంతసమున కాలముగడుపుచుందురు. దొంగతనము మొదలగునవి వారిలోనంతగా గానరావు

ఈ దేశస్థులలో చాలమంది రోమను క్యాథలిక్కులు. పురోహితులకు మర్యాద మిక్కుటము. వారి యుపదేశముల ప్రకారము ప్రజలు నడచుచుందురు. లలితకళలయందొకప్పుడీ దేశము ద్వితీయమైయుండెను. మహాయుద్ధమువలన సమస్తము నశించి క్షీణచ్ఛము మైయున్నది.

~~~
~~~

# భిన్న ప్రకృతులకు మైత్రి*



భారతవర్షమందు విదేహ అను దేశముండెను. దానిరాజు పేరు విదేహుడు. అతడు వరండాయందు పచారిచేయుచు నవ్వుచుండెను. ఒక్కొకమారు నవ్వు మిక్కుటమగుచుండెను. కాని యాతడు మిక్కిలి గంభీరస్వభావి. ఆ నవ్వును చూచి రాణి యగు ఉదంబరాదేవి యాశ్చర్యపడజొచ్చెను.

కారణమేమన రాజు పశువులశాలయందొక యత్యద్భుతవిషయమును దిలకింపుచుండెను. ఒక కుక్క, మేక యచటనుండెను. కుక్కనోటకొంచెము గడ్డియు, మేకనోట నొక మాంసఖండముగాన్పించెను. అవి పరస్పర మానందముగ దిలకింపుచుండెను. మేక దెచ్చిన మాంసఖండమును కుక్క దినెను. కుక్క దెచ్చినగడ్డిని మేకదిని యొకదానినొకటి యాసుకొని పరుండెను. కొంతపడికవి యటనుండి బయలుదేరి రెండువైపులకు పరువిడెను. మహారాజు వీనివిషయమును కొన్నిదినములనుండి గమనింపుచుండెను. విపరీతప్రకృతిగల యీ జంతువులరెంటికి స్నేహమెటుల కుదిరినదని యాతడు యోచింపజొచ్చెను.

ఈ రెంటికి స్నేహముకుదురుటకు కారణమిది. రాజాగారి యేనుగులశాలనుండి పచ్చిగడ్డిని దొంగిలించి మేక మేయుచుండెను. అదిచూచి మావటివాడు మేకనుచావ చితుకగొట్టెను. అది దెబ్బలుతిని వంటయింటి వెనుకవలకువచ్చి నిలుచుండ యచ్చటికి కుక్క కుంటుచువచ్చెను.

అప్పుడుమేక యిట్లనియె" కుంటుచున్నా వెందుకు? ఎవరుగొట్టిరి?

కుక్క= నీవిట్లున్నావేమి? నీపనియేమయినది?

మేకతన విషయ మంతయు దెలిపి చెప్పెను. కుక్కకూడ వంటయింట మాంసపు ముక్కలను దొంగిలించుట దెబ్బలను దినుట మొదలగు విషయమును దెలియచెప్పెను. అంతట వానికి మిక్కిలి స్నేహము కలిగెను. అప్పుడు మేకయిట్లనియె! నేను వంటయింట బ్రవేశించి మాంసపు ముక్కను దొంగిలించి నీకొరకుదెచ్చి యిత్తును. నన్నెవ్వరును మాంసపు ముక్కల నెత్తుకొని పోయెదనని యనుమానపడరు.

కుక్క= అట్లయిన నీవేమితిందువు?

మేక= మాంసము నాకెందుకు? గడ్డికావలయునని నీవు ప్రదినము ఏనుగల శాలకేగి గడ్డిని దొంగిలించుకుని రమ్ము. దానితోడనాకు తృప్తినిండును.

కుక్క= పకపక నవ్వుచు మంచిమార్గము, మంచి యుపాయము. నేను గడ్డితినను. అందువలన గడ్డిదొంగిలించు నని యెవ్వరును అనుకొనరు.

అప్పటినుండియు మేక కుక్కకొరకు మాంసపు ముక్కలను దొంగిలించుకొని వచ్చి యిచ్చుచుండెను కుక్క మేకకొరకు గడ్డిని దీసికొని వచ్చియిచ్చుచుండెను.

రాజువిషయమును గాంచియే నవ్వుచున్నది—

---

* ఇదియొక సింహళదేశపుకథ. దీనిని సిటిజన్ అను పత్రిక ప్రచురించినది.



# ద్వితీయాంధ్ర నటసభ అధ్యక్షోపన్యాసము *



## I నాటక కవిత్వము.

నాటకములందు పద్యము లుండవచ్చునా? ఎచ్చట? ఎట్టి నియమములతో వాని నుపయోగించవలెను? వానిని నెటుల చదువవలెను. సంగీత మెంతవరకు వాడదగును. అను ప్రశ్నలు పలువురచే పలువిధముల చర్చించ బడినవి.

ఈ సంశయమునకు మూల కారణము నాటకము మానవ జీవిత సందర్భములను మానవలోకము నందగుపడెడి వ్యావహారికావస్థలను ఉన్నవి యున్నట్లుగ చూపవలెననెడి కోరిక. ఇది సమంజసమని తోచదు. నాటక మొకకళ, దీనిని రచించువాడు నాటకకవి. ఇతడు జీవితావస్థలలో తనకు ఉదారభావభరితములుగను, రస వంతములుగను హృద్యములుగను, దోచెడి పట్టులను గైకొని అవి తనబుద్ధిలో వ్యక్తిప్రభావముచేతనొందెడి పరిణామభేదములతో నివేదించి నాటకమునందు గూర్చి రచించును. అచ్చటనే కొంత భేద మేర్పడినది. అవల నటకుడు కవి విరచిత వాచకమును చదివి తద్రూపమైన స్వకీయలోకానుభవములతో సమన్వయించుకొని తన కర్థమయిన రీతి నభినయించి చూపును. ఇచ్చటగూడ కొంత వ్యక్తిసాంకర్య మేర్పడుచున్నది. ఈ విధముగ నాటకము దృశ్యమానమగు నప్పటికి కొంత మానవ వైచిత్ర్యము అవస్థానిరూపణమందు సంక్రమించి నాటకమునకు కళాస్వరూప మొసంగుచున్నది. కేవలము లౌకిక యాథార్థ్యతతో

* విజయనగరమున జరిగిన ద్వితీయాంధ్ర నటసభాధ్యక్షులగు శ్రీయుత పెద్దిభొట్ల వెంకట చలపతిరావు బి. ఏ. బి. యల్. గారి అధ్యక్షోపన్యాసము.

జీవితాంశములను నిరూపించునది కళ యన వెల్లదు. కొంత వైచిత్ర్యము, యతిశయోక్తి అలంకారసంపద, ప్రత్యేక రామణీయకము కలిగి నప్పుడే కావ్యములుగాని, నాటకములు గాని, ప్రేక్షకహృదయములయందు అలౌక్యమైన రసస్ఫురణ గలిగించును. నిర్విషయానందము గల్గించుటయే కళలముఖ్యోద్దేశము. అందుచేత పద్యములు, పాటలు, దుస్తులు, రంగాలంకారములు, మొదలగు (అలౌకిక విషయములు) కొన్ని నాటకములందు చేర వలసియుండును. ఇప్పుడిందుకు వ్యతిరేకముగ జరుగాడి యాందోళన మంతయు వాని యమిత ప్రయోగము వలన సంభవించినది.

గద్యమునకు పద్యమునకు నిక్కముగు భేద మేర్పరచ జాలను. భావము ననుసరించు వాగ్వైఖరు లేర్పడును. మనముఎంత వలదన్నను, సామాన్య సంభాషణము కూడ కొన్ని సమయములలో రసభరితమగునప్పుడు పద్య వాఙ్మయమున కుచితమయిన గతులలో నేర్పడును. ఇట్టితావుల, నింతటి రసస్ఫూర్తి, భావగౌరవము, యేర్పడిన పట్ల పద్యము లుండిననే, రమ్యముగ నుండును. పద్యములు గణక్రమములలో తాళప్రధానములై రచింపబడును గాన, రసవత్సందర్భములం దేర్పడు గద్యమునకు నివి భిన్నములని కొందర నవచ్చును. కాని సరళముగ వ్రాయబడిన ధారాశుద్ధిగల పద్యములలో గణములు, విశ్రాంతులు, గానరాకుండును. అవియు కొంచె మించుమించుగ గద్యము వలెనే నడచుచుండును. ఆవిషయము పూర్వకవుల పద్యరచన్నముచేత నిదర్శితము గుచున్నది. సామాన్యపు సందర్భములయందును గద్యములలో చెప్పదగిన పట్లను పద్యముల నుపయోగించ రాదనియే నాతలంపు. పద్యముల విషయములలో శ్రీయుత పానుగంటి లక్ష్మీ నరసింహారావుగారు, నాటకము లందు గీతపద్య మొకటియే యుండదగునని చెప్పుచున్నారు. కాని వీరివాదముతో నేనే కీభవింపజాలను. గద్యమునకు సన్నిహితమైన వృత్త విశేషనుని వీరు "గీతము" నభిమానించినారు. కాని కేవలము గద్యయుండే నాటక ముండవలసిన నియమము సిద్ధాంతీకరింపబడ లేదు. నాటకమందు చేర దగిన కళావైచిత్ర్య సంపాదకములగు నలంకార విశేషములలో పద్యమొకటి మన్నింపదగి యున్నది. కావున రసోచితమగు వృత్తముల నేర్పరచి ఉపయోగించుట యందు మాకెట్టి యాక్షేపణయు కనుపించదు.

పద్యముల జదువు పద్ధతిని గూర్చి కొందరు వికృతాభిప్రాయముల వెదజల్లుచున్నారు. భావాభినయమున కడ్డమువచ్చు నటుల పద్యములుండుట మంచిది కాదు. పద్యములు పాడదగినంత భావ విశ్రాంతి కలిగినప్పుడే వాని నుపయోగించ దగునని చెప్పితిని. కాన అట్టివిశ్రాంతికలిగినతావున పద్యమునకు సహజమగు శృతి రాగ, సౌందర్యములు శోభిల్లునట్లుగ, నేలజదువకూడదో తెలియదు.

సంగీత ప్రయోగము అర్థమునకుప్రతిబంధకమగు నటులగాక, పద్యాంతర్గతమైన భావము నుద్దీపించునదై రసపుష్టిగల్గించునంతవరకుండవలెను. అంతకుమించిన వృధాసంగీతవిజృంభణము నాటకములందుండ రాదు.. రూపకములలో సంగీతము సుస్వర సంపా

దనో పాయముగ నెచందగునేకాని యొక ప్రధానాంశముగ మన్నింపకూడదు. రస భావయుక్తమగు వృత్తములందు పద్యముల గల్పించి వాని నుద్దీపింపగల రాగములలో పాడవలెను.

పార్సీమట్లు పద్ధతిలోను అరవ నాటకముల తెరవువనుయిచ్చ వచ్చినచోట అభినయ విభ్రంశ మేర్పడునట్లు పాటలను యిరికించు మర్యాద నాట్యకళ కెంతయు ప్రమాదజనకముగ పరిణమించు చున్నది. పాటలనుకూడ పద్యములవలెనే తగిన విశ్రాంతి కగిలినప్పుడు అభినయము ప్రధానముగాని తావుల పాడవచ్చును. పాటలలో సంభాషించుట (Dialogue), అనుచితమునాయికానాయకులు నారదాది భక్తులు, యేకాంతముగ ప్రకృతి రామణీయకమును చూచి యానందించునప్పుడును భక్తిశాంతరసములలోను పాటలుండదగును. కాని రసభావ సంక్షోభము కర్తవ్యతా విచారణము ఎక్కువగ నుండు స్వగతోపన్యాసములలో పాటలు పద్యములుండగూడదు. పాడవలసినచో విజాతీయ గాన ఫణతులకన్న కర్ణాటక సంగీత పద్ధతులనే వాడుట మన జాతీయస్వభావ సూచకంబుగ నుండును.

నాటక పాత్రముల కుపయోగించవలసిన భాష యెట్టిదిగ నుండవలెను. కవి రచించు నంతవరకు యేజాతి వారికైనను వాని లౌకిక పదవిని సంస్కారమును గమనించి పాత్రోచితమయిన భాషనుపయోగించవలెను. కాని ఔరంగజేబు మొదలగు విజాతీయ రాజపాత్రములకుగొంచెము తేలిక శైలిలో నిర్దుష్టముగ నుండెడి భాషనే వాడవలెను వారిభావములుదార లక్షణముల నుప్పుచునే యుండవలెను. నటులీభాగమును ప్రదర్శించు నప్పుడు హాస్యాస్పదము కాకుండా గొంచెము విజాతీయోచ్చారణ వైఖరి ద్యోతక మగునటుల నభినయించ వలెను. ఇట్టి పాత్రములకు పద్యము లుండగూడదు.

కొందరు నాటక కవులు గ్రామ్యవాద మంగీకరించి సామాన్య సంభాషణ శైలిలో నాటకముల వ్రాయ నారంభించినారు. నాటకముయొక్క ముఖ్యప్రయోజనము ప్రదర్శనీయత. అభినయమే నాట్యకళయందలి ముఖ్యాంశము. అభినయమును నిరోధించెడి సంగీతము హేయమగునటులనే నటులకును, ప్రేక్షకులకును, దుర్గ్రాహ్యమగు పదగుంభనముగూడ, కావ్యఫణతులుకూడ, నాటకములయందు గర్హ్యములగుచున్నవి. రూపక కావ్యవిరచనము సులభముగ సుబోధకముగ నుండవలెననుమాట విస్సంశయము. కాని గ్రామ్యరూపములగు భాషాప్రయోగ పద్ధతులు అవలంబనీయములని తలంచను. అందువలననుగలిగెడి సుబోధకత్వ మేమియు లేదు. మరియు సక్రమముగ గ్రామ్య గ్రాంధిక విభేదము భావమున కంటియుండునుగాని భాషకు చెందియుండదు. భావవిస్పష్టతవలనను, సౌలభ్యమువలనను, గ్రామ్యసంకాశమగు భాషా వైఖరులేర్పడును. భావ ముదారమయిన కొలది భాషయు ననురూపవిస్తార ముందుచుండును. అందుచేత గ్రామ్య గ్రాంధికముల కొరకు పూనికతో పెనుగులాడక, సందర్భోచితముగ వీలగు నంతవరకు నిర్దుష్టముగ తెనుగు బాస నుపయోగించ వలెననియే మాసిద్ధాంతము. నీచపాత్రముల పట్ల వారి ప్రత్యేక,

స్వభావమును నిరూపించెడి భాషావైచిత్య్రముండవచ్చును. నటులు పాత్రస్వభావ మెఱింగి తదనుకూలముగ నుచ్ఛరించుటలో వలసిన మార్పులను చూపవచ్చును. కన్యాశుల్కము మొదలగు సాంఘిక నాటకములందున వివిధ పాత్రల జాతీయతా నిరూపణమే ముఖ్యాంశము. ఇందు పాత్రోచితముగా గ్రామ్యభాషనే వాడవలయును.

తెలుగు నాటకములు ప్రాచీన సంస్కృత రూపక మర్యాదలను అనుసరించవలెనా? లేక యిప్పటి వరకును యికముందును తెలుగువారికి సంక్రమించెడి నానావిధములగు రూపకాదర్శముల ననుసరించి యుండదగునా? నాటక నాయకుల స్వభావ మెట్టిదిగ నుండవలెను? కష్టాంత నాటకములు భారతీయ జీవిత లక్ష్యములతో నేకీభవించుచున్నవా? మున్నగు సందర్భముల గూర్చి విమర్శకాభిప్రాయము చాలవరకు యేకీభవించి యున్నట్లు అగుపడును. కష్టాంత నాటకము లుండ వచ్చునను నభిప్రాయముతో నేనేకీభవించుచున్నాను. ఇవి యభినయమునకును, భావప్రకటనమునకు, నెక్కువ అవకాశమిచ్చుచున్నవి. కొందరు నటులు బయస్కోపులలోని పాశ్చాత్యాభినయ వైఖరులను ఆదర్శములుగా మన్నించి ముఖ్యముగ కష్టాంత నాటకములందు అతి తీవ్రమగు ముఖ హస్తాదులను చూపుచున్నారు. కష్ట నాటకములు, మనుష్యుడు దుఃఖ మనుభవించుచూ చించుకుని, చీదరపడుట కేర్పడినవి కావు. కష్ట సుఖములు కాల పరిణామమున అనివార్యములై వచ్చుచుండ, ధీరపురుషులు హాని లాకిడి నొకింత చెందియు, తమ ధీరత్వముచే వానినెల్ల జీర్ణించుకొని యొక విశిష్టమైన శాంత చిత్తముతో వాని నోర్చుకొనుచుందురు. ధీరనాయకులు లేని కష్టనాటకములు బయస్కోపు అభినయముల కవకాశమిచ్చుచు నీరసముగ, పేలవముగ, నుండి నాట్యకళకు బదులు, నాట్యాభ్యాసమునకు కారణమగుచున్నది. కష్టాంత నాటకముల నిజస్వభావ మెఱిగి రచింపబడినచో నవి మన రంగమున మిక్కిలి యాదరింపదగినవై యున్నవి. ప్రాచీనాలంకారికుల లక్షణములు ఆనాటికి వారికి లభ్యమైన నాటకస్వరూపములను వర్ణించునవిగ నెంచదగును కాని సర్వకాల సర్వావస్థలలో కవిప్రతిభను, నటకౌశలమును శాసించగల సిద్ధాంతములుగ నెంచగూడదు. తెలుగునాటక మనేక క్రొత్తదారులలో పెంపొందవలసియున్నది. ముఖ్యముగ చారిత్రిక నాటకములు, సాంఘిక నాటకములు, ప్రహసనములు, కావలసియున్నవి. ప్రాచీన పౌరాణిక గాథలందు విలసిల్లు ధర్మములకు నవీన కాలోచితమయిన యర్థములను సమకూర్చి ప్రయోజనకారులుగ చేయవలెను. కొందరు నటులిట్టిభాషావిస్తరణ మొనర్చుచున్నారు. కాని నాటకకవులు యికాలమున కనుకూలమైన భావవిమర్శనముతో తమ నాటకములను రచించుటలేదు. డి. యల్. రాయి గారవలంబించిన పద్ధతులను మన నాటకకవులు గమనింపవలసియున్నది. ఆంధ్ర చరిత్రాంశములు వెల్లడియగునట్లుగా ఆంధ్రుల దేశాభిమానము మతాభిప్రాయములు నైతికవర్తనము విశుద్ధోదారమార్గముల నడచునట్లుగా, నాటకవిరచన మేర్పడవలెను.

మన జాతీయజీవన ప్రతిష్ఠాపనకు నాటకకవు లెంతయు సహాయ మొనర్చవలసి యున్నారు.

## II నట వ్యవహారము.

నటుడు తానభినయించెడి పాత్రతో నెంతవరకు తాదాత్మ్య మొందును? రసమునట నిష్టమా లేక, సామాజికనిష్టమా అను చమత్కారమును స్వయముగూర్చి నాస్వీయానుభవమును బట్టి తాదాత్మ్యము కేవలము తెచ్చిపెట్టుకొనిన దనియు, అదియొక అభినయ విశేషమే గాని, నటుని యది గాని, నటుడు నిక్కముగ రసానుభవ మొందడనియు వీని చేష్టలజూచి సామాజికులే రసమనుభవించుదురనియు నాదృఢాభిప్రాయము. నటవిషయములో యింతకన్న గొప్పయంశము యేమనగా యిప్పటియభినయవైఖరులు నటుల ప్రతిభావిశేషముల నాశ్రయించి స్వతంత్రరీతుల నడచుచూ, పరిమాణవిహీనముగ నున్నవి. భారతీయ నాట్యశాస్త్రపద్ధతులను అవలంబించిన భాగవతులు, సపరిమాణముగ నభినయించుచున్నారు. వీరివిద్యాకౌశలములు తరువాతి నటసంతతుల కందించదగినంతటి సిరూఢతతో నున్నవి. వానికి లక్షణములు గలవు, అట్టి సూక్ష్మాభినయము నవీనరాంగిక నాటకములయందు పనికిరాకపోయినను, ఇప్పటికి వాక్యార్థాభినయములో కూడా ప్రసిద్ధనటుల పద్ధతి రాగల చిన్నవారలకు బోధించవలసిన యవసరమున్నది. ఈసభవారును యిందున గూడిన నాట్యవిద్యారహస్యవేత్తలును యీ విషయమును గూర్చి చక్కగ నాలోచించి నవీననాటకాభినయమునకు లక్షణ మొసంగవలసియున్నది. అభినయవైఖరులలో లక్షణమేర్పరచ గూడదనియు, కథాంశమును పాత్రస్వభావమును రసజ్ఞులచే చక్కగ బోధపరచి, అభినయమును నటునకే వదలవలయుననియు, నటుడు తన స్వకీయ రసానుభవములను, లోకానుభవములను సంపూర్ణముగ వెల్లడించెడి యవకాశము లుండవలెననియు నాయభిప్రాయము. బెజవాడలో శ్రీయుతులు బి. టి. రాఘవాచారి, గూడవల్లి రామబ్రహ్మ చౌదరిగార్లు భరతమునిబృంద మనుపేర నొక నాట్యవిద్యాలయ మేర్పరచ దలచినట్లు వినుచున్నాము. ఇట్టి ప్రతిష్ఠాపనము లవసరమే యగును, కాని, నాటకసమాజములే నాట్యవిద్యాలయములుగ నుపచరించుట మరింత సమంజసము.

స్వతంత్ర జీవనములలో ప్రస్తుతము నాట్యవృత్తి మనబాలుర కవలంబనీయముగ దోచుచున్నది. ప్రజలకు వినోద మొనర్చుచు సరసరీతుల నాట్యకళ నుపాసించుచు, భుక్తికిని ముక్తికిని నాట్యరంగము నొక సాధనముగ పలువు రుపయోగించుకొనదగిన సూచనలగుపడుచున్నవి. ప్రజాభిలాషకు అనురూపమైన సురక్షితనటవర్గ మింకనూ బయలుదేరలేదు. ఎక్కడనో అచ్చటచ్చట నాత్సాహిక నటులలో మాత్రము శ్రీ తాడవర్తి రాఘవాచారి గారి వంటి వరను లున్నారు. నటజన సామాన్యమునకు నాట్యకళకు సంబంధించిన వివిధ విషయములను బోధించగలవిద్యాలయముల నెలకొల్పు ప్రయత్నము లీ సభ వారు విచారించవలసి యున్నారు. మరియు నావిద్యాలయములలో నటశిక్షణ జరుపవలసిన రీతులను గూడ విచారింపవలెను.

## II రంగములు నాట్యశాలలు.

ఈ విషయములో నిప్పటి విమర్శకు లందరితో నేను యేకీభవించుచున్నాను.

రంగాలంకారములనువీలగునంతవరకుతగ్గించి నటశిక్షణమునకును సరసనాటక విరచనమునకును ఎక్కువ సొమ్మును పయోగించుట మంచిదని తోచుచున్నది. ఇప్పటి సమాజములు నటులకు గొప్ప పారితోషికముల నిచ్చుచు, మితిమీరిన సీనరీ గుడ్డలపై తమ యాధారమును వెచ్చించుచున్నారు. వీని యన్నిటికన్న ప్రధానమగు నాటక కవిత్వమునకు ప్రోత్సాహ మొసంగకున్నారు. మంచి, స్వతంత్రకల్పనగల నాటకములు పుట్టకున్నవి. నాటక సమాజములు రూపక కవిత్వమున పోటీపరీక్ష లేర్పరిచియు, ప్రసిద్ధకవులను పోషించియు మంచి నాటకములు వచ్చునట్లు జేయవలెను. సమాజములు సమర్థులైన సూత్రధారులను యేర్పచుకొని వారి నియమములకు లోబడి నాట్యాభ్యాసమొనర్చుచుండుట శ్రేయస్కరము. అభినయశిక్ష సరస రూపక రచనము ముఖ్యాంశములు కాని రంగప్రసాధన మంతగా శ్రద్ధ వహించవలసిన సంగతి కాదు. మరియు నాట్యకళ కొరకొక ప్రత్యేక పత్రిక యుండవలెను. అట్టి ప్రయత్న మిదివరకు యీయూర శ్రీ మల్లాది విశ్వనాథశర్మ గారిచే చేయబడినది. మరల శ్రీ రామ బ్రహ్మ చౌదరిగారు మరియొక పత్రిక నెలకొల్ప నుద్దేశించినారని వినుట సంతుష్టికరముగ నున్నది. నాటకాభిమానులీ ప్రయత్నమును సర్వదా పోషించవలెను,

## IV ఆర్థిక వ్యవహారములు.

ఇందలి ప్రధాన సమస్యలు సభ్యులెల్ల రెరింగినవే. కేవలము నోత్సాహికములుగ నాటక సమాజములను నడిపించు కాలము గతించినది. నటులకును, సమాజాధికారులకును యెట్టివిధమైన వ్యావహారిక సంబంధము లుండవలయునో? నాటక సమాజములు తమలో తాము యెట్టిమర్యాదలతో మెలంగవలెనో యీ సభవారు విచారించవలసియున్నది. మనతీర్మానములలోను ప్రజాభిప్రాయము కూడ నాటకసమాజముల సుస్థిరతకు కారణము కావలసియున్నది. నాట్యోపజీవులు వేతనము గొనుటకన్న వాటాలు వేసుకొని సహకార పద్ధతి నవలంబించినచో నాటక సమాజముల దుస్థితి తీరునని నేనభిప్రాయపడుచున్నాను. ఇంతవరకు ఒక్కని చేతిమీద నడిపింపబడిన సమాజము లన్నియు నష్టపడినవనియే చెప్పనచ్చును.

## V సంఘము, నాట్యకళ.

ప్రజలు వినోదార్థము నాటక ప్రదర్శనముల జూడవచ్చుచున్నారు. కాని నాట్యకళను జాతీయ మహోన్నతీ సంపాదనకు వలయు సాధనోపాయములలో నొకటిగ మన్నించు కాలమింకను వచ్చియుండలేదు. అచ్చటచ్చట గొందరు రసికులు తమ యభిప్రాయములను విమర్శన రూపమున వెల్లడించుచున్నారు కాని, వీరి యుపదేశములుగాని, ప్రస్తుత నటసభవారి ప్రయత్నములుగాని, నటులను, నాటక సమాజాధికారులను, ఆకర్షించి నటుల గనుపడదు, దేశములోని విద్యాధికులు, ధనవంతులు, ఉద్యోగపరాభ్యున్నతి వడసినవారు, నాట్యకళపట్ల నుదాసీనులై యున్నారు. దేశమందలి సమస్త సందర్భములను సంస్కరించుటయందు నాట్యముపయోగించినంతగా పత్రికాదులుగూడ నుపచరించవని చెప్ప

వచ్చును. నాట్య సహాయమున మతాభిమాన మేర్పరచ వచ్చును. జాతీయాదర్శముల నెలకొల్పవచ్చును, సంఘ లక్ష్యములను సంస్కరించి విశుద్ధ ప్రశాంత జీవిత పద్ధతులలో నడిపించ వచ్చును. కల్పనా ప్రాశస్త్యమున వాఙ్మయ శిరోభూషణముగ నంగీకరింపబడిన నాటకము జాతీయాదర్శ నిర్మాణ మందునకూడ ప్రధానసాధనముగ నుపయోగించగలదు. ఈ సందర్భమును గుర్తించి దేశములోని పెద్దలందరు నాట్యకళనుద్ధరింపయత్నించవలెను. నటులు, సమాజాధికారులు, ధనార్జనమే పరమ ధర్మముగ నెంచక నాట్యకళ నొక పవిత్రమైన. మోక్షదాయకమైన, యుపాసన విశేషముగ నెంచి, విజ్ఞుల విమర్శకాభిప్రాయములను సగౌరవంబుగా మన్నించి నాట్య విద్యలలో నఖండయశ స్సంపదను సంపాదించ జూడవలెను. నాట్యకళాభిమానులగు కవినటప్రేక్షకజనంబు లన్యోన్య సహాయ సంపత్తితో వర్తించుచు భరత మునీంద్ర కాళిదాసాదులు ప్రీతిమై పెంచి పోషించిన భారతీయనాట్యకళను గ్రమ్మర నిలువబెట్టి పూర్వోన్నతికి దెత్తురని నమ్ముచున్నాను. ఇట్టి సహకార మేర్పరచుట యేయిచ్చట గూడినసభాసదుల ముఖ్య కర్తవ్యము.







## చెన్నపురి విశ్వవిద్యాలయము.



సరస్వతీదేవి—వత్సా! సర్ అసుతోషువలె కీర్తిగడింతువుగాక!
సర్ ఆర్. వెంకటరత్నంనాయుడు—జననీ! నీయాశీర్వాదము.




# మరణాధికమైన ప్రణయ మెంత దొడ్డది.

(చిల్లరిగె శ్రీనివాసరావు గారు.)



ఇటలీదేశములో ఫ్లోరెన్సు అను పట్టణము కలదు. ఆపట్టణములో అల్మెరీ అను నొక పురాతన కుటుంబముండెను. ఆకుటుంబమువారు రెండు వ్యాపారపు కట్టులకు చెందియుండిరి. అందొక కట్టడివారు కసాయివారు. సెయింటు ఆంటోని అను కులదేవతను ఆరాధించుచుందురు. రెండవవారు తమ జెండామీద గొఱ్ఱెపిల్లను చిత్రించుకొని ఉన్ని వ్యాపారము చేయుచుందురు. ఇప్పుడు మనకథకు సంబంధించిన ఇద్దఱన్నదమ్ములు ఒకరొక వ్యాపారమునకును, మఱియొకరు రెండవ వ్యాపారమునకును చెందినవారు. గవయన్న అల్మెరీ కసాయిదుకాణము బజారులో వేసుకొన్నాడు. మదియన్న అల్మెరీ ఆర్నోనదిమీద ఉన్ని కార్ఖానాలు పెట్టుకొన్నాడు. గవయన్న అంగడిలో అమ్మకము బాగున్నది. అతనియొద్ద తాజామాంసము లేలేతపలమను ఒలసినపోతులు మంచికోళ్లు ఉండుటచేతనే ఖరీదుదారులు వచ్చుటలేదు; అతని ఖులాసా అతని చమత్కారమందరిని ఆకర్షించుచున్నవి. త్రోవను పోవు వానితోగాని ఖాతాదారునితోగాని కూలివానితోగాని వాడుచేసే చమత్కారంమాట మఱియొకనికి చేతకాదు. ప్రపంచములో ఏసంగతిని గూర్చిగాని వాడు మాటలాడునంత సునాయాసముగా నెవ్వరును మాటలాడలేరు. ఫ్లోరెంసైను రిపబ్లికువారు చేయు వెట్టిరాజ్యతంత్రాంగములైనా సరే? తురుష్కసుల్తాను మంత్రాంగములైనా సరే, పరాసురాజు కుట్రలైనా సరే వానికి లెక్కలేదు, వ్యాఖ్యానములు అడ్డులేకుండా చేయగలవాడు. ఈకసాయివాని వ్యాఖ్యానములకెవ్వడును కోపము తెచ్చుకొనడు. ఒకవేళ ఎవనికైనా కోపమువచ్చినయెడల వాడొక సామెత చదువుచుండెడివాడు — "పరాచకానికి పరువు పోతుందా? పలుకుంటే నాలుకకు నరుకొస్తుంది."

వాడియన్న మదియన్న అట్లుకాదు వానివైఖరి వేరు. వానిదంతా లోపల స్వయంపాకము. వాని యాలోచనలు మంత్రాంగములు లోతైనవి. వాని వ్యవహారము అంతయు నిష్కర్ష మనిషికైతే ఏమియు పొంగడు. వానికి విరక్తుడుగాని ఈనిష్కపటస్వభావముగాని లేదు వ్యవహారములో బాగా లాభము లాగడమే వాని యాదర్శము. ప్రతిసంవత్సరము రెండు ఓడల నిండా వున్ని లివర్నోహార్బరునుండి కాన్‌స్టాంటినోపిలుకు వాడు పంపించుచుండెడివాడు. వానికి చాలా పెద్ద ఆశలున్నవి. వాడు క్రమక్రమముగా గొప్ప రాజకీయోద్యోగమునకు దారి పట్టవలెనని ఆలోచించుచుండెను; ఫ్లోరెన్సుపట్టణములో బాగా పెద్దపదవులున్నవాళ్లను అనగా అభిజనుల నాశ్రయించుచుండెడి వాడు. వాడేవిధముగ తమ అల్మెరీ కుటుంబమునకు నున్నత వంశబాంధవ్యమును సంపాదింపవలెనని యాలోచించుచుండెను. అంతేకాదు, ఎలసిన రోజుల తనపేరు శాశ్వత కీర్తిపత్రములై నెగురుచుండ జూడవలెనని కూడ వానియాలోచన యైయుండవచ్చును. మదియన్న అప్పుడప్పుడు తన తమ్ముని పిలిచి, "ఓరే అబ్బాయి. ఆడిఅంత మనకు

కుందలించెను. అందువలననామె తన కింకొకవరు డున్నాడని తల్లితో రహస్యముగా చెప్పెను. వాని పేరేమని యడుగగా అంటోనియోయని యామె వాక్రుచ్చెను. ఆపేరువినగానే తల్లిమోనాకూడ భయ విస్మయములు విశేషముగా బొందెను. ఈయంటోని యోయెవరు? అతడొక శిల్పి. యువకుడు. ఈతడు తన కర్మాగారమును పెద్దబజారుదగ్గర నొకచిన్న సందులో పెట్టుకొన్నాడు. ఈతడు కొన్నిమాసముల క్రిందట నామె యింటిలోనే నామె స్నేహమును మొదట సంపాదించెను. అదియిట్లు జరిగెను. ఆపట్టణము వెలుపల నొక రోమను కాథోలిక మఠములో బ్లైరాయను నొక గొప్పప్రాణసమర్థుని శిలారూపము చెక్కవలసివచ్చినది. దానిని చేయుటకు అంటోనియోకు ఆర్డరు వచ్చినది. ఆశిలారూపమునకు కావలసిన మైనపు రూపమును అంటోనియో ఆపిల్లను జూచి చేసుకొనుటకు సెలవియ్యుమని యామె తల్లినడిగెను. ఇది ధార్మికవిషయముగాన తల్లి యంగీకరింపవలసి వచ్చెను. ఆశిల్పి తన విగ్రహమును మైనముతో కట్టుచున్నపుడు తన సుందరతమమగు నమోనాను జూచి మోహించెను. తరువాత వారిద్దరునుత్స వములలో దేవాలయములలో ప్రీతి సమావేశములలో కలుసుకొన జొచ్చిరి. గుణ్యపథకు ఆవ్వానములేని దెక్కడ! స్వాగతములకుకరువా! ఆమె సౌందర్య మున కెక్కడపట్టినను ముంగలీట.

మోనా వృద్ధులాకు శానగాంగో యీసంగతి చెప్పడమునకు భయము. వినయముగా విన్నవించుట కెంత? ప్రయత్నము చేసినది క్షమాపణలు చెప్పు కొంటూ కూతురుమనసులో యింకొకవరుడున్నాడని మెల్లగా బయటపెట్టినది తరువాత నెమ్మదిగా అంటో నియో అని చల్లగా చెప్పినది. వృద్ధవర్తకునికి మహదుగ్రమైన ఆగ్రహము వచ్చినది. కాని యాకోప మంతయు దిగమ్రింగివాడు శాంతవీక్షణములతో వాత్సల్యాగ్రహములతో దానిని కప్పివేసివాడుచక్కని నాదమైన కంఠస్వరము నవలంబించి యతడిట్లుపలికెను “అమ్మా నాచెవులతో నేను విన్నాను గనుక సరిపోయినదికాని నీవంటి బుద్ధిమంతురాలును నీతి వంతురాలును యిట్లన్నదని యింకెవరైనా చెప్పిన యెడల నాకు నమ్మకముండెడిదికాదు. అది పసితనం. దానికేమి తెలియును. దాని మాటలు లెక్కేమిటి. ఈకాలంలో ఎట్లాయున్నదో నాకు తెలియదు. కాని ఇట్టిమాటలు నాచిన్నతనంలో నేనెన్నడును వినలేదు. చిన్నపిల్లలు వారివరులనుగూర్చి యొక్కమాట మాట లాడెడివారా! పెద్దలెంతచెపితే అంత. నీకేలాంచె మాలోచించి చూడు— మనఅమ్మాయితాను వరించిన ఈపెద్దమనిషి యెవరు! అంటోనియో! ఈయనసంగతి చెప్తావిను. ఈయనొక శిల్పి. శిల్పుల సంగతి నీకు కొంచెము తెలుసుననుకొంటాను. శిల్పులు, కవులు, నటకులు, వీధిపాటకులు వీరంతాయెవరు! వీళ్ళకుఎక్కడను ఇంతకంటె మర్యాద ఉద్యోగాలులేక ఇట్లా అఘోరిస్తూ వుంటారు. ఈ ప్రపంచములో నింగ్రికంటె హాల్కమనస్సు వారుండబోరు, ఇంతకంటె ఆపాత్రులిక నుండబోరు. వీరలా, త్రాగుబోతులు, తంటాకోరులు, సోమరులు, నాస్తికులు డబ్బు తగలేసేవారు? వారికిచెబ్బకాదు. ఎవండైనా తేరగా దొరికితే తగలెట్టిచూపిస్తారు. ఇక అంటోనియో సంగతిచెప్తావిను. వాడిసంగతి ఊరిలో అందరికీ తెలుసు. నేనొక్క చిత్రమైన విషయం వానిని గూర్చి చెప్తావిను. వానికర్మాగారంలో ఒక దూలమునకు ఒకబుట్ట వ్రేలదీసియున్నది. ఆబుట్టకు కట్టిన తాడు గోడమీద మేకుకు ముడివేసియున్నది. వాడుసంపాదించిన డబ్బంతా అందులోవేస్తాడు. లెక్కలేదు. పత్రింలేదు. ఎవరికైనా డబ్బుకావలిస్తే వానిశిష్యుడుగాని వానిస్నేహితుడుకాని అతిథికాని అభ్యాగతికాని సరాసరివచ్చి బుట్టను క్రిందకుదింపి అవసరం అయినంత రాగి, వెండి, బంగారం నాణెములు ఇష్టమువచ్చినట్లు తీసుకొనవచ్చు, అడగడంలేదు. ఏమమ్మా ఇట్లాంటి పిచ్చాడికి నీకూతురినిస్తానన్న కట్నమిస్తానను కొన్నావా.

ఇంకొకసంగతి. నీకు తెలుసునో తెలియదో.

వీడిది చార్వాకమతము. బందనాస్తికవాదము. తినడం తిరగడం, ఇదంతా సైతానుబోధ. ఎప్పుడును చర్చికి పోడు. పవిత్రకర్మలంటే హాస్యంచేస్తాడు. దేవుడిమీదపాట్టపాడిచినాభక్తిలేదు. ఈమధ్యచాలామంది పెద్ద మనుష్యులుచెప్పారు. పూర్వదుర్మతముల విగ్రహములు భూమిలోనుండి వెల్లగిస్తే వీడా దయ్యముల నారాధిస్తున్నాడట. మనమహాత్ముల ఆస్తికలనారాధించకుండా వీడీ విగ్రహారాధనయేమిటి? వీడిఖర్మం కాలిపోను. నాకింకొందఱు చెప్పారు. వీడును వీనిశిష్యవర్గమును చాలాడబ్బిచ్చి ఆస్పత్రిలలో చచ్చిన శవాలను కొంటారట. అర్ధరాత్రివేళ చేరి వానిని కోస్తారట. వాళ్లుటశారీరశాస్త్ర మేదో యేరుస్తారట. నరములుకండలు కోస్తేవాళ్ళశిల్పశాస్త్రజ్ఞానముగట్టి పడుతుందట. ఇదేమిటో నిజమునీకు తెలియునా; ఏమీలేదు. మనమోక్షానికి అడ్డపడువాడు; సైతాను. ఇదివానియుపాసన. వాడిదగ్గఱనుండి ఈమాయవిద్యను గార నేరుస్తున్నాడు. నీకుతెలుసునా, మంత్రాలు వీడుండీలా చేతబడులు, వీనివలననే. ఈదయ్యాలపోతు గామునికూతురి హృదయం కాస్తాహరించేశాడు.

ఈమాటలతో మోనాపుర్స్యూలా పాపంగాభరాపడి పోయింది. అంతానిజమని నమ్మింది. వెంటనే వెళ్ళి యామెకూతురితో చెప్పింది. అలాగున్నను వివాహంచేసుకోకపోతే పెదతండ్రి తనకికదివరకిచ్చే నెలబత్తెముఇయ్యడము మానివేస్తాడని యామె చెప్పినది. పాపము చిన్నపిల్లకు పట్టరానిదుఃఖమువచ్చినది. ఏమిచేయగలదు! విధికృతము తప్పకొనుటకు వీలులేదనుకొన్నది. పెద్దతండ్రిగారిఆజ్ఞను శిరసావహిస్తానన్నది.

ఆ సంవత్సరము ప్లోరన్సులో జాడ్యములు. అనేకమంది సిద్ధాంతులు ముందేజ్యోతిషం చెప్పారట. ఏమంటే వృశ్చికరాశిలో శనిఅంగారకులు దగ్గరిగా వచ్చినారట. చాలమందివర్తకులు మనతూర్పుదేశమునుండి మంచిమంచి తివాసులు బసాలుబసాలు దిగుమతి చేయించినారట. అందులోమహామారి శిలీంధ్రములుకూడ దిగినవట. ఊరిలోఅందఱును గడబిడపడ నారంభించిరి. వీధులలో మహాత్ముల పటములు పట్టుకొనిగభీరమైన నగరసంకీర్తనలు యెక్కడపడితే అక్కడ వినబడుచుండెను. పట్టణములో కుళ్ళుసరుకేదియు దిగ గూడదని శాసనములు చేయబడినవి. చర్మాలకార్ఖానాలు కబేలాలు వానిలోనికుళ్ళునుఆర్నోనదిలోనికి వదలకూడదన్నారు. రోగులను సంఘమునుండి వెంటవెంటనే తొలగించుట కేర్పాటులు చేయబడినవి. పట్టణములో చచ్చిన వారిని పగలు చస్తే సూర్యాస్తమయము కాకమున్నే రాత్రి చస్తే సూర్యోదయము కాకముందేనున్నా యెత్తివేయవలసిందన్నారు. మహామారివలనచచ్చారో మఱియొక వ్యాధివలన చచ్చారో ఆలోచించ వలసినపని లేదన్నారు. ఈశాసనమునకు తప్పితేజరిమానాలేక ఖైదు, ఇంకాయెక్కువ పెంకితనము కనబడితేమరణదండనా కూడాఅన్నారు. దీనినియమములు జరిపించుటకుప్రత్యేకముగా ఇన్స్పెక్టర్లు గస్తితిరుగుట కారంభించిరి. రాత్రిగాని పగలుగానివారు ఏఇల్లుతలుపుకొట్టిరోగులుగాని చచ్చినవారుగాని యున్నారాయనియడుగవచ్చు వారికి అనుమానంతోస్తే ఇష్టమువచ్చినట్లుగా సోదా కూడచూడవచ్చు. అక్కడక్కడ శవములను తీసివేయుటకు గారుపూసిన బండ్లు సిద్ధముగా నుండెను. వానివెంట నల్లనిముసుగులు వేసుకొనిన మనుష్యులు నిశ్శబ్దముగా నడచుచుండిరి. వారిచేతులలోపెద్దపొడుగాటి ఇనుపకొంకెలు. వారుశవములనంటకుండా ఆ కొంకులతో శవములనెత్తి బండ్లలో పడవేసెడి వారు. ఈసంరంభము రాత్రివేళల. కాగడాలతో జరుగుచుండ రెట్టింపుకాను పరిస్థితి భీషణంగా నుండుచుండెను. ఈమనుష్యులకు యమకింకరులని వారుపేరు పెట్టి పిల్చుచుండిరి. ఈయమకింకరులు కొంతమందిని ఇంకా చావకముందే తమకాలపాశములను వేసిలాగుకొనిపోయెడివారని ప్రతీతి. వారువచ్చినచోటికిమరలా వెంటనే రాకుండ ఒక్కసారే కట్టకట్టుకొని పోవుటకు ప్రయత్నముచేసి యుండవచ్చును.

ఈమహామారి ఆవేళంలో వేసవికాలం అరంభించినది. శిశిరఋతువు చాలవరకుఅటుల నేయున్నది. చలిగాలులు అసంవత్సరం తీవ్రంగా అరంభమైనవి.

వాళ్ళకేమాత్రమును జాడ్యములు తగలేదు. కాబట్టి పట్టణములో కొంచెం భాగ్యవంతులు వ్యవహార బంధనములు లేనివారు పట్టణమువిడిచిపెట్టి చుట్టుప్రక్కల శివారులలో తోటలును ఇండ్లును వున్నవారు వెళ్లి పోవుచుండిరి. అక్కడ పరిశుభ్రమైన గాలిసౌఖ్యం వుంటుంది. అంటురోగములు రావు.

మరియున్నకు గుణప్రభకు మరల యేమి బుద్ధి పుట్టునోయనిభయము. పైనంక పెట్టుకొని పెండ్లికి తొందర పెట్టుచుండెను. 'సాధ్యమైనంత త్వరలో ఊరువిడిచి పోవలెను. త్వరగా పెండ్లి అయిపోయిన యెడల అగోలాన్న భార్యను అత్తగారిని ముతెని అల్లునో గిరిపైనున్న సుందరవిలాసమునకు తీసుకొని పోతానన్నాడు. ఊరిలో జబ్బులు; బాగుండలేదు,' అని ఆయన మరీమరీ చెప్పుచుండెను.

మరియున్న కోరిక సిద్ధించినది. అంతా నిశ్చయమైనది. ముహూర్తమింకెన్నాళ్లో లేదు. ఏమియు డాబుడంబులు లేవు. చల్లగా వివాహమైపోయినది. కాలం బాగుండలేదు. అందుచేత అవిచారకాలంలో పెళ్లిచేయుచున్నారు. పాణిగ్రహణ సమయంలో గుణప్రభకు ఎక్కడా ముఖమున నెత్తురు చుక్కలేదు. తెల్లగా గుడ్డపీలిక లాగయున్నది. ఆముఖము గోరి వెల్లవేసి ఛాయాచిత్రముగా నున్నది. పెదతండ్రి అందరు ఆయి పిల్లకు ఏదో వచ్చిన విచారమును కున్నాడు. పెండ్లికాగానే అంతయు దానంతటదియే కుదురుతుందనుకున్నాడు. ఎరుకు మంచి పండితుడు పిల్లదాని చిత్తము శాంతిస్తాడనుకున్నాడు.

కానివాని ఆశలు విఫలములైనవి. వధువుకు చర్చినుండి మగని ఇంట గృహప్రవేశము కాగానే తల దిరుగుట ప్రారంభమైనది. కొంచెము సేపటిలో మూర్ఛవలె వచ్చి ప్రాణముపోయిన దానివలె నేల మీద పడినది. మొట్టమొదట ఆమెకు ఏదో మూర్ఛ వలె వచ్చినదని అందఱు అనుకున్నారు. కావలసిన యుపచారములు చేసినారు. కాని యామె కన్నులుతిరిగి తెరువలేదు. ఊపిరి క్రమక్రమముగా సన్నగిలినది. ముఖమును పెదవులును అంతయు పాలిపోయినది. వొడలంతయు చల్లపడినది. కొంత సేపయిన పిమ్మట వైద్యుని పిలువనంపిరి. ఆకాలములో వైద్యుని పిలువడము భయము. మహామారియని అందఱు అనుకుంటే తంటాకదా. ఆవైద్యుడు వచ్చియొక అద్దమును తెచ్చి ముక్కుదగ్గర పెట్టి చూచాడు. దాని మీద ఊపిరి పడినట్లు ఏమియు చెమ్మ కనబడలేదు.

అంతె నందఱకును ఎక్కడలేని దుఃఖమును వచ్చినది. అయ్యోపాప మన్నారు. గుణప్రభ చచ్చిపోయినదనినమ్మారు. ఇటువంటి దుష్కాలంలో పెండ్లియేమటని ఇరుగుపొరుగు వారు నిందించారు. ఆపడతి పాపం చర్చినుండి రాగానే మహామారితగిలి చచ్చి పోయినదని అందఱును చెప్పకొన్నారు. ఈమాట ఊరంతా ప్రాకినది. ఈపిల్ల బంధువులు చావు సంగతి బిట్టబిడఱవఱకు దాచినారు. పైనచెప్పిన యమకింకరులు చావకముందే లాగుకొని పోతారేమోయని వారిభయం. కాని సాయంకాలమగునప్పటికి ఇనస్పెక్టరులు వచ్చినారు. వారికీసంగతి యూనత్తూపూస గుచ్చినటుల ప్రక్కఇండ్లవారు పూర్తిగ చెప్పినారు. వారు శవమును తమకు వశము చేయమన్నారు లేదా వెంటనే పాతిపెట్టమన్నారు. కాని తిరువాత వారికి ముట్టచెలసిన లంచాలు ముట్టినవి. మరునాడు సాయంకాలము వఱకు వుండవచ్చునని సెలవిచ్చి వారు వెడలి పోయిరి.

గుణప్రభ చచ్చిపోయిన దనియే అందరకును నమ్మకము. వాండ్ర ఇంటిలో నొక ముసలిదాయి వున్నది. దానికిమాత్రము ఇంకాఆశ యున్నది, కాని దానిని సగము పిచ్చముండ అని అందఱును అంటారు. అదిపాపం ఏడుపులు శోకాలు పెట్టుచూ ఇంకాచావలేదు పాతిపెట్టకండిఅంటుంది. వైద్యులకేమితెలుసు పిల్లకేదో మగతవచ్చినది. కాని చావు

కాదని అంటుంది. గుండెల దగ్గర చెయ్యిపెట్టి చూచితే సీతాచిలుక రెక్కలు లాగ మెల్లగా కొట్టుకొంటున్నట్లున్నది. అనిఅది మాటిమాటికి చెప్పుతుంది కానిమాట ఏవరు వింటారు?

ఆరాత్రి గడిచినది. మరునాడును ఎక్కడను ప్రాణమున్నట్లు కనబడలేదు. పైన మృత్యువగునము గప్పినారు. పీనుగుపెట్టెలో పెట్టి యామెను చర్చి యావరణలోనికి తీసుకొని వెళ్ళిరి. శాంతమైన సమాధి. మంచివన్ని ఇటుకలు క్రిందపరచియున్నవి పైన పెద్దసైప్రసు చెట్టున్నది. అక్కడ ఫ్లోరెన్సు పట్టణములోని గొప్ప కుటుంబములవారి సమాధులన్నియు బారులు గట్టియున్నవి. మదియన్న యిట్టి సమాధికి మంచిధరయిచ్చినాడు. అడబ్బుగుణప్రభకు ఆయ నియ్యబూనుకొన్న కట్నము నుండియే ఖర్చు పెట్టినాడు. ఖనన సంస్కారం గంభీరముగా జరిగినది. అనేకమైనపు వత్తులు వెలిగించారు, ఈమె పేరు మీద పేదవారలకు కండలకు సేరు ముసలు పావు సేరు నూనె చొప్పున వాపద్ధతి ప్రకారం పంచిపెట్టినారు. చలి మిక్కుటముగా నున్నది, మహామారిభయం ఊళ్లో అపరిమితంగా వున్న. అయినను చాలమంది ఖననకర్మకు వచ్చినారు. కొందమంది ఈ విచారమగు వావుకబురు విని పిల్లను యువకనపు సహాకకు ఆపుకొనలేక బిగ్గరగా దుఃఖించిరి. కొంతమంది ముద్దు "మోమున మరణంబు ముద్దులొలికె" యనునొక కవివాక్యంబు స్మరింపఁ జొచ్చిరి. అగొలాన్న సమాధియొద్ద నొకగొప్ప యుపన్యాస మిచ్చెను. ఆయుపన్యాసములో నొక్క లాటిన్ వాక్యములే కాదు, ప్లేటోరచనాదుల వనముల నుండి గ్రీకువాక్యము లెనోవకాణించెను. గ్రీకు ఎవనికి తెలియక పోయినా దానిమీద ఆదరణ విశేషంగా నున్నది. విశేవాండ్రకు ఏమీ అర్థము కాకపోయినను విని చాలసంతోషించిరి.

ఖనన కర్మ జరిగిన తరువాత నొక చిత్ర జరిగినది. చర్చిలోనుండి పీనుగుపెట్టెను ఎత్తుకొని వచ్చి గోతిలో పెట్టినారు. అక్కడ బంధువులందరు వారి ఆచారప్రకారము కడసారి ముద్దు కొందురు. ఏవరో యొకమనిషి విచార సూచకవస్త్రలు ధరించుకొని వచ్చినాడు. వానిముఖము వెలవెల బోవుచున్నది. వాడు సరాసరి శవము నొద్దకు వెళ్ళినాడు. ముఖము మీద టోపియెత్తి వాడు శవముకేసి స్థిరదృష్టితో చూడనారంభించినాడు. అందఱును వానిని వెడలిపొమ్మని యన్నారు. బంధువులందఱును ఇంకా సెలవు పుచ్చుకొనకముందే తానెవరో క్రొత్తవాడు గుణప్రభను దగ్గఱకు పోయిచూచుట తగదని యన్నారు. తానెవరో క్రొత్తవాడు, మదియన్న అగొలాన్న బంధువులు, అన్నంటుకా మనిషి తిరస్కారపు చిరునవ్వు నవ్వుచవచ్చిన యామెను ముద్దుపెట్టుకొని యొక్కమాటైన మాటాడక తనదారిని వెడలి పోయెను. అక్కడివారందఱును గుసగుసలాడ నారంభించిరి. అతఁడే అంటోనియో, గుణప్రభ ప్రేమించియతని కొఱకే ప్రాణములు చాలించినది అని ప్రేలితో చూపించసాగిరి.

పొద్దు కూకవచ్చుచున్నది. చేయవలసిన విధులు అఖరైనవి, కడపటి దారిని వారు పోవనున్నారు. మోనావుస్సలా పెట్టెపక్క రాత్రిమేలు కుంటానని చెప్పినది. కాని మదియన్న వల్లకాదన్నాడు. అతని అభిప్రాయమేమి? ఆమె ఈవలనే దుఃఖముతో మునిగి అస్వస్థతల్లోనున్నది. రాత్రి చలిగాలిలో మేలుకుంటే ప్రాణాపాయం సంభవిస్తుంది, మేరియానో అనునొక డోమినికను సన్యాసియున్నాడు, వాడొక్కడును అక్కడ కనిపెట్టుకొని యుంటాడు. రాత్రి తెల్లవారులు శవమునొద్ద ప్రార్థన కీర్తనలు చదువవలసిన ఉద్యోగం అతనిది.

కొన్నిఘంటలైనది. ఆసన్యాసి మంచి గమకంతో కీర్తనలు చదువుచున్నాడు. మధ్యమధ్య

గరొట్టో గోపురం మీదనుండి ఘడియారము ఘంటలు ఠంగుఠంగుమని వేళ తప్పకుండా యానిశ్శబ్దమున ప్రతిధ్వనించుచుండెను. అర్ధరాత్రియగు నప్పటికి మెరియానోకు జాహాము వేసినది. వాడు ద్రాక్షసారాబుడ్డి తీసి తలకాయ వెనుకకు ఊచిరెండుమూడు గుక్కలు కులాసాగా త్రాగెను. అంత హఠాత్తుగా నొక నిట్టూర్పు పుచ్చినటు వానికివినబడెను. వాడులిక్కిపడి శ్రద్ధగా విన నారంభించెను. మరల నిట్టూర్పు వినబడెను. ఈసారి శవము మీది టోపీ కదలినట్లు తోచెను. వాని యొళ్లుఝల్లుమనెను. కాని వానికి ఈయుద్యోగము మామూలే. బాగా అనుభవం గలవాండ్రుకూడా శవముల యొద్ద యొంటరిగా నుంటే అనేకభ్రమలు పడుచుంటారని వానికి తెలుసు. అందుచేత దానినంత లక్ష్యపెట్ట కూడదని వాడనుకొని యూరకున్నాడు. వాడుదయ్యాలను తరిమి వేయుటకు శిలువ చిహ్నము వేలుతో అభినయించాడు. బిగ్గరగా ప్రార్థనగీతములు పాడ నారంభించి నాడు.

హఠాత్తుగా సన్యాసి గొంతుక స్తంభించి పోయినది. మనిషి కొయ్యిపోయినాడు! వానికళ్లు చచ్చినపిల్లవైపుకు రెప్పవాల్చక చూచుచున్నవి. ఈసారి నిట్టూర్పు కాదు మూలుగు ప్రారంభమైనది. మెరియానోకిక నిశ్చయమైనది. చచ్చినపిల్లదాని రొమ్ముపైకి క్రిందకు మెల్లగా ఆడుచున్నది. మొగము మీది టోపీ కదలుచున్నది. పల్ల గాలి పీల్చుచున్నది. మరల శిలువచిహ్నము చేసుకొని మనిషి లేచి నిలుచున్నాడు. కాళ్లు చేతులు వణికిపోవుచున్నవి. వాడు ద్వారమునొద్దకు పరువెత్తినాడు. సమాధినుండి బయటకు దుమికినాడు. బయట శుభ్రమైనగాలి తగిలి కొంచెము తెలివి తెచ్చుకున్నాడు. మరల కొంచెము వితర్కించి యదియంతయు తన భ్రమయే యని యనుకొన్నాడు. వాడు మెల్లగా కోటిలో మరియమ్మను తలచుకున్నాడు. ధైర్యము తెచ్చుకుని మరల సమాధిలోనికి తొంగిచూచినాడు. వానికి నోటివెంబడి యొక కేక పిచ్చికేక వచ్చినది. చచ్చిన పిల్ల పీనుగు పెట్టిలో లేచికూర్చుని కండ్లుతెరచుకొని చూచుచున్నది. అదిచూచి వాడక్కడ నిల్వలేదు. వెనుకతిరిగి చూడకుండా గోరీల మధ్యనుండి ఒక్కపరుగుతీసి పెద్దవీధులు పట్టుకొనిపోయి వానిల్లుచేరినాడు. రాత్రి నిశ్శబ్దముగానున్నది. వీని పాంకోళ్ళు మాత్రము మంచుచే కప్పబడినఇటుకరాతిమీద కొట్టుకొని సందడి చేసెను.

గుణప్రభమరణనిభమైనమూర్ఛనుండి మేల్కాంచెను. ఇటునటు చూచి పీనుగు పెట్టెలో తానుండుట గనుగొని కలవరపడెను. బ్రతికియుండగానే పూడ్చిపెట్టినారోయని భయభ్రాంతి నొందెను. పిచ్చిబలము తెచ్చుకొని పెట్టెవెలుపలకు ఎక్కివచ్చెను. పెట్టెపై బట్టను కప్పుకొని సమాధిబయటకు వచ్చెను.

తరువాతినామె గోరీల వరుసలనుదాటి చర్చి ముందరి చావడిలోనికివచ్చెను. ఆకాశమున మబ్బులు పరువిడుచుండెను. గాలి యామబ్బును ఛేదించిమధ్య కొంత సందుచేసెను. ఆసందునుండి వెన్నెలలో వర్షించుచున్నట్లుండెను. ఈవెన్నెల కాంతులందు గరొట్టోస్ఫటికగోపురము చక్కగా గాన్పించుచుండెను. గుణప్రభమనస్సు అల్లకల్లోలముగానుండెను. తలదిమ్మెక్కెను. ఆమెయు నాగోపురమును మబ్బులోనికి కొట్టుకొని పోవుచున్నట్లు ఆమెకుతోచెను. అది చావో బ్రతుకోనిక్కముగా ఏమియు నామెకర్థము కాలేదు.

ఆమెయెక్కడకు వెళ్ళుచున్నది తెలియలేదు. వీధుల నొక్కపిట్టలేదు. అటువంటివీధులవెంటనామె వెర్రిదానివలె చూచుచుపోయెను. చిట్టచివరకొకయిల్లు ఆమెకు ఇదివరకు యెన్నడో చూచిన దానివలె స్ఫురించెను. గుమ్మముదగ్గరకుపోయి తలుపుతట్టెను. అది ఆమె మదియున్న ఇల్లు.

యున్న మీఁద చల్లినది. ఇక నాయన తెలివిగల దాసీదానితో వాదించలేకపోయినాఁడు. దయ్యముల విషయములో దానికి తెలిసినంత తనకు తెలియదని యాయన యభిప్రాయపడినాఁడు, కావున యా దయ్యము నిట్లు గట్టిగా నుచ్చాటన చేసెను.

"ధన్యాత్మా నీవు దైవము నజేరుకో! పరలోకం వాయిపరలోకం లో నేయుండాలి. పుణ్య లోకంలో నీకువిశ్రాంతి కలుగుగాక"

గుణప్రభ తాను చచ్చినవారిలో జత చేయ బడినట్లు తెలుసుకొన్నది. ఇఁక నక్కడ యుండి లాభం లేదని యనుకొన్నది. గడప మీద యలసిపడి యున్న చోటునుండి లేచి యెక్కడనైనా తలదాచు కొనుటకు శరణ్యముకొరకు కల్లాడుచు వెడలిపోయెను.

పాదములు చలికిబండబారిపోయినవి. ఎంతో కష్టముమీదనడచి ప్రక్క వీథిలోనికి ఆమెపోయినది. అక్కడ ఆమెభర్త ఆగోల్లాన్న ఇల్లున్నది.

ఫ్లోరెంటైన్ రిపబ్లికు యొక్క కార్యదర్శి ఇప్పు డేమి చేయుచున్నాడు? మిలానులో తన మిత్రునకు ల్యాటినులో పెద్ద వేదాంత సమాచారమును వ్రాయుచున్నాడు. ఆ మిత్రుఁడుకూడ ఈయన వలెనే ప్రాచీన కవిత్వములమీద అభిమాని. అది గొప్ప వేదాంత [illegible]. "నా ప్రియసతి నిర్యాణ సందర్భమున ఆత్మయొక్క యక్షరత్వమును గూర్చి విచారణ" యని దాని శీర్షిక. అందులో అరిష్టాటిలు యొక్క మతమునకును ప్లేటో మతమునకును తారతమ్యమును చూపించుచు తాను అక్వినాసు అనువారిడు అరిష్టాటిలు వారలతో ఏకీభవించి స్వర్గ నరకము లున్నవను మతము రోమనుక్యాథోలికు మతమునకు అనుకూలముగ నున్నదని చేసిన సిద్ధాంతమును ఆయన ఖండనచేయుచుండెను. అగొలాన్న చాల తీక్ష్ణమైన తర్కవాదములతో అరిష్టాటిలు అసలు నిజముగా భక్తిహీనుడనియు నాస్తికుడనియు వాని మతము రోమను క్యాథోలికు మతమునకు సరిరాదనియు ప్లేటోయొక్కా భక్తిగల వాఁడనియు అతనిమతమే తమ క్రైస్తవధర్మమునకు అనుకూలముగా నున్నదనియు తన మిత్రుని వాదములను పూర్వపక్షము చేయుచుండెను.

దీపపుసెమ్మామీఁద తామ్రపాత్రిలో చమురు పోసి వత్తి వేసియున్నది! అది అతను వ్రాయుకొనుబల్లకు బిగించియున్నది. వ్రాతబల్లకు అనేక సొరుగు లుండెను. వానిలో ఒకవానిలో కాగితాలు ఒక దానిలో సిరా యొకదానిలో అనేకరకాల ఈక కలములు అన్నియున్నవి. దీపము చలనములేక వెలుగు చుండెను. దీపపు స్తంభము ఒక ప్రాచీనకాలపు శైత్యవీరుడు తనచేతియాసిని కాలిగించుకొనినట్లురచింప బడియున్నది. ఈతనియొక్క దైనిక జీవనములో ప్రతి విషయములోను చక్కని ప్రాచీన శృంగార రసమూర్తుల నారాధించెడివాఁడు. దేవతామూర్తులు స్వర్ణమహీజ పుష్పంబుల నలంకరించుకొని వట్లును వనమృగఘులు నృత్యము చేయువట్లును దెలియపరచు బంగారు బొమ్మలు విలువగల యతని వ్రాత పత్రములపై యులరారుచుండెడివి. ఆ వ్రాతపత్రములు పట్టుతో సమానముగా నునుపై దంతముతో సమానముగా గట్టివై మెరయుచుండెను. అగొలాన్న ఆసమయములో మనోమయకోశమును గూర్చి పూర్ణమైన తత్వవిచారణము చేయుచున్నాడు పితాగారసుయొక్క అనుయాయులను గూర్చి వారు చిక్కుడుగింజలలో పితరుల ఆత్మలుం పుంటవని భోజనమునకు నిషేధము అంటున్నారని చమత్కారముగ హాస్యము చేయుచుండెను. అంత హఠాత్తుగ తలుపు మెల్లగా కొట్టినట్లు చప్పుడాయెను. వెంటనే యాతడు భ్రూయుగము ముడివేసి చూచెను. ఆయన దీర్ఘాలోచన మీఁదనున్నప్పుడు చప్పుడు సహింపలేదు అయినను లేచి గదివీధివైపు కిటికీ తీసి చూచెను. వెల వెల బోవుచున్న వెన్నెలలో చచ్చిపోయిన గుణప్రభ మరణవసనము గప్పుకొని కనబడినది.

అగొలాన్న ప్లేటోను మరచిపోయినాఁడు అరిష్టాటిలును మరచిపోయినాఁడు ఆయన తత్వశాస్త్రమంతా యొక్కక్షణములో యంతర్హితమైనది, ద భి

క్కన కిటికీతలుపు మూసివేసినాడు. గుణప్రభ యొక్కమాట చెప్పడానికైనా యవకాశములేక పోయినది. వెంటనే మరియమ్మ మరియమ్మ యని స్మరణచేయుట కారంభించినాడు. యత్యంత అతీంద్రియ భయముచే శిలువ అభినయమును చేయుచు సరిగా మూర్ఖురాలైన లెన్నియా రీతినే ప్రవర్తింప నారంభించెను.

కాని కొంతసేపటికి ఆయన ఆధైర్యమునుండి తెప్పరిల్లెను. తన భీరుత్వమునకు లజ్జపడెను. పరలోకమునుండి ఇహలోకమునకు తిరిగి ప్రత్యక్షమగు తేజస్స్వరూపములనుగూర్చి అలెగ్జాండ్రియా పరిషన్మండలి విద్యాంసులు చెప్పిన సూక్తులనుజ్ఞాపకము తెచ్చుకొని ధీరత్వమును వహించెను. త్వరలో నిబ్బరహృదయుడైనాడు. కిటికీతలుపు తెరచి గంభీరముగా నిట్లు పలికెను.

"నీవు ఇహలోకములో సంచరించుభూతమవో పరలోకమునుండివచ్చు పిశాచమవో ఎవరైనను సరే కాని ఇచ్చటనుండి వెడలిపొమ్ము. నీవెచ్చటనుండి వచ్చితివో యచ్చటికే తిరిగిపొమ్ము. సత్యతత్త్వావధానముచే ప్రకాశించు మావంటి పండితులను నీవుభయపెట్టజాలవు. నీ ప్రయత్నము వ్యర్థము. నాభౌతిక దృష్టిని నీవు భ్రమపెట్టజాలవు. భద్రముగా బొమ్ము. ప్రేతములు ప్రేతములతో సాహచర్యము చేయును గాక."

ఈసారి తలుపు గట్టిగా వేసినాడు. ఇక నిటువంటి పిశాచములు వేయివచ్చి తలుపుకొట్టినను అతడు చలింప దలచుకొనలేదు.

గుణప్రభ తిరిగి వెడలిపోయినది. ఆమెపాత్రిత బజారున కంతయో దూరములేదు. అందుచేత వెంటనే తల్లిగారింటికి వెళ్ళెను.

మోనా ఉర్సులా శిలువయెదుట మ్రొక్కుచుండెను. ఆమెప్రక్క సన్యాసి గయాకొ మోకరిలబడి యుండెను. అతని ముఖము నిశ్చలగాంభీర్యమును దాల్చియుండెను. ఉపవాసవ్రతముచే కృశీభూతుడై యాతడు కాన్పించుచుండెను. ఆమె తన భయభ్రాంతచిత్తముతో నాతని దీక్షించుచుండెను.

తండ్రీ నాకేమిచేయుటకును తోచకున్నది. నాకు చేయూత యొసంగుము. నాయాత్మ శూన్యమైపోవుచున్నది. భక్తి కుదురుటలేదు. నాహృదయము సమర్పణ సేయలేకున్నాను. అయ్యో నేను శరణన్నను దేవుడునన్ను పరిత్యజించినట్లున్నాడు. నాగతియేమి? నేనునరకంలో పడిపోవలసినదేనా? సన్యాసి ప్రోత్సాహవాక్యముల నిట్లుచెప్పెను. పూర్ణప్రపత్తి కావలెను. దైవమునకు పూర్ణముగా నాత్మ సమర్పణ సేయవలెను. సణగగూడదు. గొణగగూడదు. కామాదులను చంపివేయవలెను. నీబిడ్డమీద వ్యామోహము శరీరసంబంధమైనది. ఆత్మసంబంధమైనది కాదు. అనిత్యమైనదాని గూర్చినీవు ఏడువవద్దు. పరమాత్మయొక్క న్యాయపీఠముయొద్ద ఆమెమూట గట్టుకొనిపోయిన పుణ్యపాపములనుగూర్చి నీవువిచారింపుము.

ఈసమయములో తలుపుమీద కొట్టినట్లుచప్పుడాయెను. తరువాత "అమ్మా అమ్మా నేను తలుపు తియ్యి. త్వరగా" అనివినవచ్చెను.

"గుణీ!"అని మోనాకేక వేసి పరుగెత్తి తలుపుతీయబోయెను. కాని సన్యాసి చేయిపట్టుకొని ఆపెను.

"ఎక్కడికిపోయెదవు? నీబిడ్డ చచ్చిసమాధిలో నున్నది. ప్రళయ కాలమునగాని తిరిగి లేవజాలదు. నీబిడ్డ గొంతుధరించి దయ్యమో భూతమో నీకుభ్రమ పుట్టించుచున్నది. తపించు—ధ్యానించుకాలము మించకమునుపే ప్రార్థించు. నీకొరకును పాపాత్మురాలైన గుణ ప్రభకొరకును పరమాత్మను శరణు వేడుకొనుము. లేనిచో నిద్దరును నరక కూపమున నాశనమగుదురు."

గుణ:— అమ్మా నామాట వినబడలేదా నా గొంతుక నానవాలు పట్టలేదా? నేనే అమ్మా! చావలేదమ్మా! బ్రతికేయున్నాను.

మోనా:— నాయనా నాబిడ్డ పిలుస్తుంది. నన్నుపోనీ.

అంత సన్యాసిగయాకొ ఆమె చేయివదలి పెట్టి నెమ్మదిగా"పో, పొమ్ము. నీఖర్మము. నీకేకాదు. శాశ్వతముగా నీబిడ్డ గుణప్రభకును నరకము. ఇహలోకమునను పరలోకమునను దేవుని శాపమునకు నీవు పాత్రురాలవగుదువు. పొమ్ము." అనెను.

సన్యాసి మోము క్రోధపూర్ణమై యుండెను. వాని కన్నులు చింతనిప్పులు చెరుగుచుండెను. వాని యాకారము జూచి మోహానుర్సులా భయస్తంభితచిత్తయై నిలిచిపోయెను. చేతులు జోడించుకొని యాతని పాదములపై వ్రాలెను."

సన్యాసి గయాకొమ్మ ద్వారము వైపు చూచి శిలువ చిహ్నము నభినయించి ఇట్లు చెప్పెను. "తండ్రి దేవుని పేరుమీదను కుమార దేవుని పేరుమీదను పరిశుద్ధాత్మ పేరుమీదను ఓ భూతమా నేను చెప్పుచున్నాను. విను. శిలువపై లోకము కొరకై ప్రాణ మర్పించిన వాని రక్తము మాకు శరణ్యము పిశాచమా నివింక మాయమై పొమ్ము. మానవుల దృష్టి పడబోకుము. ఇది పవిత్ర భూమి. ఓ ప్రభువా మమ్ము మోహ పెట్టకుము. పాపము నుండి రక్షింపుము.

గుణ:— అమ్మా, అమ్మా, కరుణించుమా చచ్చిపోతున్నాను—తల్లి మరల నొకసారి బయలుదేరి బిడ్డవైపు చేతులు సాచెను. సన్యాసి మృత్యుసన్నిభమూర్తియై యడ్డము నిల్చెను.

అంత నాకటిలో గుణప్రభ నేలమీద పడిపోయెను. చలికి ఒణ్ణుబిగిసికొని పోవుచుండెను. గొంతుక కూర్చొని చేతులతో కాళ్ళను కౌగలించుకొని తలవంచి చచ్చేవఱకు కదలవద్దని యనుకొనెను.

కాని మరల నామె ఇట్లు విచారించెను. చచ్చిన వాళ్ళు బ్రతికియున్న వాళ్ళయొద్దకు రాకూడదు. అంతలో నామెకు అంటోనియో జ్ఞాపకము వచ్చెను. అతడు కూడా నన్నిట్లు తరిమివేయునా? అని యోచించెను. అతనిని గూర్చి తుదకొక యాశ యామె యనుకొనెను. కానియామెకది యెంతయో సిగ్గుగానుండెను. ఇంకొకరిని పట్టుపట్టి అర్ధరాత్రివేళ పరపురుషుని ఇంటికి వెళ్ళుట కామెకు కష్టముగానుండె. కాని ఇప్పుడు తనవారి కందఱికిని ఆమె చచ్చినవారిలో జత యయినట్లు ఆమెకు స్పష్టమయ్యెను.

చంద్రుడస్తమించెను. పర్వతములు పెరిగిన నంచులలో ఉదయ గగనముపై వెలవెల గాన్పించుచుండెను. గుణప్రభ గడపమీదనుండి లేచి వడలి పోయెను. ప్రియబంధువులు తనకు శరణ్యమియ్య నందున నామె పరాయివాని ఇంటికేగెను.

అంటోనియో రాత్రి యంతయు గుణప్రభ యొక్కమైనపు మూర్తిని తయారు చేయుచుండెను. గంట లెట్టు తెగిరిపోయినవో అతనికిప్పుడు తెలియలేదు. శీతకాలపు ఉదయకాంతులు కిటికీయద్దముల ద్వారా ఎట్లు లోన చేరుచున్నవో యతడు తిన్నగా గమనింపలేదు. అతని ప్రియశిష్యుడు బార్తొలొమో కూడ నాతనితో పనిచేయుచుండెను. వాని వయస్సు పదిహేడు సంవత్సరములు, వాని మృదుశిరోజములును కోమల గాత్రమును అతనికి బాలికామణి యొక్క సౌందర్య మొసంగుచుండెను. ఇద్దఱును గలిసి తెల్లవార్లును పనిచేసిరి.

అంటోనియో ముఖము శాంతపూర్ణమై యుండెను. అతడు చచ్చినదానికి తిరిగి ప్రాణము పోసి అమరత్వము ప్రసాదించుచున్నట్లు తలంచుచుండెను. అరవంచిన కనురెప్పలు తెరుచుచూపుల నినునట్లుండెను. ఆమె వక్షస్థలము సజీవమై పైకి క్రిందకు ఊగుచున్నట్లు కాన్పించుచుండెను ఆమె గండస్థలముల మృదు నాళంబులు ఉష్ణ రక్తంబుతో ప్రవహించుచున్నట్లు భ్రమగొల్పుచుండెను.

అతనిపని యంతయు పూర్తియైనది. పెదవులపై విరిసిన మందస్మితంబును దిద్దుచుండెను. అంత తలుపుపై తట్టినట్లు వినబడెను.

అంటో:— (తనపనిని వదలిపెట్టకుండానే) బార్తొలొమో. ఎవరో తలుపు కొట్టుచున్నారు. తలుపు తియ్యి.

శిష్యుడు ద్వారము దగ్గఱకు వెళ్ళి ఎవరు వారు అని హెచ్చరించెను.

"నేను. గుణప్రభను." అని సాయంకాల వాయుపవనంబు రీతి సన్నని యెలుంగుతో ప్రత్యుత్తరమునిచ్చెను.

బార్తొలొమో తెల్లబోయి భయకంపితుడగుచు నొక్క కొంత వెనుకకు ఒక్క అడుగు దూరముగ నిల్చె

బడెను. మెల్లగా కలవరాభినయము చేయుచు, 'అమ్మా! దయ్యము!', అని చెప్పసాగెను.

కాని అంటోనియో తన ప్రియురాలి కంఠ ధ్వని నానవాలు పట్టెను. ఒక్క దుముకున బోయి శిష్యుని చేతిలోనుండి తాళము చెవిని లాగుకొని తలుపు తియ్యబోయెను.

శిష్యుడు భయముతో సందేహించుచు మెల్లగా నిట్లు గొణుగుకొనెను. 'అంటోనియో, ఆలోచించుకొండి బాబు ఏమి చేస్తున్నారో?

అంటోనియో ద్వారము నొద్దకు వెళ్ళి తాళము తీసి తలుపు తెరచెను. గుణ ప్రభ ప్రాణావశిష్టయై గడపమీద పడి యుండెను. వీడి పోయిన యామె కేశరాశి మంచులో తడిసిపోయి యుండెను.

కాని యాతఁడు భయపడలేదు. హృదయము కరుణాపూర్ణమైపోయెను. ప్రేమ వాక్యములతో నాతడు వంగి యామెను తనచేతులలో నెత్తుకొని ఇంటిలోనికి తీసుకొని పోయెను.

ఇంటిలో నుండిపక్కమీద నామెను పరుండ బెట్టి ముద్దువంటి కంబళి తెచ్చి కప్పెను. ఆ ఇంటిని కాపుగ కిచ్చిన యామెను పిలువుమని యాతని శిష్యుని బంపెను. ఇంటిలో నిప్పుచేసి ద్రాక్షరసాయనమును కొంచెము వెచ్చచేసి యామె కిచ్చెను. ఇప్పు డామె కొంచెము హాయిగా గాలి పీల్చ నారంభించెను. ఇంక ను మాటలాడుటకు ఓపిక లేదుకాని యామె కండ్లు మాత్రము తెరచి చూచెను. అంటోనియో హృదయము ఆనందపూర్ణ మాయెను.

అతఁడు గదిలో నిటు నటు ఆతురతతో తిరుగుచు ఆమెఇప్పుడేవచ్చును. అంతయుసరిగాఏర్పాటు చేయుదము. ఇప్పు డయితే గందరగోళముగానున్నది.

ఏమియు తోచుట లేదు. గల్లంతుగా నున్నది. అటులనే పరుగెత్తి అంటోనియో తనబుట్టను పైనుండి ట్రంకును దింపి యందులోనుండి కొంచెము డబ్బు తీసుకొని ఇచ్చి శిష్యుని బజారుపోయి ఇంతరొట్టెలు మాంసము కూరలు తెమ్మని పంపించెను. తరువాత ఇంటిముసలమ్మ గారిచే వేడివేడి కోడిపిల్ల రసమును కాయుమని ఆజ్ఞాపించెను.

శిష్యుడు బజారుకు పరుగెత్తినాడు. ముస లమ్మ రసము కాయుటకై వంటఇంటి లోనికి వెళ్లినది. అంటోనియో ఒక్కడే గుణప్రభను కనిపెట్టుకొనియున్నాడు.

ఆమె అతనిని దగ్గఱకు పిలిచి జరిగిన దంతయు చెప్పెను. కథయంతయుఁ జెప్పిన తరువాత, "అందఱు నేను చచ్చితినని భయపడినారు కదా, సఖుడా, నీవే భయపడ లేదు. నీవే నన్నునిజముగా ప్రేమించితివి." అనెను.

అంటో:— నీబంధువులను పిలువనా?—మీఅమ్మను గాని—మీ బాబాయిని గాని—నీభర్తనుగాని ఎవరినైన పిలువనా?

గుణ— నా కెవ్వరును లేరు. నాకుభర్తలేడు, బాబాయి లేడు, అమ్మలేదు. వారందఱును నాకన్యులు— వారికి నేను చచ్చినదానను. నీకే బ్రతికినదానను, నేను నీదానను.

ప్రథమసూర్య కాంతులు గదిలోనికి ప్రసరించెను. గుణప్రభ యాతనిని చూచి మందస్మిత యయ్యెను. ప్రొద్దెక్కిన కొలదిని యామె కపోలములపై ప్రాణారుణ కాంతులు ప్రకాశించెను. ఉష్ణరక్తము చెక్కిళ్లపై పొంగివచ్చెను. అప్పుడు అంటోనియో వంగి యామె పెదవులపై ముద్దిడుకొన్నపుడు సూర్యభగవానుడు తిరిగియామెకు ప్రాణముపోసి అమర జీవితము నొసంగు చున్నాడా యన్నట్లు తోచెను.

గుణప్రభమెల్లగా, 'అంటోనియో మనకు ప్రణయబోధ చేసిన మృత్యుదేవత ఎంతధన్యురాలు! మరణాధికమైన ప్రణయముఎంత దొడ్డది!" అనినుడివెను.



# పతివ్రత.

(పొలకమూరు వీరభద్రాచార్యులుగారు)



౧

నేను బ్రహ్మచారిని. బ్రహ్మచర్యమును పాలించుచు శాస్త్రాధ్యయన మొనర్చుటకు గురువు నన్ను గోదావరీతీరమందొక యాశ్రమమం దుంచెను. అచ్చట మానవ సంచార ముండదనుట యతిశయోక్తి గాదు. పట్టణములకు దానికి సంబంధము లేదు. పల్లెలు గూడ చాల దూరమం దున్నవి. మా యాశ్రమము పర్వత పంక్తులకును నదికిని మధ్యనుండెను. అచ్చట తరులతా పల్లవముల మధ్యమును-పక్షుల పరస్పర ప్రేమావేశమును దిలకింప వలయునేగాని చెప్ప వలను పడదు.

ఆశ్రమము నంటి కొండవలకు వ్యాపించిన నొక సుందరమగు ఉద్యానవనముగలదు. అందలి మందిరముగూడ చూచుటకు సుందరముగ నుండును. వెంకట్రావను నొక భావకుని తోట. అతడు భావకుడుగాని మొదల పట్టణమునకు 70—80 మైళ్ల దూరమున ఫల వృక్షముల తోటనాటి యందు మందిరము గట్టునా?

వేంకట్రావుగొప్ప ధనికుడు. అందువలన నాత డప్పుడప్పుడువచ్చి 10—15 దినములు నివసించుచుండును. లేక యతనిమిత్రులు మొదలగు వారుగూడ వచ్చి యొకటిరెండు దినములుండి పోవుచుందురు. ఉదయమున నే నాగురు వయ్యదగు బ్రహ్మచారి పుష్పములు గోసికొనుటకా వనమున కేగుచుండెను. నేనుగూడ నాయనతోడ వెళ్లి పుష్పములు గోయుచుంటిని.

౨

ఆవత్సరము వేంకట్రావు స్నేహితుడగు వృద్ధుడొక డందు నివసింప సాగెను. ఆతనితోడ నొక యువతి—భృత్యుడు-వంటబ్రాహ్మణ బాలికయునుండిరి. ఆయువతి మిక్కిలి సౌందర్యవతి. కాని యొకింత చపలచిత్త. యువతిని వెంట నిడుకొని యావృద్ధుడు సాయంతన మా తోటయందు తిరుగుచుండెను. మా యాశ్రమ సమ్ముఖముననుండి గోదావరి తీరమున కేగుచుండిరి. మిగిలిన బ్రహ్మచారులా యువతి యొక్క చంచల-చపల — దృక్కుల గాంచి కౌతుకమును బొందుచుండిరి. అంతకుపూర్వము నాకు సంసారవిషయము తెలియదు. అందువలన నాదృక్కుల చపలత్వ మందు నిండి యున్న భావము గోచరించుటెట్లు? నేనును వారిని చూచుచుంటిని. ఒకింత వినోదము ననుభవించు చుంటిని.

౩

కొంతకాలమున కాయువతిని ముసలివాడు లేవదీసికొనివచ్చినాడని తెలిసి కొంటిమి.

ఆమె చపలయోగాదు; మూర్తీభవించిన పాపరాసి. జనసంఘమున లేవదీసికొని వచ్చిన స్త్రీతోడ కాపురము చేయుట సిగ్గులచేటని వృద్ధుడీ యరణ్యముననా స్త్రీతోడ నివసింప జొచ్చెను. భార్యయని చెప్పుచుండెను.

ఈ విషయము విస్పష్టమైన పిమ్మట ప్రశాంత హృదయులగు మా గురువుగారికి గూడ ఆగ్రహము కలిగెను. గురువు చెవుల బడకుండ నాసహాధ్యాయులీయావిషయమును గైకొని పరిహాసములు - పక పకలు సలుప జొచ్చిరి. నేను మాత్రము విచలితుడను గాకుంటిని. వారితో చేరి పరిహాసములకు గడంగకుంటిని. నేనుతప్ప మిగిలిన వారెవ్వరా తోటలో నడుగిడకుండిరి.

మా గురువర్యుడు నన్ను గూడ నటకు బోవలదని నిషేధించెను. నేనెప్పుడును గురువును దైవతుల్యునిగ దలంపుచుంటిని. కాని కొంచెము వికటత్వము మాత్రము నాయందు గలదు. వెంటనే గురువుతోడ నిట్లంటిని "గురుపద పద్మములయందు నాకణుమాత్రమైన భక్తి శ్రద్ధ లున్నచో, వేయుమంది చపలచిత్తలగు స్త్రీలు నన్నాక్రమించినను నేనణుమాత్రమైననుచలింపను." అని నా ప్రతిజ్ఞ కాయననెను.

నేను మామూలుగనే ప్రతి దినము వారి తోటలోని కేగి పుష్పములు గోసికొని వచ్చుచుంటిని.

౪

అప్పు డావృద్ధు డెచ్చట నుండెనను విషయము నాకు తెలియదు. ఉదయముననే పూలు గోయుచు నా గృహముకేసి చూచితిని. ఆ యువతి తెప్ప వాల్చక నన్ను చూచు చుండెను. నాలుగు నేత్రముల దృష్టి వియ్యమందుటవలన నా యువతి గృహములోనికేగి కిటికీ ద్వారమున నన్ను చూడ జొచ్చెను.

బాల సూర్యు డింకను తూర్పు దిక్కు నలంకరింపలేదు. కేవల మరుణ కాంతులు మాత్రము ప్రభాత సూర్యుని రాకను సమస్త చరాచర జంతు జాలమునకు నివేదింపు చుండెను. శిశిరసిక్తమగు పుష్ప దళములు తలయెత్తజొచ్చెను. పర్వత పంక్తుల ముసుగు దొలగి యపూర్వముగ గన్పడుచుండెను. అప్పుడు — ఆ విశాల నిర్జన ప్రకృతియందు సంసార జ్ఞానశూన్యమగు నిర్మలహృదయము ననేకుంటిని. కాని యాయువతి దృగ్బాణముల వలన నా హృదయము కంపింప జొచ్చెను. పూల బుట్టను క్రింద బెట్టుకుని చతికిలపడి కూర్చుంటిని.

ఒక్క క్షణకాలమైన పిమ్మట నా యువతి దాసియు బాలికయు వెండి పళ్లెరమున పూలుదెచ్చి నా పూల బుట్టయందు గుమ్మరించిరి. అప్పుడు నాకు తెలివి వచ్చెను. ఉలిక్కిపడి లేచి యా పూల నచట విరజిమ్మి చివ్వున తోటను వీడితిని.

౫

ఆ దివసము నుండియు నా తోట కేను కన్నెత్తియైన చూడకుంటిని. కాని నాహృదయమునుండి తొలంగిన పవిత్రత తిరిగి[illegible] లేదు. అందువలన గురువర్యుని పాదము[illegible] మీద బడి యిట్లు ప్రార్థించితిని. "ప్రభో! మా యింటి కేగి తిరిగి వత్తును. ఆజ్ఞ [illegible]యుడు."

కాని గురువర్యుడు సమ్మతింపక యిట్లనియె. "వ్యాయామ మొనర్చినగాని శరీరమునకు దార్ఢ్యము గలుగదు. అటులనే మనస్సు గట్టిపడవలయుననిన మనో వ్యాయామము గావలయును. కావున నిచ్చట నేయుండుము" కాని దానికెట్టి ప్రత్యుత్తర మీయకుంటిని.

అంతట గురువర్యుడు సన్యాసక్షేత్రమునందుంచి శిష్యులతోడ వెడలి పోయెను. ఇంతకంటె యన్యాయము గలదా?

నా హృదయ సంకటము మిక్కుటమాయెను. నరక సదృశముగ నుండెను. ఘోర యుద్ధము జరుగుచుండెను. మనోస్వస్థత లేకుండుట వలన నా శరీరమున వ్యాధి ప్రవేశించెను. రోగము దిన దినాభివృద్ధి యగుచుండెను. కాని తర్వాత యేమైనదో నాకు తెలియదు.

## ౬

నాకు తెలివివచ్చి కన్నుదెరచిచూచు నప్పటికి నా తల యాయువతి తొడమీద నుండెను. వృద్ధుడు సమ్ముఖమున కూర్చుండెను. వారు నాకు చేయు సేవాశుశ్రూషలు వర్ణనాతీతము లనుట కంటె చెప్పుటెట్లు? నేను గర్భదరిద్రుడను. ఐశ్వర్యమను విషయమే నా కప్పటికి తెలియదు. కాని మహైశ్వర్యవంతునకుగూడ నిట్టి సేవలభించునని యనుకొనను.

నా కారోగ్యము గలిగిన కొలదిని వృద్ధుని రాకతరిగెను. కాని యా యువతి మాత్రము రాత్రింబవళ్లు నాకడనే యుండి నాకు సర్వవిధోపచారములు చేయుచుండెను. ఆయువతి సేవాశుశ్రూషలకు నేను ముగ్ధుడనగుచుంటిని. శరీరమునకు బలము చేకూరిన కొలదిని యాయువతి రూపురేఖా విలాసములసదృశమగుచుండెను.

నా మనము చలించెను. ఆయువతి యిచ్చు చేదుమందు నాకమృతతుల్యమగుచుండెను. చేతి విసనకర్రతోడ విసరుచు కథలు జెప్పునప్పుడు ఆరక్తిమ కపోలము—ప్రవాళసదృశమగు నాయధరోష్ఠము- దానిమ్మగింజల మించుపలువరుస- మొదలగునవి నన్ను పరవశునిగ జేయసాగెను. ఆ విషయము నామె గమనింపుచుండెనో లేదో సరిగనుడువజాలను.

నాకు సంపూర్ణముగ నారోగ్యము గలిగెను. పరుల సహాయముతోడ బని లేకుండెను. అయినను నాయువతి క్రమము తప్పక వచ్చి నా కుపచారము చేయుచుండెను.

ఆదినమున నేను తైమరచితిని. వనమునందు నివసించు సన్యాసినగు నే నెప్పుడును నట్టి రూపగుణ తేజో విలాసములచూడలేదు. సరస వాక్యముల మృదుమందహాసమున నన్ను ముంచి లేవనెత్తి యాయువతి యటనుండి యేగునప్పుడు నే నాగలేకుంటిని. పరుగెత్తి యువతిచేయిబట్టుకొని కొప్పుచు నిలుచుంటిని.

ఒక్క నిమేష కాలమున నా యువతి చపలత్వ మంతర్హిత మాయెను. ప్రశాంత దృక్కుల నన్ను జూచుచు నిట్లనియె. "నేను పతితను. అయినను అవిశ్వాసినిని గానుసుమా"



# వేశ్య

( అయ్యంకి వెంకట రమణయ్య పంతులుగారు)

నేను వేశ్యను. వేశ్యకును ముక్తికిని సంబంధమేమి? ముక్తికిని నాకును సుదూరము. స్వర్గ నరకముల కున్నంత దూరము. కాని నోరుజారి నిజము చెప్పితినని నవ్వకుడు. ఎక్కిరించకుడు. సత్యమును గ్రహించితిమేని యానందింపకుడు.

నిజము. నేను జెప్పినమాట యథార్థము సంఘమందు నేను కులటను; పతితను. విశుద్ధమగు పవిత్రతను గాంచుటకు నాకేమైన మార్గముగలదా?

మానవులలోని తీవ్రమగు దానవ ధర్మమునకు శాంతి నొసంగున దెవ్వరు? నేను. యుగ యుగాంతరముల నుండి నాశరీరము తీవ్రతమ దావానలమునకు గురియగుచున్నది. బలియగుచున్నది. దగ్ధమగుచున్నది. అనంత పశువాసనను పరితృప్తిపరచు లీలయందోలలాడుచున్నది. విశ్వమందలి సమస్తజీవప్రవృత్తి దుర్జయ దురంత ప్రవాహమును దాటలేనప్పుడు నాకుపిలుపువచ్చును అప్పుడు నేనొక్క గంతున పరువిడుచు వత్తును. నానవనీత హృదయమును కఠినపాషాణముగ నొనర్చుకొని యా ప్రవాహము యొక్క కఠినఘాత ప్రతిఘాతముల సహింతును. సర్వోత్తమమగు ధర్మమును ఉన్మాద-ప్రవృత్తి ప్రవాహమున తర్పణముగనర్పింతును. అంతకంటె మరియొక యుపాయమేమి? చేయునది లేదు. కాని దీనికి బాధ్యులెవ్వరు? చిరకాలము నుండి మీరే........

మూలగూర్చుండి సంఘము నాకేసిచూచుచు- తలద్రిప్పుచు- "నిజము-నిజమేగదా! విషే.విషయం" అనినవ్వుచుందురు.

ధనలోపమున మోమున కండ రంగు మెత్తుకొని యభినయ మొనర్చుటకు బ్రారంభించి నప్పటినుండియు క్రమక్రమముగ నట బృందము యొక్క మాయ వికసింప జొచ్చెను. మృదుమధురమగు నారీప్రకృతిని ధ్వంస మొనర్చుకొని సంసిద్ధులగు చుండిరి. అప్పుడు నామనసేమైనది? స్పందనము — అనుభూతి - మొదలగు నవి లేని యొకయంత్రముగ మారిపోతిని.

గతించిన శనివారము పిచ్చిదాని వేషమును ధరించి గానాభినయనము లొనర్చి తెరలోనికి బోయినంతనే నాకు వినబడిన మాటలివి "శారీరము మంచిది. చూచుటకు గూడ బాగుగనున్నది" ఈమాటలు చెవిని బడినప్పుడు నాస్థితిని వర్ణించుటెట్లు? నాహృదయము దేనితోడనో నిండిపోయెను. తిన్నగ చూచితిని. నాసమీపముననే సుందరుడగు యువకుడొకడు కూర్చుండి యుండెను. అతడు మరియొక వేషమునకు నన్ను సంసిద్ధపరచుటకై వేచియుండెను.

అభినయము పూర్తియాయెను. నేను అలసి సొలసి వేషములు వేసుకొను గదిప్రక్కనుండు ఖాళీస్థలమున నిలుచుంటిని. దగ్గరగ నవ్వుచుండిరి. కొన్నిమాటలు వినబడెను. విన్నమాటలెవ్వి... "వహావ్వా?

అశ్రుదుఃఖరుద్ధకంఠమున బాసు విమలను చూచి నావా! అరే! రాత్రి మోచిన జ్వరము వచ్చి మంచమున బడవలసినదేరా? ఇంతలో నొకడు "పిచికారితోడ రంగునీళ్ళు నా మోమున గొట్టెను. ఏమి చేయుదును? కోరుము మానుకొని నిలుచుకొనుంటిని".

నాకు రూప సౌందర్యములు కూడనా! ఛీ-ఛీ-ఈ పాడుశరీరము మీద సాధారణ మానవుల కెల్లర కధికారముండని యెడల నియతాచారమును సహింపగలనా? కాని నాకాశక్తి యెచ్చట! నాకొరకు వచ్చు గుడ్డి కుంటి కురూపి పిచ్చివానినైనను తృప్తిపరచవలెను. లేని యెడల హతభాగ్యరాలి గృహమునకు వచ్చువారెవ్వరు? తిండి యెక్కడ? కడుపు మంటతో చావవలసినదే. వేరుమార్గమేమి?

పాడగలను. ఆడగలను. వ్రాయగలను. చదువగలను. అయినను నాకన్నిటి ధారలకు కారణమేమి? ఈ విషయము నాయందాక మారైనను మేల్కొనజేలను?

...ఎందుకు? వినదిదియేమి? ఆత్మసాక్షిగ నొక్క నిముషము యోచింపుడు? మమ్మెప్పుడైన సన్మానించిన వాడున్నాడా? జగత్తంతయు మమ్ము బహిరంగముగ నసహ్యించుకొనుచుండుటలేదా? నీతివాదులమని డంబవాదులు పల్కు వారికి కూడ మామీద యొక్క కణమైన సానుభూతిగలదా? కాని నలుదిక్కులనుండి తృష్ణ-తృష్ణ-తృష్ణజ్వాలలు మమ్ముముట్టడించుచుండును. అట్టిస్థితియందు మానవుని మనోగతి యెట్లుండునని చెప్పగలరా? తెలిసినదా? గ్రహించినారా? నేను కూడ ప్రేమింపగలను. అభినయము కాదుసుమా! యదార్థముగు ప్రేమ. ఇట్లనుచున్నానని నవ్వకుము. హేళనచేయకుము. వెక్కిరింపకుడు. మీదగ్గరనుండు డబ్బును మేము లాగుకొనక తప్పదు. లేనియెడల మాకు తిండియెచ్చట? అబ్బా! క్షుద్బాధ అసదృశముగాదా! మమ్ము పోషించువారెవ్వరు? మేము మిక్కుటముగు విశ్వాసఘాతుక కార్యమును చేయుచుందుము. నిజము. అట్టి ప్రతివానిని ప్రేమింపగలమా? మీరు సాధ్వీమతల్లిని యేదృక్కుల గాంచుదురో ఆదృక్కులతోడనే సచ్చరిత్రులను మేము గాంచుచుందుము. అయితే యిక మాదోషమెక్కడ?

...కాదు-కాదు. నేనెవరికి విరుద్ధముగ మాటలాడుట లేదు. క్రియా విరహితులు-స్వార్థపరులను వారు మాక్షేమము నారయగలరా! యుగయుగాంతరముల నుండి హృదయమును దగ్ధమొనర్చు మహాజ్వాలతో కూడిన హాహాకారమును మాన్పగలపుణ్యాత్ముడేడి? ఈ యాతనను స్వప్నమునైన మరువగలనా!

ఈపాప-పాప-పిశాచ జీవితమొకదినము నదగ్ధమగునా? దగ్ధమొనర్చుటకు గడంగువారెవ్వరు?

కాని యితరులను నిందింపను. శతకంఠముల స్వీకరింతును. ద్రోహిని-పాపిని-నేను. కాని నాదోషమేమి? నేను-స్త్రీని-అబలగబుట్టుటయే నాదోషము. నా మీదనేను లొనర్చు యనాచారమును నీరవముగ సహించుచున్నాను. భరించుచున్నాను. ఇదియే నా దోషము. ఆనందముగ నేనీ భూమండలమును విడువగలనా! విడుచుటెట్లు? అదియే నాకుశాంతి.



# కావ్యము - కవిత్వము

(పండిత శివనాథ శాస్త్రిగారు)

ఆలంకారికు లిట్లు నుడివియున్నారు.

"అవిదితగుణాపి సత్కవిభణితిః
కర్ణేషు వమతి మధుధారాం"

సత్కవుల కావ్యమందలి గుణములు గ్రహించుటకు బూర్వ మది శ్రుతిగోచరమైనంతనే కర్ణములయం దమృతధారాతుల్యముగ బ్రవహించును.

ఈ వాక్యమందెంతయో సత్యమిమిడియున్నది. మంచినేర్పరి సంసిద్ధపరచిన భోజనపదార్థముల దినునప్పుడు మంచిరుచి గలుగును. ఆనందమును పొందుదుము. కాని యిందే వస్తువు లెంతెంతవరకు గలిసినవని యోచింపము. అట్లు యోచించిన తర్వాత రుచి ననుభవించి యానందింపను బొందము. భోజనమున నుండు రుచివంటిదే కావ్యమందు కవిత్వముండును. కాని యాకవిత్వమను నది యెట్టిది? దేని నాశ్రయించియుండును అను ప్రశ్నకు ప్రత్యుత్తర మిచ్చుట కష్టము. కాని కవిత్వమని మాత్రము గ్రహింపగలము. భోజనపదార్థముల రుచిని గ్రహించుటకు రసనేంద్రియముండినటులనే యాత్మకు గూడ రసనేంద్రియ మున్నది. అది సౌందర్యజ్ఞానము.

స్థూల బుద్ధులగు మానవులు కవిత్వము ఛందమునం దుండునని దలంతురు. సౌందర్యమునకును ఛందమునకును విడదీయుటకు వీలుగాని సంబంధమున్నమాట నిజము. శిశువులాడునప్పుడు పరుగిడునప్పుడు నవ్వునప్పుడు నృత్యము చేయునప్పుడొక విధమగు సౌందర్యము వెల్లివిరియుచుండును. దానిని గాంచినవాని హృదయమం దానందము తాండవం బాడును. బాలురు పాటలు బాడుచు కరతాళముల వేయుచు నృత్యము సల్పునప్పు డపూర్వమగు ఆనందమున మైమరచుటయం దాశ్చర్యమేమున్నది? సాయంకాలమున సువర్ణలాకాశమున పక్షిబృంద మెగురుచు పాటలు బాడుచు గృహాభిముఖ మగునప్పు డానందము గలుగదా? ఇందువలన నెచట గాంచినను సౌందర్యమునకును ఛందమునకును; సౌందర్యమునకును తాళమునకును విడదీయుటకు వీలుగాని సంబంధము గలదని తెలియుచున్నది.

కవిత్వమునకును ఛందమునకును పరిపూర్ణసంబంధమున్నదని నుడువుటవలన ఛందమే కవిత్వమని దలంపరాదు. అట్లయినచో బాగుగ ఛందస్సును నిర్మింపగలిగిన కృతిజీవులగు కవులే సుకవులుగ బరిగణింపవలసి వచ్చును. ఇంగ్లీషుకవియగు 'Browning'

వంటిభావజీవులను, ప్రకటించుటకు శక్తులగు కవులును కవిపదవాచ్యులేగాకుందురు. మానవ జీవితమందలి వివిధభాగములలోలి కవిత్వ భాగమునకుగూడ అభ్యాసజనితదోషమున్నది. కొంతమంది గృహస్థులత్యుత్తమ భాషను నుపయోగింతురు. అట్లుపయోగించుటవారి కభ్యాసమై యప్రయత్నముగ సర్వత్రదానిని నుపయోగింతురు. కాని యందు ప్రాణముండదు. సదాశయముగూడ పూజ్యము. అటులనే ఛందోబద్ధమగువానిని వినుటకల వాటుబడినవారలకు సజీవమగు లలితపదము లింపుగనుండవు. పద్యరచన కాలమున సమాసములు క్లిష్టపదములు మొదలగునవి అప్రయత్నముగ దొర్లుచుండును. కాని లలితపదములతోగూడిన పద్యమెంత మాత్రమును కవిత్వమని నుడువజనదు. ఇది తుమ్మెదరొదవలె కర్ణములయందు రొద చేయును. కాని ప్రాణమును స్పృశింప జాలదు. హృదయమును మేల్కొలుపలేదు.

కవిత్వము నంటియుండు ఛందము కవిత్వముగా నటులనే కవిత్వముతోడగలసి యుండు అలంకారములు గూడ కవిత్వము గాదు. భావావేశమున కవి బ్రహ్మాండమును స్వీయహృదయమున భావమయముగ దిలకించును. దానితోడ యలంకారములు మొదలగు నవియుండిన యెడల కావ్యమనిపించుకొనదని యెంచరాదు. సమస్తపదార్థములకును పరస్పర సాదృశ్యమున్నది. ఈసాదృశ్యము కొంతమంది దృష్టికిమిక్కుటముగ గన్పడును. అదియాతని భాషాద్వారమున స్వతస్సిద్ధముగ బహిర్గతమగుచుండును. కానివానిని ఛందోబద్ధమొనర్చినగాని కవిత్వమనజెల్లదని తలంప రాదు. కవి యనేక సమయముల యందు స్వాభావిక గతి నడ్డగించి కార్యమొనర్చుచుండును.

అట్లయినచో కావ్యమందు కవిత్వమెచ్చట? సాహిత్యదర్పణకారుడగు విశ్వనాథ కవిరాజీప్రశ్నకు ప్రత్యుత్తరముగనిట్లనుడివియున్నాడు.

"వాక్యం రసాత్మకం కావ్యం"

రసాత్మకమగు వాక్యమే కావ్యము. ఒక యింగ్లీషు దార్శనికుడిట్లు నుడివెను. "Poetry is impassioned language" ఉభయులును నొకే మతమును వెల్లడించియున్నారు. కాని రసమనిననేమి యనువిషయము విచారణీయము. విశ్వనాథకవిరాజు "చిత్తద్రవకారియు, అలౌకిక చమత్కారత్వమయమగు ఆనందవిశేషమే రసము? అని నుడివెను. కాని యిందువలన మనకుగోచరించినదేమున్నది? ఆతడే యీవిషయము నిట్లుదెలియజెప్పుటకుబ్రయత్నించెను.

"బ్రహ్మాస్వాద సహోదరః"

రసమననెట్టివస్తువన బ్రహ్మాస్వాదసతుల్యము, అని యీవాక్యార్థము. ఇదియును అంధునికడ చంద్రకిరణముల వర్ణనమువలెనున్నది. అంధుడు చంద్రుడెట్లుండునని ప్రశ్నించినపుడు బకమువలెనుండునని ప్రత్యుత్తరమువచ్చును. దానివలన యంధునకేమిలాభము? బకమన నేమి యని ప్రశ్నింపకదప్పదుగదా? కానియిచ్చట బ్రహ్మాస్వాదమని చెప్పుటకు కారణమేమన బ్రహ్మాస్వాదనము భవగమ్యమేగాని యితరులకు దెలియచెప్పుట యసంభవమగునటులనే కావ్యరసము నాస్వాదింపవలసినదేకాని వర్ణిం

చుటకు వీలుగాదని దెలుచున్నది. అయినను కావ్యమును చదివి యందలి కవిత్వమునొక విధముగ నిర్ధారణచేయవచ్చును. కాని కవి యొక్క ముఖ్యలక్షణమగు తన్మయత్వమును గూర్చి యొకింత విచారించుట యావశ్యకము. వర్ణనీయవిషయముల తోడ నేకీభూతమగుటను తన్మయత్వమందురు. కొందరికీ తన్మయతాశక్తి స్వభావసిద్ధముగ నుండును. మనము సాధారణముగ జనసంఘమున దిరుగునప్పుడు తన్మయతాశక్తియొక్క తారతమ్యమును గాంచుచుందుము. ఒకడొక త్రాగుబోతుకథను జెప్పుచు మత్తతావస్థను తనకు గల్పించుకొని త్రాగుబోతువలెనొక్క సోలుచు వాడు మాట్లాడినటుల మాట్లాడుచుండును. కాని మరియొకడా కథనే చెప్పునుగాని మొదటివాడు చెప్పినటులుండదు. కారణమేమి? మొదటివానియందు తన్మయత్వమున్నది. రెండవవానియందది పూజ్యము. తన్మయతాశక్తి స్వల్పముగనుండువాడు మంచి నటకుడనిపించుకొనజాలడు. పురాతత్వవిదులకుగూడ తన్మయత్వము ముఖ్యము. పూర్వకాలపువస్తువులు మొదలగువానిని సేకరించుట వలన పురాతత్వవిదుడనిపించుకొనడు. తన్మయత్వమువలన పురాతనవస్తువులు మొదలగు వానినాశ్రయించి యాకాలమున మునింగి యప్పటి సమస్యల పరస్పరసంబంధమును విరోధమును గమనించి వానియంతర్నిహిత భావమును వెల్లడించువాడే పురాతత్వవిదుడు. తన్మయత్వమొక కావ్యసంగీతయభినయచిత్రకళలకు మాత్రమే సంబంధించినది కాదు. తన్మయత్వతారతమ్యము ననుసరించి మానవచరిత్రకూడ మారుచుండును. దీనుల జూచి యొకడు దుఃఖించును. మరియొకడు దుఃఖింపడు. తన్మయతాగుణమువలన దుఃఖించువాడు దీనులయవస్థను గాంచుచున్నాడు రెండవవానికది లేదని గ్రహింపవలయును. క్రైస్తు చేసినయుపదేశములలో నొకదానియందిట్లున్నది. 'పరులు నీకెట్టిమర్యాదనుచేయవలయునని గోరుదువో అట్టి మర్యాదనే నీవు పరులకు జేయుచుండుము" ఈ యుపదేశము యొక్క మూలసూత్రము గూడ తన్మయత్వమే. పరులయవస్థయందు మనము తన్మయులము గాని యెడల మనమే విషయమును సరిగ గ్రహింపజాలము. కావున తన్మయత్వమే జగత్తునందలి సర్వవిధోన్నతికి మూలకారణమని దెలుచున్నది.

ఈ తన్మయతాశక్తి కవిహృదయమందు ద్వివిధముల నెలంగుచుండును. ఒకటి సౌందర్యచిత్రణము. రెండవది సౌందర్యసృష్టి. కవి సృష్టియందలి నిబాధ సౌందర్యమందు ప్రవేశించును. మధుకరము పుష్పములపై జేరి యందలి సారవంతమగుదానిని గైకొని మిగిలిన యసారవస్తువును బరిత్యజించునటుల నేకవిచిత్తము సృష్టిపైనుండి దానియంతర్గత సౌందర్యమున ప్రవేశించును. ఈశక్తి విహీనులగు మనము చూచుచుండు చెట్లు మొదలగు వానియందన్నిటియందును కవి అపూర్వమగు యోగమును కలయికను గాంచును. ఆ సౌందర్యముయొక్క ప్రత్యంగమును హృదయమునం దిడుకొనును. దీనినే సౌందర్య చిత్రణశక్తి యందురు. సౌందర్యసృష్టి శక్తియింతకంటెను విస్మయకరము. తన్మయతాప్రభావము వలన సృష్టిశక్తి వివిధమగు సౌందర్యాంగములను

శబ్దముల వ్యవహరించునప్పుడు హృదయమం దలి భావరాసి బహిర్గతమగు చున్నదా లేదా యని యోచింపరు. శబ్దముకటుపుగనున్నదా - గానులేనుందురని మాత్రమే యోచింపు చుందురు. నటుడు నిర్జనగృహమున గూర్చుండి యభినయము నభ్యసించు నప్పుడుగూడ దర్శక బృందమును మరువడు. అటులనే శ్రుతిజీవియగుకవి యింటరిగనుండి కావ్యమును వ్రాయుచున్నను చదువరులను మరువడు.

భావజీవులగు కవులు హృదయమందు ద్వలితమగుచుండు భావసింధువునందు నిమగ్నులైయుందురు. వారుపయోగించు భాష ద్వారమున భావము సరిగవెల్లడి యగుచుండును. కాని పరులనిందాస్తుతులతోడ వారికి సంబంధము లేదు.

కావ్యమును బఠించు నప్పుడు గూడ కవిత్వముగలదా లేదాయని గ్రహించుటకొక్క టేమార్గము గలదు. కావ్యమును చదువు నప్పుడు చిత్తముతన్మయత్వ వేశమున దగులొక్కనవలయును. అనగాకవివర్ణించిన విషయమునందు పాఠకుడు తన్మయుడైయున్న దాను మరువవలయును.

ఒక్కదృష్టాంతమునుజూపుచున్నాను. స్కాట్లండునందు రాబర్టుబర్న్సు అనునొక సుప్రసిద్ధకవి యుండెను. గీతకావ్యముల విషయమున నాతడద్వితీయుడు. (To mary in Heaven) అనునొక కవిత్వముగలదు. అతడురచించిన వానియందిది సర్వోత్కృష్టమైనది. వానినుండికొన్ని పంక్తులనీక్రింద నుదాహరింపుచున్నాను.

That sacred hour can I forget?
Can I forget the hallowed grove
Where by the winding Ayr we met,
To live one day of parting love!
Eternity will not efface
Those records dear of transports past!
Thy image at our last embrace,
Ah little thought we' 'twas our last!
Ayr, gurgling kissed his pebbled shore,
O'er hung with wild wood's thickening green;
The fragrant birch, and hawthorn hoar
Twined amorous round the rapturous scene;
The flowers sprung wanton to be passed,
The birds sung love on every spray,
Till too, too soon, the glowing west,
proclaimed the speed of winged day,

ఈపంక్తులయందు కవిత్వముకలదని యెల్లరంగీకరించియున్నారు. ఏది శ్రీఘ్రగా చమువుచున్నప్పుడు చిత్తమునందపూర్వశక్తియుత్పన్నమగుచున్నదే యాశ్చర్యమేమున్నది? చూచి—స్పష్టమైభోగాపమగ్నజగత్తునువీడి చిత్తము ఆ మనోహరమునందలి నికుంజవనమధ్యమున ప్రణయయుగళము పరస్పరాలింగనమొనర్చుకొను చోటునకు పరువిడదా? ఋషియగు ఎమర్సను ఒకచోట నిట్లనుడివెను. „All mankind love a lover" సమస్తమానవజాతియు ప్రణయునిని ప్రేమించును. ఇతడిందుకు పూర్వోక్తమగు దానియందుకవి కొంచెమధికముగ బల్కియున్నాడు. „సమస్త ప్రకృతియు ప్రణయయుగళమును ప్రేమింతురు. ఆయర్ నదీ

తీరమున నుంచి నిర్గమింపు చుండెను, వృక్షములు లతలు పరస్పరము ప్రేమాలింగనమున బంధింప బడుచుండెను; ప్రేమవలన పుష్పములు గదలుచుండెను; పక్షులు ప్రేమాలాపము లొనర్చుచుండెను; ప్రకృతి యంతయు నాదినమున నీపత్నియ యుగళము యొక్క ప్రేమామృతమును పానమొనర్చి తన్మయత్వము నొందుచుండెను. ఆహా? మానవునకును ప్రకృతికిని నెట్టి యపూర్వ సంబంధము? తన్మయత్వము యొక్క యపూర్వ సృష్టియెంత యద్భుతమైనదన్నది? తరువుల సౌరభము ఘ్రాణేంద్రియమున నాకర్షింపు చున్నది. పక్షుల ప్రేమసంగీతము కర్ణముల ప్రతిధ్వనింపు చున్నది.

సుప్రసిద్ధ గాయకుడగు తానసేనుడు రాత్రి రెండవ యామమున నుషః కాలరాగమును బాడజొచ్చెను. అందు వలన కాకులు దెల్లవారెనని యరువ సాగెను. దీని యర్థమేమన, అతడు ప్రభాతరాగము తోడ ప్రభాతవర్ణనమును చేయునప్పుడు శ్రోతృగణము తన్మయత్వమున మునుంగుట వలన కాకులు మొదలగువాని కేకలు విన బడుచుండెను. ఇట్టిమహత్తర తన్మయత్వ సృష్టియే గదా కావ్యమునకు ప్రథమలక్షణము.

ద్వితీయ సంకేతము ఉద్దీపనము. ఉత్తమ కావ్యమందు రసముండును. అది పాఠకుల హృదయమందు అనిర్వచనీయ సౌందర్యమును ప్రేమభావమును మేల్కొలుపును- నదియందలి సుడిగుండమున కర్రముక్కను వేసినయెడలనది గిరగిర తిరుగుచు దాని యందే యుండునటులనే కవి భావరాసి యందొక సుడిగుండమును సృష్టించును. దానియందు బడిన చిత్తము దానిలోని క్రీడ్వబడి యందుమునింగి పోవును. కవిహృదయ సాగరమున పొంగి పొరలి కావ్యసృష్టి యొనర్చు భావ తరంగములు మనహృదయమందు గూడ బ్రవహించును.

సౌందర్యజ్ఞానము ప్రేమశక్తి మానవ హృదయమందు నిగూఢమైయున్నవి. ఆరు మాసముల వయసుగలిగిన బాలునకు గులాబి పువ్వును చూపించిన యెడల వానిమోము వికసించును. దానిని బట్టుకొనుటకు చిన్న చేతుల జాపయత్నించును. ఇదియే మానవ హృదయమందలి సహజ సౌందర్య జ్ఞానము- సౌందర్య సాక్షాత్కారము వలననే సౌందర్య జ్ఞానము ద్దీపితమగును. శైశవావస్థ నుండియు బాలబాలికలకు సుందర పదార్థములను దర్శించునటుల జేసినయెడల వారు చిత్రకారులు లేక సౌందర్య రసభోగులగుదురు. మానవహృదయ మందు నిద్రాణమైయుండు సౌందర్య జ్ఞానమున కొకింత రాపిడి యవసరము. లేనియెడల నదియటులనే నిద్రాణమై యుండును, కాని భగవానుడట్టి యసహాయావస్థ యందెప్పుడు నుండ నీయడు. ఆధ్యాత్మిక జ్ఞానము మనయందు వికసించుటకు గాను, సాధుజీవితమును, సాధు హృదయమును అభివ్యక్త మొనర్చునటులనే కవి హృదయ ద్వారమున మన యందలి సౌందర్య జ్ఞానమును వికసింప జేయుచుండును. ఈసౌందర్యాభి వ్యక్తినే యుద్దీపనం బందురు.

సౌందర్యజ్ఞానమునుబోలి ప్రేమశక్తి సమస్త జీవులయందున్నది. సమస్త జీవులకుపరస్పరసంబంధమున్నది. పరస్పరసుఖము కొఱకుపరస్పర

ను బేర్చిమింపు చుందుము. జీవులయందు ప్రేమస్వభావ సిద్ధముగ నుండునటులనే వైర భావముగూడ నున్నది. ఒక కోతి కుక్క కొంతకాల మొకచోట నుండునని కొనుడు. వానిని విడదీసిన యెడలనవి విచారమునుబొందును. స్వభావ సిద్ధమగు నీప్రీతిని గూడ పరిస్ఫుట మొనర్చుటకు ఉద్దీపన మావశ్యకము. ప్రేమాస్పదుని సహాచర్యమువలన ప్రథమమున ప్రేమయుద్దీపనంబగును. తర్వాత సాధుహృదయము లేక కవిహృదయ మందలి ప్రేమవలన యుద్దీపనము కలుగును. ఉత్తమ కవి కవనమునందు ప్రేమను ప్రవహింప జేసినటుల మరి యెవ్వరును జేయ జాలరు. ప్రాణమందు ప్రేమ వికసింపవలయును హృదయమును సున్నతముగ నొనర్పవలయును మనమును నిర్తిరసముతో గూడిన సౌందర్య సాగరమున ముంపవలయును, అట్టిదే కావ్యమని పించుకొనును.

ఉద్దీపనమున కొక దృష్టాంతమును జూపించెదను. మిల్టను పారడైజులాష్టు అను గ్రంథమును చదవి ముగ్ధులు గాని వారుందురా? అందు దాంపత్య ప్రేమ యొక్క యుద్దీపనము అపూర్వముగ చిత్రింప బడలేదా? మానవహృదయమును సుఖ స్వచ్ఛందముల నోలలాడించి యభివృద్ధి నొందించు దాంపత్య ప్రేమ ననుభవింపుచుందుముగదా?

ఉద్దీపనము మానవ హృదయ మందొక విధమగు కోమలతను సరసతను స్నిగ్ధతను గలిగించి అపూర్వసౌఖ్యము నమునుచును, గిరిశృంగముల యందు టేకు, చెట్లను చూచియుందురు, ఆవృక్షములు దీర్ఘాకృతి గలిగి సౌందర్య విహీనమై యుండును, వానిదీర్ఘాకృతి యందు గాంభీర్యముండును. కాని రామణీయకత పూజ్యము. వాని యందనేక పక్షులుండును. అందువలన నీరసమగు నాతరు రాజము ముఖములు గుడ్డకప్పినటులై యాపూర్వ కోమల కాంతిని ప్రసరింప జేయుచుండును. ఆపక్షులు లేనప్పుడా వృక్షము చూచుట కింపుగ నుండదు. అటులనే మనజీవితమునుండి భావము యొద్దీపనము దొలగిన యెడల స్వార్థ విషయాసక్త మగునగ్న జీవితము గాన్పించును.





# హిమబిందు.

(అడివి బాపిరాజుగారు.)

---

ద్వితీయ భాగము.

రెండవప్రకరణము.

[illegible]గాడు సమవర్తికడకు శతృవుల [illegible] పనీతి [illegible]యు [illegible] [illegible] [illegible] [illegible]పిన [illegible]నుక [illegible]వర్తి రాయ [illegible] [illegible] [illegible]రము [illegible]నికి రమ్మనుమనిరి. [illegible] సేనానాయకా! వీరాగ్రణీ! నేను నీకు [illegible]తుల్యములగు కొన్ని విషయముల నెరింగించెదను; నాకు అభయమిచ్చిన వెనుక వానిని మీకు మనవిచేసెదను'' అనియారాయబారి వాక్రుచ్చెను.

"ఓయీ రాయబారము నిండుసభలో నుపదేశింపవలయును. అట్టియప్పుడు నీవు నాతోడమాత్రము మాట్లాడుటకు కోరి నందుల కనుమతించితిని. రాయబారి ప్రాణమెప్పుడును సురక్షితము. తుచ్ఛులగు మీవంటి ప్రభువులు ఆధర్మమునకు దూరులగుదురేమో. ఆంధ్రవంశము మాది. నేను శాతవాహనుడను. మేమట్టియవినీతి యెన్నడును సలుపము. నీప్రాణము నీయదియె. చెప్పుము, పొమ్ము'

"ఓ సమవర్తీ! వరోత్తమా! మీరు శాతవాహనువంశజులు. చక్రవర్తి కాదగినవారలు మీకు తెలియని ఆలోచన ఒండెద్దియులేదు. ప్రతిష్ఠానమున యువరాజు నెవరో నిర్జీవుని చేసినారని మాకు వేగువచ్చినది. దాని నిజమరయుటకై అంచెలపై చారులను పంపినాము. రేపు నిజము తెలియ

గలదు.'' ఈఅబద్ధపువేగు తెచ్చిన వాని నాలుక ,,వేయి చీలికలు చేయకయుండిరా! ఓయిపెఱ్ఱివాడా? ఎవరురా శ్రీకృష్ణసాతవాహనుని నమయించుటకుపూనుకొన ధైర్యమున్నవారు?'

"ప్రభువు ఆగ్రహింప కుందుగాక. మా వేగు నడపనిందు. ధనకటకమున ఈవార్త తెలిసినది. ఆంధ్ర ప్రభువు యుద్ధయాత్రకై బయలుదేర సంసిద్ధుడైయుండియు నాగిపోయెను. మీకుసహాయము రాదు. నాల్గు దినములైనవరకు మీసైన్యము నమస్తము రూపుమాసిపోవును. మాసైన్యము దినదినాభివృద్ధిగాంచుచున్నది."

,,అయిన నేమందువు?''

,,వినుడు! మీరు వీరాగ్రేసరులు. యౌవనవంతులుమీరు మాలోన జేరిపొండు. మీప్రాణమునకు మా రాజభయమిచ్చుటయేగాక ఆంధ్రరాజ్యము సమస్తము జయించి మీకాధిపత్యము కట్టంగలవారు. మాయొడయనికి స్నేహితులై కుడిభుజములై భువి పరిపాలించెదరుగాక! మీరిరువురు ఉత్తర దేశముల జయించెదరు. ఆర్యులై వేద మతోద్ధారకులై రాజసూయము నందు పాల్గొనియెదరు. ఆయన చక్రవర్తియగును ఆయనకు మీరుకుడిభుజమగుదురుగాత'

,,ఏమిధార్త్యము! అటుతరువాత''

"మీకు రెండుదినములు గడువుఇచ్చినారు. ఆదినములలో మీసైన్యములు కోటదాటిపోవలయును. ఆయుధములు దిగవిడిచి వెడలవలెను. ఆహారపదార్థములు ఒక్కరోజునకు సరిపడునవి మాత్రమే తీసికొనిపోవలెను. మీరు మీదారిని పొండు. లేదా మాళవేశ్వరునికడకు బోయి అగ్నిసాక్షిగ మిత్రత్వము నెరవుడు''

,,ఓరి ఛండాలుడా, ఆంధ్రులలో పిరికిపందలు రాజద్రోహులు నెందువనైనను లేరు. మీరాజు చక్రవర్తియా? నేనాంధ్రరాజ నగుదునా ఏమి యీఅఘట నఘటనా చాతుర్యము. నీతికౌటిల్యాని మించిపోవు చున్నది పో ఇంకనీరాయబారమునాకువలదు. ఆంధ్రులలో ఒక్కసిక్కైన ప్రాణమున్న ఆతనుకూడ తనబాహుబలము రుచిజూపి మరియు అంతరించుగాక! చక్రవర్తివచ్చుచున్నాడు మాకు. వేగువచ్చినది. మీసైన్యములు నామరూపము లేక నశించిపోవా? ఇప్పటికైన మాళవుని తదితర నాయకులను ఆయుధములు వదలి బంధితులుగా మాకోటలోనికి రానిండు. మీసైన్యములు విడిపోయి చెల్లాచెదరు కానిండు మీనాయకులకు ప్రాణదానము చేసెదము. లేదా ఒక్కనినైనను కొనయూపిరితోకూడ పోనీయము. ఆంధ్రసింహనాదము మీగుండెలవియచేయదా! ఆంధ్రమృగేంద్ర నిశితనఖములు మీరక్తము సంపూర్ణముగ గ్రోలవా. పో! ఇదియే నీరాయబారమునకుత్తరము మీకుఒకదినము గడువిచ్చినాము. ఆలోచననే చెప్పినది చేయలేనిచో మీపాటు మీయదియ. అని సమవర్తి మోము తేజరింప మీసముల కొదుకలునిక్కపొడువకన్నులు జ్వలింప నుత్తరువిచ్చెను. ఆతనిచేయి కరవాలముయొక్క పిడిపైననే తాండవమాడు చున్నది.

,,ఓ యుత్తమసైన్యాధిపా! వినుడు. అంత్యసందేశమున్నది. అయ్య దితమకు మనవి

చేసి మరియు పోయెదను. చారుగుప్తుడను వర్తకరాజు మీకు మేనమామయట'

"అగును"

"ఆతనికి సౌందర్యనిధియగు కుమారి హిమబిందువగునట"

"ఏమది!"

"చారుగుప్తుడు ఆంధ్రసింహాసనమున కాదిశేషువట"

"ఏమిరాని వాచాలత మీరుచున్నది"

"ఆహిమబిందు కుమారి తనకు మిక్కిలి ప్రియతమముగు వస్తువట"

సమవర్తి మాటలాడక తీక్ష్ణదృష్టుల నారాయబారిని గమనించుచు తనగుండెలు కొట్టుకొనుట కనుగొనియెను.

"ఆర్యా! ఆబాలిక ఇప్పుడు మాకు ఖయిదీ అయినది. ఆమెను మీదేశస్థులే ఎవరో ఎత్తుకొనివచ్చి మాకు ఒప్పగించినారు. మీసైన్యము లీరోజున కోటవిడిచి పోవలయును. లేనిచో హిమబిందును ఒకకుష్ఠువానికి వివాహము గావించెదము. రేపటికిని మీరు వదలనిచో ఆమెప్రాణములహరింపము. కాని ఒక కన్ను ఒకచేయి నశించును. ఆమె కన్యాత్వమును యేరును అనుమానింపకుండ ఆమె మిత్రవనుకూడ ఆమెతోబాటు బంధించికొని వచ్చినారట. ఇదియనారాయబారము .పని విసయెదను. నమస్కారము. మీరుచెప్పిన ఆజ్ఞల మీసైన్యములు పాలింపనిచో మీరొక్కరైన మాశిబిరములకు వచ్చివేసి మాప్రభునకు మిత్రులుకండు. ఆర్య సమస్కారము'' అని ఆరాయబారి వెడలిపోయెను. సమవర్తికత్తినియొరనుండితీసి నాడు. మీసములు పెదవుల సందులోనికి రానిచ్చి కొరుకుకొనినాడు. కోపముచే వణకు దేహమును రౌద్రముచే దూమారము కప్పినమనస్సును కలవాడయి సమవర్తి వినీతమతికడకు వెడలిపోయి రాయబారము యొక్క యుదంతమంతయు వాక్రుచ్చెను.

వినీతమతిఆశ్చర్యనయనములతో సమవర్తిని కనుంగొని "ఓయీ నేను నీమాటలనే మాత్రము విశ్వసింపను. అంతయుకల్ల. వారికి కోటలోనిసంగతి తెలిసికొన ఊహ కలిగి వీనినిబుచ్చినారు. అదియే నిజము."

"ఆర్యా, నేనంతకు జాగ్రత్తపడియే యుంటిని. కోటగుమ్మ మావలనే ఆతని కన్నులుకట్టి సభాభవనమున కట్టువిప్పినాను. వెడలిపోవునప్పుడు కోటగుమ్మమావ్రక్కనే కట్టువిప్పుమని ఆజ్ఞయిచ్చినాను''.

"ఆనందము! మంచి పనిచేసితివి! అయిననిప్పుడు నీవు వాక్రుచ్చిన దేమాత్రము నమ్మకము. హిమబిందును పట్టుకొనుట వీరి కెట్లుసాధ్యమగును."

"నాకును నమ్మకములేదు. మన చక్రవర్తికడనుండి వార్తలేలేవు. భోజసైన్యములు నానాటికి శత్రువులను ప్రబలముగా జేరుచున్నవి. సుశర్మకడనుండి సైన్యములు వచ్చినవి. ఉత్తరరాజ్యములన్నియు ఈ సమయమున మాపుళనకు సహాయమునకు వచ్చినట్లు తోచుచున్నది. ఈ రోజునను, రేపటెల్లుండియు కోట పై వారు పెరువకగలిసినచో ఎల్లుండిమనపని హుళక్కి. ధాన్యకటకాధిపునకు మన మేమైతిమో చెప్పువారు కూడనుండరు. ఇవియన్నియు ఆలోచించుచున్న నాకు హిమబిందుమాట నిజమేమో

అని అనిపించుచున్నది. యువరాజుసంగతి? ఏమియు నాకు తోచుటలేదు. మూర్ఖులగు మన వార్తాహరులు ఈ జాతుహింసకుల పాలబడిపోవుచున్నారు. నేను వెడలి కను గొనివత్తునా అని యున్నది.''

,,హిమబిందు విషయము నిశ్చయమా? అబద్ధము,, అని వినీతమతి ఏమియో చెప్ప బోవుచుండ ఒకసైనికుడు లోనికేతెంచి వారికి ప్రణామమిడి ,జయము! జయము!! ఆ రాయబారి వెడలిపోవుచు నేను సమవర్తి సైన్యాధ్యక్షునకు తెలిపిన యుదంతమునకు సాక్ష్యములివియె. ఇయ్యవివారికందజేయుడు. అని యీ మంజూష మాకిడినాడు. ఇందేమి యున్నదో యచ్చటనే పరిశీలించి మరియు గొనివచ్చినాము. ఇందు ద్రోహకరములగు నవేవియు లేవు. అధిపతులు పరీక్షింతురు గాక అనియని'' తాచిన్నపెట్టె వారిమ్రోల నునిచెను. వారా మందసము తెరచుటయు నందున్న భూషణములచూచి సమవర్తి హాహాకార మొనర్చెను. ముద్దులుగులుకు నవియు నవరత్నఖచితములైనవియు నగు నాయాభరణములు హిమబిందు కుమారికా రత్నము ధరించునవియే. వానికడ నొక మొగలియాకుపై లిఖించిన లేఖయున్నది. అది యందుకొని సమవర్తి యిట్లుచదివెను.

,,శ్రీ మహారాజవంశీకుడును, వీరాగ్రేసరుడునగు మా మేనయత్తకుమారులు సమవర్తి సైన్యాధ్యక్షునకు హిమబిందు నమస్కారములు. నన్నువీరు మా యింటనుండి హరించి మాఅమ్మగారితో గూడ గొనివచ్చినారు. ఇది యే ప్రదేశమో తెలియదు. ఇందుమమ్ము బంధించినారు మమ్మువీరు గౌరవముగా జూచుచున్నారు. మేము స్థైర్యముగానున్నాము. కాని మమ్మేలకో వీరనేక విధముల గౌరవించు చున్నారు. మీకు కమ్మ వ్రాయుమని కోరగవ్రాసినాను. ఇంతవరకే వీరు నన్ను వ్రాయనిచ్చినారు.

యిట్లు విధేయురాలు,
హిమబిందు.

అక్షరములు హిమబిందువే. ఇక నమ్మకఎట్లు! వినీతమతి మోము వైవర్ణ్యమొందెను. హిమబిందు ప్రాణము రాజ్యములతో సంబంధించి యున్నది. జంబూద్వీపమున వర్తకులకు చక్రవర్తియగు చారుగుప్తునకామె యొక్కతేకుమారితె. అతడామెకెంత మాత్రమాపద వచ్చినను ప్రాణములు విడచును. ఆతడాంధ్ర సామ్రాజ్యమున కేమగడ ఇక నేమున్నది. అని వినీతమతి మతిలేని మాటలు వణంకుచు తెలిపినాడు. సమవర్తి కథనుడువనక్కరలేదు. ఆతనినాళికలు విడివడియెను. ఆతడు తనవిశాలవక్షముల నింకను విపులముచేసినాడు. మృగమొక్కటి పరిసరమున సంచరించుచుండ ఆహార పగపట్టిన సింహమునలె ఆతడు గర్జిల్లినాడు. అయినను కోపమువలన లాభమేమి ఏమి చేయగలుగును? తాను అమెకై యుజ్జయినీ గోటవిడిపోయిన తన రాజ్యమునకు ప్రభువునకు తీరరాని అగౌరవము సంభవింపజేసిన వాడగునుకదా? హిమబిందును తాను ప్రేమించు చున్నాడు. తనకంతకన్న ప్రాణాధికమగు వస్తువేమి? తాను తనప్రాణమునకు వెనుదీయక పోవచ్చుగాక. ప్రాణమర్పింప సిద్ధముకావలదా! ఏమి చేయ

వలయు! స్వలాభము గౌరవము యశస్సుల కంటె తనప్రభువునాదేశము ముఖ్యము కాదా! ఓహో ఏమిచేయవలయు."

,, ఓ వినీతమతి సేనానాయకా! ఇప్పుడు మీరు నాకేమి యాలోచన చెప్పెదరు. మీరనినట్లు హిమబిందు ప్రాణముతో, గౌరవముతో, రాజ్యముల గౌరవము రాజుల యశస్సుపైన వేసికొనియున్నవి.,,

,,అట్లనే మన ఉజ్జయినీకోటతో రాజ్యముల గౌరవము, రాజులయశస్సు పైన వేసికొనియున్నవి. ఈ కత్తెరలో నిముడుకొనియున్న మన మేమిచేయవలయునో?,,

ఇంతలో నొక ప్రతీహారివచ్చి ,,మహాభాగులారా! శ్రీ శ్రీముఖ సార్వభౌములు సైన్యములతో సమీపించుచున్నారని చారుడొకడు వార్త గొనివచ్చినాడు,, అని తెలిపెను.



# దైవప్రార్థన

సీ. స్వర్లోక వాసిమా జనక నీ నామంబు
నిర్మలం బగుగాక నీదు రాజ్య
మరుదెంచు గాక నీ స్వాంతంబు పరలోక
విధమున భువి నెర వేరుగాక
నస్మదీయం బగునది దినాహారంబు
నీ వేళను నను గ్రహింపు మాకు
మా ఋణస్థుల మేము సైరించినట్లు మా
ఋణముల నీవు సైరింపు మయ్య
మమ్ము శోధన పాలుగా జిమ్మ బోక
కితవ జను బారికిని దొలగింపు మయ్య
స్వర్గరాజ్యంబు బలమును సకలమహిమను
నీవశము తాచు నిరతంబు నెగడు దేవ.

తథాస్తు

శ్రీ రాజా మంత్రిప్రగడ భుజంగరావు.

# విజ్ఞానవిషయములు

———:o:———

( ఆర్. రంగనాథశాస్త్రిగారు. )

——(o)——

వైజ్ఞానికులు గొంద రేకీభవించి నూతనపద్ధతులమీద టెలిఫోనును



నూతనముగ గనిపెట్టిన టెల్లిఫోను. గృహయజమాని తిరిగి యింటికివచ్చినంతనే దీనిద్వారమున దాను లేనప్పుడుజరిగిన విషయముల వినుచున్నాడు.

గనిపెట్టిరి. అది యితరులు చెప్పుదానిని గ్రహించును. దానిని యితరులకు జెప్పును. వారిచ్చు ప్రత్యుత్తరమును గైకొని మొదట వానికిని వేసంపును. యజమానిగృహమును వీడునప్పుడు తానేగు స్థలము మొదలగువానిని



నిస్త్రాతియంత్రముల బరిశీలించుచున్నాడు. ఈపరీక్షయందు తీర్మానము చేసి యీతనికి విశ్వవిద్యాలయమున యుద్యోగమైనది

కొనుటకు ప్రకృతియే యనేక మార్గముల చూపి యున్నది. కొన్నిటి శరీరము చెట్టుకొమ్మల రంగున



పురుగుయొక్క నేర్పు:—ఈకీటకము విపత్తునుండి దప్పించుకొనుటకు చెట్టుకొమ్మ రంగుగమారి దానివంటియున్నది.



ఈపురుగు చెట్టుఆకువలె శరీరమును జేసికొని యాకులలో నివసించుచున్నది.



ఇదియొక విధమగు సాలెపురుగు. ఇది యొక కొమ్మకుగూడు కట్టిదానికి కండ్లుపెట్టును. వానిచూచి దానిమీదికి పక్షి పురుగులు మొదలగునవి పారిపోవును—అది దానియందు సుఖముగ నివసించును—

యుండును. మరికొన్నిటి శరీరము చెట్టున మొండిన కొమ్మ రూపమున నుండును. కొన్నిటి శరీరము ఆకులవలెను పూవుల వలెనుండును. అందువలన వీనిని మరియొక పురుగు గుర్తింపజాలదు.



కొన్ని పురుగులు చేసిన కృత్రిమ రూపము. వీనిలో యవి సురక్షితముగ నుండును.

### 4. జ్ఞానప్రతిభ.

సుప్రసిద్ధుడగు జోసి యను భాస్కరు డొక విగ్రహమును నిర్మించి దానిని కొలంబసు మూర్తి పాద



ఈ స్త్రీ పూర్వకాలపు రెమ్మకలను బరీక్షింపు చున్నది—

దేశమందుంచెను. ఆమూర్తి విజ్ఞానముయొక్క కల్పితమూర్తి. దానివలన కొలంబసు యొక్క పురుషకారముంకట విజ్ఞానము పరాభవింపబడి నవ్వుచు చేతి యందు దీపమును బట్టుకొని యింకను దూరదేశముల జూపు చున్నది.



జోసియను భాస్కరుడుచేసిన విగ్రహము.

### 5 ప్రాణి తత్వము.

ఒక స్త్రీ ప్రాచీనయుగ మందలి ప్రాణితత్వమును బరి శీలను జేయుచున్నది. ఒక చోట కిర్ణనాయలుగని తెలివ్వు చుండ నందు రాళ్ళచే కప్పబడి



గౌరీశృంగమున కెక్కువారు మార్గమందలి లోయదాటు దృశ్యము. ఇచ్చోటకాలు జారినను, నిచ్చెనకు ముప్పువచ్చినను క్రిందలోయలోబడి మరణింతురు.



గౌరీశృంగమునకు సమీపమందుండు నొక శృంగము. దీనిమీదికి కొందరెక్కిరి.

యుండిన కొన్ని యెముకలుదొరికినవి. భూతత్వవిదులవి యత్యంత పురాతనమైనవని నుడువు చున్నారు. అస్త్రీవానిని బరిశీలింపు చున్నది.

6. దేహమందు బుట్టువైద్యుతిక శక్తి.

మానవుని హృత్పిండమందు వైద్యుతిక శక్తిబుట్టి యావైద్యుతికశక్తి మానవ శరీరమంతటను వ్యాపించునని వైజ్ఞానికులుగనిపెట్టిరి. ఈవిషయమును గనుగొనుట కొక సూక్ష్మయంత్రమును గనుగొనిరి. ఈయంత్రము ద్వారమున హృత్పిండము దేహమందలి యితర పార్శ్వములయందు వైద్యుతిక శక్తి గలుగుచున్నదా లేదా యని పరిశీలింపవచ్చును.

7. మట్టితో గట్టినవంతెన.

చీనాదేశపుశిల్పులు మట్టితో నొకవంతెన గట్టి వారిశిల్పచాతుర్యమునుచాటియున్నారు. ఈవంతెన యందెచ్చటను రాయిగాని లోహముగాని లేదు. ఈవంతెన చాల

పెద్దది. అత్యంతసౌందర్యమున నలరారు సంభవించును. ఈకారణమువలననసేక స్టీమ చున్నది. చీనాదేశపుచుట్టునుండు ప్రాకారులు మునిగిపోయినవి. దీనికి మా ర్కొ నొకయుపాయమును గని పెట్టెను. నిస్తంత్రి యంత్రము దిక్కులగూడనిర్ణయించునటుల జేసెను.

10 నిస్తంత్రి—మానవుడు.

మానవుని దేహముతో డ నిస్తంత్రికిమిక్కుటమగు సంబంధము గలదని బరన్నెట్టు అను వైజ్ఞానికుడొకడునిర్ణయించియున్నాడు. వైద్యుతికతరంగము



కృత్రిమసౌరజగత్తు.

రము ప్రసిద్ధికెక్కినటుల ఇది జగత్తునందు నిరుపమానమగుటయేగాక ప్రపంచము నందంతటను వ్యాపించునని నమ్ముచున్నారు.

8. కృత్రిమ సౌరజగత్తు.

విద్యార్థులకు సౌరజగత్తును గూర్చిబోధించునప్పుడు, గ్రహములనడక చంద్రసూర్యగణములు మొదలగునవి కనుపరచినగాని బాగుగ బోధపడదు. లండను విశ్వవిద్యాలయమందలి యొక పండితుడు సౌరజగత్తును నిర్మించి విద్యార్థులకు జూపించిపాఠములు జెప్పుచున్నాడు. అట్టిదిమన దేశమందలి విద్యార్థులకు లభించిన విద్యార్థుల బుద్ధికుశలత యభివృద్ధి గాంచుననుటకు సందియమేమి?

9. నిస్తంత్రివలన దిక్కుల నిర్ణయించుట.

స్టీమరులు నడచునప్పుడే కారణమువలననైన దిగ్దర్శని యంత్రము చెడినచో చాల విపద



దేహమందుండు వైద్యుతిశక్తిని గనుగొను యంత్రమును బరిశీలించుచున్నాడు—



దిక్కులనిర్ణయ మొనర్చు నిస్తంత్రి యంత్ర రూపము.

వలన రేడియోఫోను చలించునటులనే నిస్త్రితరంగములవలనగూడ మానవుని దేహమందు సంచలనము గలుగును. ఆతడు గనిపెట్టిన

ఈశృంగము నెక్కుటకు బ్రయత్నించిన వారిలో ననేకులు మరణించిరి. వారుబడు బాధలపారము, అయినను పట్టు విడువక



నిస్త్రితికిని మానవునకును గల సంబంధమును దెలుపు యంత్రమును పరీక్షింపుచున్నాడు-



మట్టివంతెన.

నూతనయంత్రము వలన నీవిషయమును గ్రహింపవచ్చును.

బ్రయత్నించుటవలన వారి పట్టుదల దెలియుచున్నది.






## చీమలదండు

ఆర్టువార్కు అను నొక చీమలదండు చీమలలో చాల విచిత్రమైన జంతువని జంతు శాస్త్రజ్ఞులు నుడువుచున్నారు. ఇది దక్షిణాఫ్రికా యందును, సెనిగాల్ అను దేశములోను, దక్షిణ న్యూబియా దేశములోను మాత్రమే కానవచ్చు చున్నవి. పైదవడ 14 దంతములును క్రింది దవడకు 12 దంతములు నుండును. దానిమూతి పందిమూతిని బోలియుండును. పొడుగు వాలికను, నిడుపైన చెవులను లావుతోకను, గరుకు వెండ్రుకలను కల్గియుండుటచే నిది చీమలజాతినుంచి కొంచెము భేదించియున్నది. ముందు కాళ్లకునాల్గును వెనుక కాళ్లకుఐదును పదునైనగోళ్లుండును. వానిమూలముననే కొండలపైన నుండు పెద్ద పెద్ద చెదలుపుట్టలను పెళ్లగించి చీమలను దినుచుండును. ఇది సాధారణముగ రాత్రియందు చరించుచుండును, చాల పిరికిదగుటచే దానినితరము కాని వచ్చుజంతువుల కందకుండు నటుల త్వరితముగ నేలలో రంధ్రమొనర్చి దూరిపోయి దాగుకొనుచుండును.

## అబాకా నార

ఫిలిపైను దీవులలో మనదేశములోని అరటిచెట్లనుబోలిన అబాకా చెట్లువిరివిగ పెరుగుచుండును. ఆద్వీపము లందలి ఆదిమ నివా[illegible] అబాకాఅని పిల్వబడుచే [illegible] కానిని అబాకాయని [illegible] శాస్త్రజ్ఞులు పిల్చుచున్నారు. ఈ చెట్టుయొక్క నార చాల ప్రశస్తమని శాస్త్రపరిశోధకులచే తెలిసికొనబడినప్పటి నుండియు అవృక్షములను మరింత బాగుగ వృద్ధిపరచుటకై పాశ్చాత్యులు శ్రమపడు చున్నారు. దానినారచే మంచితాళ్లు పేనబడు చున్నవి. అమెరికా దేశము వారీద్వీపముతో ప్రతిసంవత్సరము 2,600000 పౌనుల ఖరీదుగల నార వ్యాపారము చేయుచున్నారు.

## పిపీలిక సింహము.

దక్షిణయిరోపా దేశములలోను ఉత్తర అమెరికాలోను ఈపురుగులు మిక్కుటముగ కానవచ్చుచున్నవి. చీమలు మొదలగు పురుగులను వేటాడుచుండు పురుగు కావుననే దీనిని పిపీలికసింహమని పిల్చుచున్నారు, ఇది సుమారొక అంగుళము పొడుగుండును, దీనివర్ణము గోధుమము. వంకరతిరిగిన రెండు చేతులతోను చీమలను గట్టిగ పట్టుకొనును. ఇసుక ప్రదేశములలో నివసించుచుండును. సింహ మేరీతి యుక్తితో జంతువులను పొంచుండిపైబడిచంపిభక్షించునో అవ్విధముననే ఈ పిపీలికసింహము కూడ యుక్తులచే చీమలు మొదలగు పురుగులను పట్టుచుండును. ప్రప్రథమమున ఇసుకలో నొక చిన్నగుంటచేసి చుట్టును పలుచగ ఇసుక నేర్పరచును. అగుంటకు సమీపముననే తన వేటకై వేచియుండును, కొంత నుండు చీమలు సాధారణముగ నాగుంటలో నేదియో కలదని దిగును. ఆఇసుక చాల పలుచగనుండుటచే వాని కాలుజారి గుంటలోపడి పైకివచ్చు సమయమున నిది చీమలపైబడి వాని దేహములోని సారమును పీల్చివేయును. ఇట్లనేక విధములుగ

శత్రువులచే చుట్టబడినప్పుడా వార్తను పావురమును కట్టిదీసికొనివచ్చెను. ఈప్రయాణమున పావురమునకొంటికి కుప్పాకిరవ్వతగిలికన్నుపోయెను. శిరమునుండి నెత్తురు గారుచుండెను. అప్పుడీపావురము వార్తను తీసికొని రానియెడల నా సైన్యవాహిను లేమయ్యెడివో చెప్ప జాలము.

పదాతి సైన్యములేషను గుడ్డసంచిని ఆక్సిజన్ తో నింపి యందు పావురమును బెట్టి వీపుమీద నుంచుచుందురు. ఆక్సిజన్ తో నిండుట వలన శత్రువులు విడుచువిషముతో గూడిన గ్యాసులవలన విమరణింపవు. ఈపదాతి సైన్యము ఆహారము లేక భూమి యందలి గోతులయందు దాగుకొని యుండవలసి వచ్చును. అట్టిస్థితియందు పావురములు వారివార్తలను దీసికొని యేగి సైన్యముల కెరిగింపుచుండును. స్పయిక్ అను పావురము మహాయుద్ధమందు 56మార్లు ఫిరంగులు తుపాకుల గుండ్లవర్షమునుండి శత్రుసైన్యములదాటి వార్తల నందించెను. కాని దానిశరీరమున రవ్వయైనను తగులలేదు.

వార్తలుగైకొని యేగుపక్షులు 100 గజముల యెత్తునెగిరి పోవుచుండును. ఇంతయెత్తునకు గుండ్లుకారుచేసి పక్షుల చంపుట కఠినము. గ్యాసుకూడ యింతపైకిపోజాలదు. పావురములను బట్టిచంపుటకు డేగలను బంపుచుందురు. అవిపావురములను చంపుచుండును. కాని ఫ్రెంచివారు పక్షులనెగర వేయునప్పుడు దానితోక కొక వెదురుముక్క గట్టుదురు. అదియెగురునప్పుడు వికట శబ్దము చేయుచుండును. ఆశబ్దమునకు భయపడి డేగలు వానిని సమీపింపవు.

1916 సం॥ ఫ్రాంసువారొక ఆకాశఫోటగ్రాపుయంత్రమును గనిపెట్టిరి. దానిని పావురము పొట్టకు గట్టుచుండిరి. ఈకెమెరా అల్యూమినముతో చేసినది. అందువలన నతితేలిక. దీనికి రెండు రెక్కలుండును. ఒకటి యెదురుగనుండును, రెండవది పైగనుండును. కెమెరాకు కొన్ని రంధ్రము లుండును. వానిలోనికి గాలిపోయి రెక్కలను కదలించును. అప్పుడు శత్రువాహినుల ఫోటోగ్రాఫ్ అందు పడును.

మానవు లందరు పావురముల పెంచుచుందురు. వీని వేగ మత్యద్భుతము. ఒక పావురము స్వల్పకాలమున 1800 మైళ్లు పో గలిగెను. యుద్ధసమయము అందే కాక మిగిలిన సమయముల గూడ వీని ప్రయోజన మద్భుతము. ఇట్టిపక్షులవెల చాలమిక్కుటము, మంచి పక్షి వెల 64 వేల రూప్యము లుండును. వీనికి మంచి మేతగావలయును. ఇవిమిక్కిలి విలాసము గోరుచుండును.

## ఆకాశమున ప్రకటనలు.

మహా యుద్ధానంతరము ఆకాశ విమానములతోడ ననేకపరీక్షలు జరుగుచున్నవి. ఆకాశవిమానములనెక్కి ధూమసహాయమున ఆకాశమందు ప్ర క ట న ల ను వ్రా యు చు న్నా రు. ఇవి వర్తకులకు మిక్కిలి యుపయోగము. రెండుమైళ్ల యెత్తున ఆకాశము మీద ప్రకటనలను ధూమముతోడ వ్రాసిన 150 మైళ్లపరకుండు జనముకా విషయము గనుపడును. క్యాథెక్ యను సేవాని ప్రథమమున దీనిని చేసి చూపెను.

ఆకాశమున ప్రకటనము వ్రాయుటకు ప్రత్యేకముగ ఆకాశ విమానములు నిర్మింపబడు చున్నవి. ఈవిమానములు నిముసమునకు రెండు మైళ్లకంటె మించినడచును. ఈకార్యము చేయువారలు చాలా సమర్థులు. బుద్ధిచతురత గలవారు.



# విషయసూచిక.

—————:౦:—————



# చిత్రపటములు





